# నవజీవనం

( అవతార్ మెహెర్‌బాబా నవజీవన ఘట్టం )

## నాల్గవ భాగం

: సంకలనం :
జి. వి. జి. కె. చంద్రమౌళీశ్వరరావు

# NAVAJEEVANAM

[ Fourth Part ]

Compiled by
G. V. G. K. CHANDRAMOULESWARA RAO

First Edition : 10th July 1985

PRICE: Rs. 8-00

Title C

# తొలి పలుకు 

మెహెర్ అవతారుని కార్యక్రమంలో "నవజీవనం" అతి ముఖ్యమైన ఘట్టం. ఆధ్యాత్మిక క్రీడలో కోరితెచ్చుకున్న కష్టాలు, బాధలతో నిండియున్న జీవిత ప్రవాహమది. పూర్వావతారాల్లో కూడ యిలాంటి జీవనం క్రొత్తేమీ కాదు. అయితే రామావతారంలో, కైకేయి మిషతో పిత్రాజ్ఞ జవదాటకుండుట అనేది ధ్యేయంగా, రాజ్య పట్టాభిషేకాన్ని వదిలి, నార బట్టలతో అరణ్యవాసము జరపటం కూడ యిటువంటిదే. అయితే యిది పరిస్థితుల వలన చేపట్టగా, మెహెరవతారంలో స్వచ్ఛందంగా కోరుకొని సాగించారు. దాని వలన ఆయన దివ్యత్వం ప్రసరింపబడి, కామ క్రోధ లోభ మోహాదులు, దివ్యప్రేమ జ్వాలలో [illegible]టలం కాగలవు.

చదువరులు యిష్ [illegible] తనివితీరా
చదివి, యీ నవలన

4

నృత్యం చేసే నెమలి ఆనందంలో తన్ను తాను మరచినట్లు, నవజీవన కార్యక్రమం, పరమాత్మమీద దృష్టిని కేంద్రీకరించి, ప్రాపంచిక జీవనం మరుగునపడేందుకు దోహద పడుతుంది. అవతారుని సాంగత్యంలో సర్వ సంగ పరిత్యాగులైన శిష్యులు సమస్తం మరచి, తమకు తాము ఆయనకు సర్వార్పణ గావించుకున్నా, మానశిక సంక్షోభాలకు వారు ఎలా గురి అయ్యారో, క్షణికోద్రేకాలకు ఎలా లోనయ్యారో, మళ్ళీ బాబా కృప వలన వాటి నుండి అధిగమించారో, యీ నవజీవనంలో మనకు కళ్ళకు కట్టినట్లు కనపడతయి.

ఓర్పు, సహనం, దయ, కరుణ, ఎలా అలవరుచుకోవాలో, ఎటువంటి సంక్షోభంలోనైనా, మానశిక తాపాన్ని భరించి, బాబా ఆజ్ఞలు పాటిం[illegible]గాలో, వీటికి సంబంధించిన సంఘటనలు యిందులో చక్కగా వివరిం[illegible]జీవన నడవడి ప్రపంచమున్నంత కాలం ఉంటుందని, దానిని [illegible] ప[illegible] అనుసరించటమేనని బాబా చెప్పారు.

[illegible]నం చేయగల

# అభినందన

శ్రీ జి. ఏ. జి. కె. చంద్రమౌళీశ్వరరావు రచించిన మెహెర్ కథా మంజరి, మెహెర్ మండలి, భగవద్వచనములు, నవజీవనం, మెహెర్ మందారము మున్నగు గ్రంథములను నేను రైలు ప్రయాణము చేయు సమయంలోనూ, యితర వూళ్ళల్లో లాడ్జింగులలో బస చేసిన కాలంలోనూ తీరికగా వున్నప్పుడు చదవటం జరిగింది.

నాకు ఆధ్యాత్మిక విషయాలకు సంబంధించిన పు [illegible] టంలో ప్రవేశం లేదు. కానీ అవ [illegible] ధించిన పై గ్రంథములు తేటతె [illegible] బా వారి కారుణ్య [illegible]

బాబా సాహిత్యం ఇంగ్లీషులో పాశ్చాత్యులచే ప్రచురింపబడి, అధిక ధరలో చాలా వున్నాయి. అయితే శ్రీ చంద్రమౌళీశ్వరరావుగారి సంకలనాలు, ఎన్నెన్నో విషయ సేకరణ జరిపి, చక్కని తేలిక భాషలో, తక్కువ వెలలో అందరికీ అందుబాటులో వున్నాయి కనుక, అందరూ తనివితీరా చదివి బాబా ప్రేమకు పాత్రులు కాగోరుచున్నాను.

ఇట్లు

మచిలీపట్నం ః గుడివాడ రామచంద్రరావు

10-7-1985 ః కార్యదర్శి

అవతార్ మెహెర్‌బాబా సెంటరు

# విజ్ఞాపన

ఇప్పటి వరకూ, తెలుగులో వెలుగుకురాని అవతార్ మెహెర్‌బాబా నవజీవన ఘట్టాల్ని మూడు భాగాలుగా యింతకు మునుపు ఆంధ్ర బాబా ప్రేమికుల ముందుంచడం జరిగింది. యీ నాలుగో భాగంలో, ముఖ్యంగా హైదరాబాదులో ఆరంభించిన "మనోనాశ్"ని ఆసాంతం దిగ్విజయంగా పూర్తిచేసి అవతారునిగా కీర్తింపబడే బాబా ఒక సాధకునివలె పనిచేసిన తీరును వివరించడం జరిగింది.

1952 ఫిబ్రవరి 16 తో నవజీవన కాలం పూర్తి కావటం వరకూ జరిగిన అనేక సంఘటనల్ని సేకరించి యిందులో పొందుపరచబడ్డాయి. నా కృషికి దోహదపడే అంశాల్ని అప్పుడప్పుడు సంభాషణ సమయాల్లో అందించిన, సోదరులు ఈరుచ్, బాలనాటులకు నా హృదయపూర్వక కృతజ్ఞతలు.

నా రచన లన్నిటినీ ప్రోత్సహించి
పూనుకొని ప్రచురణకు బాధ్యత వహించి
వారికి నా హృదయపూర్వక నమస
యీ నాలుగో భాగం వెలుగులోనికి
శ్రీ తాడేపల్లి బసవయ్యగారు మరియు (
గారలు. వారికి నా హృదయపూర్వక అ

ఏ మాత్రం ఖాళీ లేకున్నప్పటికీ, యీ పుస్తకాన్ని సర్వాంగ సుందరంగా అచ్చొత్తించి సకాలంలో అందించిన స్పందన ప్రింటర్సు మచిలీపట్నం వారికి నా ప్రత్యేక ధన్యవాదాలు.

బాబా నవజీవన ఘట్టంలో ఆఖరి భాగమైన యీ నాలుగో భాగాన్ని సహృదయంతో స్వీకరించి అశేష ఆంధ్ర బాబా ప్రేమికలోకం, బాబా ప్రేమ దివ్యాంబుధిలో ఓలలాడెదరు గాక ।

జై బాబా !

మచిలీపట్నం
10-7-1985

ఇట్లు
జి. వి. జి. కె. చంద్రమౌళీశ్వరరావు

# నవజీవనం

నాల్గవ భాగము

## ఏకాంత వాసమునకు నాంది

బాబా నవజీవనం గడుపుతున్నప్పటికీ దినచర్యలు మాత్రం అనేక కష్టాలు, యిడుములతో కూడి వుండేవి. తాను నిమగ్నమై వున్న ఆధ్యాత్మిక క్రీడలో అవన్నీ ఒక భాగం. 1950 డిశంబరు వరకు చేసిన మస్తు పర్యటనతో అందు నిమిత్తం వుంచిన పైకం పూర్తిగా ఖర్చైపోయింది. బాబా మహాబలేశ్వర్ తిరిగి వచ్చాక, ఆ సంవత్సరం బాబా చేయాలనుకున్న అమెరికా ప్రయాణం సాధ్యమయేటట్టు లేదని అమెరికా నుంచి ఎలిజబెత్ పాటర్సన్ కేబుల్ పంపింది. అందుచేత, బాబా పాశ్చాత్య పర్యటనా కార్యక్రమం రద్దు చేసుకున్నారు. మళ్ళీ మస్తు కార్యక్రమం ప్రారంభించాలని నిశ్చయించుకున్నారు.

అదీగాక, అద్దెకుతీసుకున్న ఫ్లారెన్సుహాలు మే నెలతో గడువు పూర్తవుతుంది. సాధారణంగా మహారాష్ట్రలో వర్షాలు జూన్ మొదటి వారంనుండి అరంభమవుతాయి. సూర్యుడు కనిపించక మబ్బులు కమ్ముకుంటయి. ప్రత్యేకంగా మహాబలేశ్వ

రంలో వర్షపాతం ఎక్కువ. అందుచేత బాబా సమశీతోష్ణ ప్రదేశం ఎంచుకొని వెళ్ళిపోవాలనుకున్నారు. అందుకు అనువైన నగరం హైదరాబాదు అని నిశ్చయించి ఆదీని బ్లూ చవర్లెటు కారు మహాబలేశ్వర్ తీసుకురమ్మనమని కబురంపారు. ఆదీతో ముందుగా హైదరాబాదు వెళ్ళి, తాను తన బృందంతో హైదరాబాదులో వుండేందుకు అనువైన రెండు భవనాలు ఎంచుకొన సంకల్పించారు. అక్కడ వున్నప్పుడు దైవోన్మత్తులను కలవాలని కూడ సంకల్పించారు.

బాబా కబురందుకున్న ఆదీ ఆఘమేఘాల్లో బ్లూ చవర్లెట్టు కారుతో మహాబలేశ్వరం చేరాడు. 1951 జనవరి మూడవ వారంలో బాబా కొద్దిమంది మిత్రుల్ని వెంట బెట్టుకొని హైదరాబాదు బయలుదేరారు. దారిలో బాబా షోలాపూర్‌లో ఆగి ముగ్గురు మస్తుల్ని కలిశారు. వారిలో గులియప్ప అనే యోగి, అయిదవ భూమికలో వున్న మస్తు, ముల్లాబాబా అనే మరో మస్తు చాలా మురికిగా కనపడేవాడు. అయన్ని అంతా ఎంతో సాదరంగా గౌరవించేవారు. యిలా ఈ మస్తుల్ని కలిశాక, బాబా తన బృందంతో ప్రయాణం కొనసాగించి జనవరి 16 కల్లా హైదరాబాదు చేరారు.

ఉస్మాన్‌సాగర్ సమీపంలోని అతిధి గృహాన్ని బాబా బృందం వుండేందుకు మూడు రోజులపాటు అద్దెకు తీసుకున్నారు. మస్తుల వేదికముందు, మండలి సభ్యులు బాబా బృందంతో దాదాపు నాలుగు నెలలుపాటు వుండేందుకు అన్ని హంగులు వుండే

అధునాతన భవనం, ఏ ఎస్టేటు అధిపతులైనా అద్దెకు యిస్తారేమో నని ఆరాతీయడం ప్రారంభించారు. అద్దెకు తీసుకోవలసిన బంగళా వివరాలు దానికి వుండవలసిన హంగులు మున్నగు వివరా లన్నీ బాబా ఆదీకి ముందుగానే చెప్పారు. అందుచేత ఆదీ బాబా ఆదేశాల్ని తు. చ. పాటించి రెండు చక్కని బంగళాల్ని ఎంపిక చేశాడు. ఎటువంటి ఆటంకములు లేకుండానే ఆ రెండు బంగళాలు చట్టపర ఇబ్బందులేవీ రాకుండా వారి స్వాధీనంలో అద్దెక్రింద యిచ్చు ఏర్పాట్లు పూర్తి చేశాడు ఆదీ.

బంగళా ఏర్పాట్లు పూర్తిఅగుట వలన, మస్తు కార్యక్రమం చేసేందుకు వీలయింది. వున్నది మూడు రోజులే అయినా, 31 మంది మస్తుల్ని బాబా కలిశారు. అతి కొద్ది కాలంలో అందరు మస్తుల్ని బాబా కలవటం చాలా అరుదైన సంఘటన. బాబా మహాబలేశ్వరం తిరిగి వెళుతూ దారిలో గుల్బర్గాలోను, హుమనా బాదులోను ఆగారు. ఇట్కా అనే ఊళ్ళో వున్న "స్వామీ" అనే మస్తును కలిశారు. ఈ ప్రేమోన్మత్తుడు మంచి ఉత్సాహంలో వుండి బాబా యిచ్చిన మిఠాయిలు సాదరంతో పుచ్చుకున్నాడు. ఒక మస్తు ఆధ్యాత్మిక భారాన్ని తన భుజస్కంధాలమీద మోయ టానికి యిష్టపడటానికి స్వామి అప్పుడున్న స్థితి నిదర్శనమని బాబా అన్నారు. అక్కడ నుండి బాబా బృందం తిన్నగా మహా బలేశ్వరం చేరారు.

# దైవ సేవా ఫలం

దేమునికి చేసిన సేవ వృధా ఎన్నడూ కాదు. అదీ చెప్పిన ఓ చిన్న సంఘటన గుర్తుంది. అది ఈ సందర్భంలో చెప్పుకో వటం వుచితమని మీముందుంచుతున్నాను. అది 1945 వ సంవత్సరంలో జరిగింది. రెండవ ప్రపంచ మహాసంగ్రామం జరుగు తున్న రోజులవి. ప్రశాంత వాతావరణంలో ఏకాంత వాసం గడపా లని బాబా నిశ్చయించి, అందుకు అనువైన ప్రదేశం హైదరా బాదు నగరమని తలచారు. ముందుగా వెళ్ళి, నగరానికి దూరంగా చక్కని బంగళా ఏదైనా అద్దెకు తీసుకోమని ఆదీజీని హైదరాబాదు పంపారు.

బాబా ఆదేశాల మేరకు ఆదీ హైదరాబాదు చేరి, జూబిలీ హిల్సులో క్రొత్తగా కట్టిన సుందర భవనమొకటి ఖాళీగా వుంటే దాన్ని అద్దెకు తీసుకోవటానికి ఖాయపరచాడు. ఆ భవనంలో అన్ని హంగులూ వున్నయి. యీత కొలను, చక్కని లాన్సు, పూపొదలతో చూడ ముచ్చటగా వుంది. గది గదికీ పంకాలు న్నయి. పెద్ద పెద్ద బల్బులు వేలాడుతున్నయి. ఆ భవనం చూచి బాబా ముచ్చట పడతారనుకున్నాడు ఆదీ.

బాబా స్త్రీ మండలితో ఆ భవనంలో ప్రవేశించారు. ఆదీతో పాటు కొద్దిమంది పురుషమండలి కూడా వున్నారు. భవన పరిస రాలు చూచి మండలి అంతా సంతోషించారు. కాసేపట్లోనే ఆ యింటికి విద్యుత్ కనెక్షన్ యివ్వలేదని తెలిసిపోయింది. ఇంత ముఖ్యమైన విషయం గమనించ నందుకు ఆదీజీని బాబా మంద

లించారు. ఆరోజుల్లో కిరసనాయిలు దొరకడం కూడా కష్టంగా వుండేది. దీపాలు లేకుండా ఎలా ఉండాలని బాబా అడిగే సరికి, ఆదీ ఖిన్నుడై పోయాడు. తెలివితక్కువగా ప్రవర్తించి, తన ఆజ్ఞల్ని సరిగా ఆచరించని ఫలితంగా తనదగ్గరనుండి వెళ్ళి పొమ్మన్నారు. ఆ యింట్లోనుంచే కాక, వూళ్ళోనుంచికూడ వెళ్ళి పొమ్మన్నారు.

బాబా ఒక ప్రత్యేక కార్యక్రమంపైన వచ్చారు కనుక, ఆయన అవుసరాలకనుగుణ్యంగా ఆ బంగళాలేనందున, బాబా మందలింపులు ఆదీని ఖిన్నుణ్ణి చేశాయి. చాలా దుఃఖించాడు. ఏం చేయాలో పాలుపోలేదు. బాబాను ప్రశాంతపరచేందుకు ఆ యింటికి వెంటనే కరెంటు కనెక్షను తెప్పించట మొక్కటే మార్గ మనుకున్నాడు. ఆ బంగళా ఒక నవాబుది. ఆయన్ని కలిసి కరెంటు కనెక్షనుకు ఎందుకు రాలేదని విచారించాడు.

ప్రత్యేక పరిస్థితులలో వెంటనే కరెంటు కనెక్షను పొందా లంటే, అప్పటి హైదరాబాదు రాష్ట్రంలో రాజైన ధరమ్ కరన్ కొక్కరికే అనుమతి మంజూరు చేసే అధికార మున్నదని తెలుసు కున్నాడు. ఆ రాజు భోగభాగ్యాలతో మహదైశ్వర్యము లనుభవిస్తూ రాజరికం చేస్తున్నాడు. ఆదీ వెళ్ళి ఆయన దర్శనం కోరితే మూడుగంటలు కూర్చున్నప్పటికీ ఇంటర్వ్యూ ఇవ్వలేదు. చివరకెలాగో మేడ దిగి అతిథుల మందిరంలో నున్న ఆదీని అయిష్టంగా చూచాడు.

పాపం ఆదీ, తన రాకకు కారణాన్ని సవివరంగా చెప్పు కున్నాడు. బొంబాయి నుండి తన పెద్దన్నగారు మీ మహానగ రానికి వచ్చారు కనుక, వారి బృందమంతా మీ నగరపు అతిథు లుగా చూడాలని విన్నవించాడు. బాబా పేరు బయటపెడితే విషయం మరో రకంగా ఉండేది. కానీ అది బాబా ఆజ్ఞ. ఆయన పేరు బహిర్గత పరచ కూడదు. అప్పుడు రాజు కొంత తమాయించుకొని ఏం కావాలని అడిగాడు. తాము ఫలానా బంగ ళాలో దిగామని, ఆ యింటికి కరెంటు కనెక్షను మంజూరు కాలే దని, తాత్కాలికంగానైనా ప్రత్యేక అనుమతి మంజూరు చేయ మని ప్రాధేయపడ్డాడు. అంత రాజు అదీ వ్రాసిన దరఖాస్తుపై వచ్చీరాని అక్షరాలతో సంతకం కెలికినట్లు చేసి, అనుమతి ఇచ్చాడు. సంబంధిత అధికార్లను కలిసి, బాబా దిగిన బంగళాకు, కరెంటు కనెక్షను తెప్పించాడు. లైట్లు వెలిగాయి.

అప్పుడు జరిగింది తెలుసుకొని ఆదీ చేసిన కృషికి సంతోషించారు. బాబా ఒకరోజున ధరమ్‌కరన్ యోగులంటే అభి మానం చేత, బాబాను ఒక మహాత్మునిగా తలిచి ఆయన్ను కలవాలనే తలంపుతో వారున్న బంగళా దగ్గరికి వచ్చారు. ఆదీజీ గుమ్మంలోనే అతడ్ని చూచి, ' ఎందుకు వచ్చావు ? ' అన్నట్లు చూచాడు. తన మనస్సులో, రాజును కలవటానికి వెళ్ళినప్పుడు మూడుగంటలపాటు పడిగాపులు పడ్డ విషయం గుర్తుంది.

' మీ పెద్దన్నయ్యను చూచుటకు వచ్చాను ' అన్న రాజు మాటలు విని, ఆయన ఏకాంత వాసంలో వున్నారు. ఇప్పుడు

చూడటానికి వీల్లేదు పొమ్మన్నాడు. అదే సమయంలో బాబా మండలి క్వార్టర్సులో వున్నారు. ఎవరో ఆగంతకుడు వచ్చాడు. ఎందుకు వచ్చాడో కనుక్కోమని ఒక శిష్యుడ్ని పంపారు. విషయం తెలుసుకొని ఆదీని పిలిపించారు. రాజును లోనికి తీసుకురమ్మని ఆదీని పంపి, అనుకోని విధంగా ధర్మదర్శన భాగ్యం కలిగించారు. తర్వాత తన కుటుంబ సమేతంగా వచ్చి, బాబా దర్శనం చేసుకున్నాడా రాజు.

దానిని బట్టి మనం తెలుసుకోవలసిన నీతి వున్నది. మనకు తెలిసియో, తెలియకో దైవమానవునికి సేవ చేసినా, ప్రేమించినా, వ్యతిరేకించినా దాని ఫలితం వృధా పోదు. ఒక సారి అవతారునితో అనుబంధం ఏర్పడిందంటే, ఆయన దయ, కృప, లేదా ఆశీస్సులు పొందేట్లు చేస్తుంది. నిత్య సహచరులవు తారన్నమాట.

## నూరు రోజుల ఏకాంత వాసము

1951 ఫిబ్రవరి 13 వ తేదీ నుండి నూరురోజుల ఏకాంత వాసం ప్రారంభించాలని నిశ్చయించారు. అంతకు ముందు జరి పిన ఏకాంత వాసములతో పోల్చినపుడు, యీ నూరురోజుల ఏకాంత వాసము భిన్నంగా వుంటుందన్నారు. యింకా సమయ మున్నందున యీలోగా బొంబాయి వెళ్ళి వద్దామని బయలు దేరారు. దారిలో అరణ్యేశ్వరస్వామి దేవాలయంవద్ద ఆగి పీలా మాయి యిచ్చిన పైకొన్ని పేదలకు పంచిపెట్టారు. పీలామాయి బాబా ప్రథమ శిష్యగణంలో అగ్రగణ్యురాలు. కరాచీలో పారశీ

మత స్తులంతా ఎద్దేవా చేసినా, బాబా శృంగరాలు, లాకెట్లు ధరించి బాబా దైవత్వంలో ఆమెకున్న నమ్మకానికి ఆశ్చర్యపడేట్లు చేసిన ధన్యురాలు. నవజీవన ప్రారంభంలో ఆమె బాబాకు సమర్పించు కున్న కానుకను యిప్పుడు బాబా పేదలకు బహుమతిగా ప్రసా దించారు.

బొంబాయిలో నారిమన్ దాదా చాస్జీగారి అతిమానా భవ నంలో మకాం చేసి, నగరంలో మ స్తులనేకులను కలిశారు. కొద్ది రోజులు గడిపి, మళ్ళీ మహాబలేశ్వరం వెళ్ళిపోయారు. ఫిబ్రవరి 12 వ తేదీన ఫ్లారెన్సుహాల్లో తన మిత్రులతో సమావేశం జరి పారు. ఆరోజునుండి తన మిత్రులందరికీ, నవజీవన నియమాల నుండి స్వేచ్ఛను ప్రసాదించారు. అయితే ముఖ్యమైన కొన్నిషర తులు మాత్రం పాటించాలన్నారు. కామ పూరిత పనులు చేయ రాదని, బాబాకు సన్మానం చేసే పరిస్థితులు కలిగించరాదని, పాత జీవితపు శిష్యులతో, ఉత్తర ప్రత్యుత్తరాలు జరపరాదని, ఒకరి బట్టలు ఒకరు ధరించరాదని, ఎవరివద్దనుంచి ఆహారం తీసుకో రాదని, అన్నిటికంటే ముఖ్యంగా, బాబా ఎడల నూరుశాతం విధే యత ప్రదర్శించాలని ఆదేశించారు. అంతేకాక, 1951 జూన్ 10 వ తేదీ వరకు, మిత్రులంతా, సేవకులుగా తనతో వుండాలని కూడా నిర్దేశించారు.

ఫిబ్రవరి 13 తేదీన పవిత్రమైన ఏకాంతవాసము ఆరంభ మైంది. యీ ఘట్టంలో బాబాకు అధికమగు శారీరక, మానసిక శ్రమ కలిగింది. యిది పాక్షికమైన ఏకాంత వాసము నూతన

జీవిత ప్రమాణానికి సంబంధించినది. రానున్న క్లిష్ట స్థితిని అనుగుణ్యంగా ఎదుర్కొనేందుకు, అగా ఖాన్ బంగళా (ఫారెస్టు హాలు) ఆవరణలో తన కార్యక్రమ స్థళాలను సవరించుకున్నారు. కొన్నిసార్లు ప్రత్యేకంగా తాటాకులతో నిర్మించిన పూరింటి క్యాబిన్‌లో వుండేవారు.

ఈ నూరురోజుల ఏకాంతంలో మొదటి 40 రోజులు చాలా క్లిష్టంగా పరిణమించాయి. తాను చేస్తున్న కార్యక్రమంలో ఎదురయ్యే ఆధ్యాత్మిక భారంలో పాలుపంచుకొనేందుకో ఏమో, ఆలీషా అనే అయిదవ భూమికలో వున్న మస్తును అహ్మద్ నగర్ నుంచి పిలిపించి ఆ మస్తుతో రోజుకో అరగంట పని చేశారు. ఫిబ్రవరి 15 నుండి మూడు వారాలపాటు అతనితో ఆంతరంగిక కార్యక్రమం కొనసాగించారు.

మొదటి వారంరోజులు కఠిన ఉపవాసం చేశారు. ఆ దరిమిలా ఒకపూట మాత్రమే ఆహారం తీసుకున్నారు. కుటీరంలో బాబా చేస్తున్న కార్యక్రమం వలన బాగా నీరసించి పోయారు. బయటకు వచ్చినప్పుడల్లా అలసిపోయినట్లు కనపడేవారు. ఆయన చేస్తున్న కార్య భారానికిదే నిదర్శనం.

కుటీరంలో ఆయన చేసే కార్యక్రమం ఏదో సరిగా అవగాహన కాకపోయినా, రాత్రిళ్ళు ఒంటరిగా లోపల గంటల తరబడి కటిక చీకట్లో గడిపేవారు. ఒక్కొక్కప్పుడు మిరుమిట్లు గొలిపే వెలుతురులో వుండేవారు. దానిని బట్టి కారు చీకట్లు కమ్ముతున్న శక్తుల నెదుర్కొనుచున్నట్లో, ప్రజ్వరిల్లబోయే

ఆధ్యాత్మిక తేజస్సును అందించే రానున్న రోజుల్నో గుర్తుచేసే రీతిలో ఆ కార్యక్రమం అనిపించేది. అయితే దీని విశిష్టతను మాత్రం బాబా ఎప్పుడూ చెప్పలేదు. ఆయన ఆ సమయంలో చేసిన కార్యక్రమ ఫలితంగా సిద్ధించే ఆధ్యాత్మిక ఫలితాలేమిటో, అవి మనకెంతవరకు వుపయోగపడతయ్యో, మనం వూహించ లేము.

ఆయన ప్రేమికులుగా మనం గుర్తుంచుకోవలసింది ఒక్కటే. ఆయన ఏమిచేసినా, దాని లోతుల్ని మనం కొలవ లేము. ప్రియతముడు తన యిచ్ఛతో యిచ్చే ప్రేమకు వివరణ లేదు. ఆనాడు ఆయన సన్నిధానంలో గడిపినవారు చెప్పేదానిని బట్టి, తాను నిర్వహించిన ఏకాంతవాస కార్యక్రమ ఫలంగా, విప రీతమైన నిస్సహాయతతో అధికమైన శారీరక శ్రమను ఎదుర్కొ న్నారనేది నిర్వివాదాంశం. నూరురోజుల ఏకాంతవాస సమయంలో బాబా శారీరక స్థితిని గురించి పరిశీలిద్దాం.

శారీరక శ్రమతో కూడుకున్న యీ నూరురోజుల ఏకాంత కాలంలో రోజూ సాయంత్రం మండలి వారిని బాబా సమక్షంలో సమావేశపరచి, వారిచేత, వుర్దూ, మరాటీ ఇంగ్లీషు భాషల్లో ప్రార్థనలు చేయించేవారు. బాబా శారీరకంగా పడే బాధను, నిస్స హాయతను, చూడలేక డాక్టరు గోహెర్ ఒకరోజున భోరున ఏడ్చేసింది. అది చూచి బాబా ఆమెను, ఎందుకు ఏడుస్తున్నావు? అని అడిగారు. "మేము చేయకలిగినంతా చేసినా మీకేవిధంగాను సహాయపడలేదు కదా !" అంటూ కన్నీళ్ళతోటే జవాబిచ్చింది.

అందుకు బాబా జవాబిస్తూ, ' మీరు దుఃఖిస్తే నా బాధ తగ్గుతుందా? అంతా దైవ నిర్ణయప్రకారం జరుగుతోంది. ఎలాంటి పరిస్థితుల్లో కూడా మీరంతా వుల్లాసంగా ఆనందంగా వుండటమే మీవంతు ' అని హితవు చెప్పారు.

ఈ నవజీవన ఘట్టంలో ' బాబా ' బహు పరిమితులతో కూడిన మానవునిగా ప్రవర్తించినట్లు కనపడినా, ఆయన, అనంతానందం కలిగిన అవతారుడని గుర్తుంచుకోవడం చాలా కష్టమైన విషయం. మానవాళియొక్క పరిమిత బాధల్ని తనపై వేసుకొని, అవతారుడై వుండి కూడా తానొక మానవుడేనన్న విధంగా వాటిని అనుభవించారు. తన ప్రేమని అందరికీ యిచ్చి, వారి బాధల్ని స్వీకరించారు.

మనకు తెలుసు శ్రీ కృష్ణుడు కూడ ఆ దివ్యమానవ దేహంతో భగవంతుడ్ని ప్రార్థించి ఆరాధించాడుగదా ! సాధు సత్పురుషుల సేవ చేస్తూ, తన భక్తులకు, ప్రేమికులకు ప్రేమ భావంతో అనేక విధాల ప్రేమనందించాడు. అలాగే జీసస్క్రీస్తు కూడా తాను భగవానుడై వున్నప్పటికీ, ' తండ్రీ వారిని క్షమించు' అంటూ ప్రార్థించాడు. అంటే భగవంతుని క్షమార్పణ కోరాలన్న భావం అందులో ఇమిడి వుంది.

అదేమాదిరి బాబా కూడా, యీ నవజీవన ఘట్టం జరిగిన అనేక సందర్భాలలో, తన తరఫున మండలి తరఫున జరిగిన తప్పులను క్షమించమని భగవంతుని ప్రార్థించేవారు. సాధారణ మానవునిగా పశ్చాత్తాపం, ఆరాధన, ప్రార్థన, సేవ వంటివాటిని

తన సేవక సహచరులతో ఆచరించేవారు. ఆయన పడిన బాధ ఎటువంటిదో మనకు తెలియదు. నోటి మాటలతో చెప్పలేము. కానీ, అవన్నీ ఆనాడు క్రీస్తు శిలువమీద వ్రేలాడి పడరాని బాధ ఎలా అనుభవించాడో అలా, బాబా కూడ మనకోసరమే ఆ బాధల్ని అనుభవించారనేది నిజం.

బాబా మిత్రులలో ఒకరైన డా॥ నీలూ ఆయనకు వైద్యుడుగా పనిచేస్తున్నాడు. ఒకరోజున డా॥ నీలూ బాబాకు ఇంజక్షను ఇచ్చేందుకు ప్రయత్నించగా సూది మెలికలు తిరిగిపోయిందే కానీ సిరంజిలోని మందు బాబా శరీరంలోకి ఎక్కలేదు. పాపం డా॥ నీలూ ఎన్ని జాగ్రత్తలు తీసుకొని, ఎంతో ఏకాగ్రతతో ఇంజక్షను చేయబోయినా విఫలమయ్యేసరికి గజగజ వణికి పోయాడు వళ్ళంతా ముచ్చెమటలు పట్టాయి. అప్పుడు బాబా ఎంతబాధలో వున్నా అణుచుకొని, తన అపార కరుణతో నీలూ వైపు చూచి క్షమించారు. యీ ఏకాంత కాలమంతా బాబా ఆరోగ్యం రోజుకో రకంగా మారేది. టెరామీటరులోని సూచి, శారీరక బలహీనతనే సూచించేది.

## విప్లవాత్మక మార్పు

అతి క్లిష్టమైన మొదటి నలభై రోజుల ఏకాంతవాస కాలం పూర్తవగానే, బాబా ఒక ప్రకటన చేశారు. ఒక పక్షం రోజులు గడిచాక అంతా దానిప్రకారం అనుసరించారు. “ 13 ఫిబ్రవరి 51 న ప్రారంభించిన నూరురోజుల ఏకాంత కాలంలోను, బహు

క్లిష్టమైన, అతి ముఖ్యమైన మొదటి నలుబది రోజుల్లో ప్రధాన కార్యక్రమం సాధించబడింది. దేవుని సహాయం లేకపోతే నేను క్లిష్టమయిన కాలం జయప్రదంగా గడిపేవాడిని కాను. ఈ కాలంలో నేను శారీరకంగానూ, మానసికంగాను ఎంతో శ్రమకు లోనయ్యాను. ఆ బాధల్ని దేముడే కలుగజేసినా, వాటిని భరించే శక్తినికూడ ఆయనే యిచ్చాడు. నేను చెప్పి వ్రాయించిన ప్రార్థనలు నా తరఫున నా సేవకులు చేసిన ప్రార్థనలు దేముడు అంగీకరించాడు.

మిగిలిన 60 రోజులు గడపటం నాకేమంత కష్టమైన పని కాదు. దేముని సహాయంతో ఏ పని చేయాలో, ఎప్పుడు చేయాలో, ఎక్కడ చేయాలో అంతా నేను చూచుకోగలను. ఈ నూరురోజుల ఏకాంతవాసం, నాకు సంపూర్ణ తృప్తి కలిగించే విధంగా జయప్రదము కానున్నది. దేముడు కూడా దానితో పూర్తి తృప్తి చెందుతాడని నేను భావిస్తున్నాను. రానున్న జూన్ 10 నుండి 30 జూన్ 1941 ల మధ్యకాలంలో, దైవం తన అనంత జ్ఞానం చేత, నా జీవితంలోను, సేవకులు, భక్తులు, ఏర్పాటువాలాలు. పాత జీవితపు శిష్యులు ఇంకా నాతో ప్రత్యక్షంగానూ, పరోక్షంగానూ సంబంధం వున్న వారందరిజీవితాలలోనూ, అసాధారణమైన విప్లవాత్మక మార్పేదో కలిగించేందుకు నేను ఒక అడుగు ముందుకు వేసేలా దేముడు నన్ననుగ్రహిస్తాడని పూర్తిగా విశ్వశిస్తున్నాను. ఆయన కృపపై నాకు అంతనమ్మక మున్నదని ఆయనకు తెలుసు.

అంతా దైవేచ్ఛ ప్రకారం జరుగుతుంది. మళ్ళీ వెనక్కు తీసుకోలేని ఆ అడుగు నేను తప్పక తీసుకునేలా ఆయన నిశ్చయించాడన్న గట్టి నమ్మకం నాకున్నది. యిటువంటి అడుగు పాత జీవితం కంటె యింకా పాత జీవితంలోకి నన్ను తీసుకపోవచ్చును. లేదా క్రొత్త జీవితంకంటే కూడ మించిన నవజీవనంలోనికి నెట్టవచ్చును. లేకపోతే యీ రెండు జీవితాల కంటే భిన్నమైన యింకా క్రింది జీవితంలోనికో, లేక వాటి కతీతమైన వున్నత జీవితానికో నన్ను తోసివెయవచ్చును.

దైవ సహాయంతో ఆయన యిచ్ఛవలన, 1951 జూన్‌లో నేను ఏమి చేయవలయునో దాని స్వభావమేమిటో, వెనక్కు తీయజాలని ఆ అడుగు యొక్క ఫలితమేమిటో నేను నిర్దిష్టంగా తెలుసుకొనేలా ఆయన చేస్తాడని, నిశ్చయంగా భావిస్తున్నాను. 16-10-51 న నేను ఆచరణలో పెట్టేవిప్లవాత్మకచర్య, 16-2-52 నాటికి ఫలవంతం కావడం జరిగి తీరుతుంది. ఇదంతా మీ అందరికి ముందుగా తెలిసేందుకు, ఎట్టి కలవరం కలుగకుండా నా మాటలు మీ కర్థం కావాలని, మీకు నమ్మకం కుదరకపోతే మీలో నమ్మకం కలిగించేందుకు యిదంతా విడమర్చి చెపుతున్నాను. ఏదిఏమైనా, తిరుగులేని నా పనియొక్క ఫలితం, ఆయన యిచ్ఛ ఎలావుంటే అలా ప్రసాదించ బడుతుంది. భగవంతుని ఇచ్ఛ ప్రకారం జరగవలసిన అసాధారణమైనదేదో అది జరిగి తీరుతుందే కానీ, ఒకరు కలవరపడినా, నమ్మకం వున్నా లేకపోయినా వాటి మీద ఆధారపడి జరగదు.

వెనక్కు తీయజాలని ఆ అడుగు నేను వేయడంలో ఎటు వంటి అవాంతరాలు, అభ్యంతరాలు రాకుండా, నా తృప్తికోసం, నాతోవున్నవారికోసం కొన్ని పనులు చేయవలసి వున్నది. నా పనికి అంతరాయం కల్పించే వాటితో నేను విచక్షణతో జాగ్రత్తలు తీసుకోవలసి వుంది. దైవం సహాయంతో, ఆయన యిచ్ఛ ప్రకారం నేను తిరుగు లేకుండా చేసే యీ పని పూర్తి ఫల వంతం అవుతుందని నాకు పూర్తి నమ్మకం వుంది. ”

బాబా చెప్పిన పై ప్రకటన, విశదీకరణలను సర్క్యులరు ద్వారా పాత జీవితపు శిష్యులకు, భక్తులకు అందరికీ పంపారు. మే 23 వ తేదీతో ఏకాంతవాస కాలం పూర్తయింది. బాబా బృందం హైదరాబాదుకు తమ మకాం మార్చే ఏర్పాట్లలో వున్నారు. అతి క్లిష్టమైన నూరురోజుల ఏకాంతవాస కార్యక్రమం పూర్తి కాగానే బాబా కొద్దికాలం మహాబలేశ్వరం వదిలేయాలని సంక ల్పించారు. హైదరాబాదు బయలుదేరబోయే ముందు మార్పు కోసరం కొద్ది రోజులు పూనాలో వుండి రావాలని వ్యక్త పరిచారు. బాబాకు, వారి బృందము వుండుటకు పూనా నగరశివార్లలో ఒక బంగళా రిజర్వు చేశారు.

## బైబిలు పాఠాలు

బాబా బృందంతో విడిది చేసేందుకు ‘ ఒనోరా ’ అనే పేటలో ఒక పెద్ద యిల్లు తీసుకున్నారు. బాబా వచ్చీ రాగానే ఆ యిల్లు చూచి, తన విశ్రాంతికి, అది పనికి రాదనుకొన్నారు.

పై పెచ్చుదగ్గర్లో తోళ్ళ శుద్ధి కర్మాగారం వుండటంతో ఆ ప్రాంత మంతా దుర్గంధ భూయిష్టమై భరించరాని చెడు కంపు కొడుతోంది. అందుచేత పురుష మండలి, బాబా వుండేందుకు అనువైన మరో భవంతి కోసరం వెతకటం ప్రారంభించారు. వారి ప్రయత్నంలో బ్రహ్మాండమైన భవనం కనపడింది. అదే గురుప్రసాద్. ఈ భవ నంలోనే, 1960 దరిమిలా బాబా నిర్వహించిన కార్యక్రమాలకు నాంది నవజీవన కాలంలోనే యీ విధంగా వేయబడింది.

మహాబలేశ్వరంలో వుండగానే బాబా శిష్యులకో ఆజ్ఞ జారీ చేశారు. ఎవరూ తనను ప్రత్యక్షంగా గానీ, పరోక్షంగా గానీ, తనను చూచేందుకు లేదా తనతో వుత్తర ప్రత్యుత్తరాలు చేసేం దుకు ప్రయత్నించ వద్దని ఆదేశించారు. శిష్యులు ఆజ్ఞను శిరసా వహించి పాటించారు. అయితే ఒకరోజున, ఒక రోమన్ కాతలిక్, గురువు బాబా వున్న బంగళాకు వచ్చాడు. ఆయన బాబాను చూచేందుకు రాలేదు. అసలు ఆయన గురించి ఏమీ తెలియదు. మురళికాలే అనే శిష్యుడ్ని కలిసేందుకు వచ్చాడు. ఇతడు బాబాతో వున్న నవజీవన మిత్రుడు. బృందం సతారాల్లో వుండగా మురళి తన ఇంగ్లీషు భాషాజ్ఞానాన్ని పెంచుకోవాలని బైబిలు కరస్పాం డెన్సు కోర్సులో సభ్యుడుగా చేరాడు.

బ్రహ్మాండమైన ఆలోచన ధర్మ ప్రచారకులు వారంవారం, బైబిలులోని ఒక విషయాన్ని అచ్చులో పాఠంగా పంపుతారు. ప్రతిపాఠంతో పాటు ఒక ప్రశ్న పత్రం కూడ వుంటుంది. అది ఒక విధంగా బైబిలు భాగంలో చెప్పిన ఆ విషయాన్ని ఎంత

వరకు గ్రహించగలిగాడో తెలుసుకొనేందుకది ఒక పరీక్ష లాంటిది. ఆ కోర్సు ప్రారంభించిన దగ్గరనుంచి, మురళి, ప్రశ్నా పత్రానికి జవాబులు వ్రాయుటలో యారుచ్ మీద ఆధారపడ్డాడు. యారుచ్ తన చిన్నతనంలో, నాగపూరులోని కాథలిక్ స్కూల్లో చదువుకున్నాడు. ఆ రోజుల్లో బైబిలు క్లాసులకు విడవకండా హాజరై న్యూటెస్టమెంటంతా క్షుణ్ణంగా చదివాడు. అందుకే అతనికి జీసను క్రీస్తు అంటే అమితప్రేమ ఏర్పడింది.

బైబిలు తరగతులకు హాజరైనప్పుడు, జీసను జీవితంలోని అనేక సంఘటనలను గూర్చి అడిగి తెలుసుకొనే వాడు. పాఠాలు చెప్పే ఫాదరు యారుచ్ ప్రశ్నలకన్నిటికీ సమాధానాలు చక్కగా వివరించినా ఒక్కొక్కప్పుడు, కొన్ని ప్రశ్నలకు సరియైన జవాబులు చెప్పలేక తికమక పడి "జస్సావాలా! కూర్చో! అది రహస్యం! నీ కర్థం కాదులే! అనేవాడట. అలా చాలాసార్లు జరిగే సరికి, యారుచ్‌కి, తాను జీసను సాన్నిహిత్యంలో వుంటే ఎంత బాగుండేది ? యీ రహస్యాన్ని అర్థం చేసుకోగలిగేవాడ్ని కదా ! " అనుకున్నాడట.

అది 1930 ప్రాంతం. ఆ రోజుల్లోనే మెహర్‌బాబా తరచుగా నాగపూరు వచ్చి, యారుచ్ గారింట్లో విడిది చేసేవారు. వారిల్లు పేరు మేరీలాడ్జి వాళ్ళ నాన్నగారు బ్రెహెమ్‌షాడి. జస్సావాలా. ఆయన ప్రభుత్వ హోదాగల పెద్ద అధికారి. ఫ్యాక్టరీలు, బాయిలర్ల చీఫ్ యిన్‌స్పెక్టరు. అప్పటి మధ్య పరగణాలు బీహారు. రాష్ట్రాలు యిప్పటి మధ్యప్రదేశ్ అనబడుతోంది. ఆ

రాష్ట్రాల ప్రభుత్వాధికారి హోదా, హోదాకు తగ్గ అంతస్తు వున్న డి. జస్సావాలాకు మేరీలాడ్జి అనే భవనం పెద్ద ఎస్టేటులో వుండేది. పెద్ద తోట, ఫలపుష్పభరితమైన అనేక వృక్షములతో చూడముచ్చటగా వుండేదా భవనం.

యీరుచ్ బళ్ళో చదువుతున్నాడు. వారింటికి బాబా వచ్చినప్పుడు, దొడ్డి దారిని యింట్లో దూరి, కాళ్ళూ చేతులు కడుక్కొని, బట్టలు మార్చుకొని, స్నేహితులుతో ఆడుకోనేందుకు వెళ్ళిపోయేవాడు. బాబా యితని కోసరం ఆరాతీస్తూ గేటులో ఎదురు చూచేవారు. యీ తంతు కనిపెట్టిన యీరుచ్ తల్లి "గైమాయి" యీరుచ్ ? నీవు బాబాతో సన్నిహితంగా ఎందుకని వుండటం లేదు ? ఆయనెవరో తెలుసా ? ఆయన మన మత ప్రవక్త జోరాష్టరు. మళ్ళీ మానవధారిగా యీరూపంలో వచ్చాడని నచ్చచెప్పేందుకు ప్రయత్నించింది.

అప్పుడు యీరుచ్, "అమ్మా ! నాకు మెహెర్‌బాబా అంటే గౌరవముంది. భక్తి శ్రద్ధ ఉన్నాయి. అయితే జీసను క్రీస్తును ప్రేమించినంతగా ఆయన్ను ప్రేమించలేక పోతు న్నాను" అంటాడు. అప్పుడతని హృదయం ప్రతి స్పందించిందట. ఏమని ? "ఆ జోరాష్టరే మెహెర్‌బాబాగా మళ్ళీ వచ్చి ఉంటే వుండనీ ? వస్తే నాకేం ? నేను జీసను క్రీస్తును గాఢంగా ప్రేమిస్తున్నాను. ఆయన రాకకొరకే నేను ఎదురు చూస్తున్నాను" అనుకొనే వాడట.

ఈ విధంగా యుగావతారుడు మెహెర్‌బాబా, ఎంతో ప్రేమతో యీరుచ్ కోసరం గేటులో ఎదురు తెన్నులు చూస్తూ వుంటే, యీరుచ్ మాత్రం జీసను సాంగత్యం కొరకు ఉత్కంఠతో ఎదురు చూస్తూ తనకు తెలియకుండానే ఆ సర్వోన్నతుడ్ని తప్పించుకొని దొడ్డిదారిని దొంగలా పారిపోయేవాడు. ఎటువంటి వక్రోక్తి ? కొన్నేళ్ళు గడిచాక, పాపం, యీరుచ్‌కి, ఆ దివ్య సనాతనుడు, ఎవరైతే జోరాష్ట్రరుగా, జీససుగా తదితర అవతారులుగా గతంలో వచ్చియున్నాడో ఆ పురాణపురుషుడే యిప్పుడు మెహర్‌బాబాగా మానవ రూపంలో వచ్చాడని పూర్తి విశ్వాసం కలిగింది. ఆయన్ని పున్నతోన్నతుడైన ప్రభువుగా అంగీకరించాడు.

శాశ్వతంగా బాబాతో వుండిపోయేందుకు యీరుచ్ 1938లో నాగపూర్ వదిలేశాడు. సరిగ్గా పన్నెండేళ్ళయింతర్వాత, మళ్ళీ యిప్పుడు, మురళీకి వస్తున్న బైబిలు పాఠాలు చదవటం ద్వారా తన చిన్ననాటి స్కూలు రోజులు గుర్తుకొచ్చాయి. మురళీకి వచ్చే ప్రశ్నాపత్రాలకు జవాబులు చెప్పేటప్పుడు, న్యూటెస్టమెంటుపై అతనికున్న ప్రగాఢ ఉత్సాహం, జీససుపై తనకున్న ప్రేమ ప్రస్ఫుటంగా ప్రతిఫలించేవి. వారాలు గడిచేకొద్దీ వచ్చే పాఠాలమీద మురళీకి శ్రద్ధ తగ్గిపోయింది. ఫలితంగా వచ్చే ప్రశ్నాపత్రాలన్నిటికీ జవాబులు వ్రాయటానికి పూర్తిగా యీరుచ్ మీద ఆధారపడ్డాడు.

ఒక నెల గడిచేసరికి, బాబా బృందం సతారానుండి మహా బలేశ్వరానికి మకాం మార్చారు. అప్పటికి కోర్సు పూర్తి కావటంతో మురళి సంతోషంగా ఎగిరి గంతేసినంత తృప్తి పడ్డాడు. ఆ సంస్థయొక్క యాజమాన్యంవారి నిర్ణయం ప్రకారం, మహాబలేశ్వరంలోని ఒక మత గురువుని పంపి, మురళీని కలిసి, అతను వ్రాసిన జవాబులన్నీ అత్యద్భుతంగా వున్నందున ప్రత్యేక బహుమతి అందించమన్నారు. ఆ ప్రీస్టు మురళీని కలిసి, తను వ్రాసిన జవాబులు ప్రశంసార్హంగా వున్నాయని అభినందించాడు. పాపం మురళి యీ హఠాత్సంఘటనకు చకితుడైనాడు. తాను కలలో కూడ అటువంటి గౌరవం వస్తుందని అనుకోలేదు. కంగారుతో వేగంగా యీరుచ్ దగ్గరకు వెళ్ళాడు. అప్పుడు యీరుచ్ బాబా స్నానానికి వేన్నీళ్ళు కాస్తున్నాడు. ఆదుర్దాతో యీరుచ్‌తో యిలా చెప్పాడు. " ఇదివరలో బైబిలు పాఠాలు చదువుకొనే రోజుల్లో ప్రశ్నలకు జవాబులు వ్రాసిపెట్టి సహాయం చేశావు కదా ! ఆఖరి సారిగా నేనిప్పుడు యిరుక్కుపోయిన సంకట పరిస్థితినుండి తప్పించి సహాయ పడవలసినదిగా కోరుతున్నాను. ఇప్పుడో ప్రీస్టు, నేను చదివిన బైబులు కోర్సులో సాధించిన ప్రతిష్టాకర ఉత్తీర్ణతకు, గౌరవ సూచికంగా ఒక బహుమతి యిచ్చేందుకు వచ్చాడు. మరైతే నేను సాధించిన ఆ విజయానికి మూలకారణమైన రహస్యాన్ని ఆయనకెలా బహిర్గత పరచను ? " అంటూ వాపోయాడు.

నిజానికి యూరుచ్‌కి వెళ్ళాలని లేదు. అయితే మురళి యొక్క పరిస్థితిని గుర్తించి అతనితో వెళ్ళాలనుకున్నాడు. అప్పుడు యూరుచ్ బసీనుతో వున్నాడు. వాళ్ళిరువురూ వెళ్ళంగానే ఫాదరు తెచ్చిన బహుమతి మురళీకివ్వగానే, అతనికి నోటి మాటరాక, "ధన్యవాదాలండీ !" అనిమాత్రం ఎట్లాగో పెగుల్చుకొని అన్నాడు. యూరుచ్ కల్పించుకొని ఆ ఫాదర్‌ని సంభాషణలో పెట్టాడు. అతని వాక్చాతుర్యానికి ముగ్ధుడైన ఫాదర్ "బిడ్డా ! యిక్కడ నీవేమి చేస్తూవుంటావు ?" అని అడిగాడు. "నేను నా ప్రభు సేవలో వున్నాను" అన్నాడు యూరుచ్. దానితో ఆ ఫాదర్‌కు వుత్సాహం మరికాస్త పెరిగి, యింకా ప్రశ్నించటం మొదలెట్టాడు.

బాబాను వదలి వచ్చిన యూరుచ్, వెంటనే ఆయన వద్దకు వెళ్ళిపోవాలన్న ఆరాటంతో వున్నాడు. కానీ ఆ మత గురువు, ప్రభు సేవ చేస్తున్నానని చెప్పిన యూరుచ్‌కి, హితబోధ చేయాలని ప్రయత్నించాడు. బైబిలులోని కొన్ని వివరణలు చెపుతూ, "మోసకారులైన నకిలీ గురువులుంటారు జాగ్రత్త సుమా !" అని హెచ్చరించాడు. అందుకు యూరుచ్, నేను చెప్పింది నా వ్యక్తిగత అనుభవంమీద కానీ, ఏ పుస్తకాలో చదివి మాత్రం కాదని ఆయన హెచ్చరికని కొట్టిపారేశాడు. అంతేకాదు "నేను సేవించే ఆ ఏకైకుడు ప్రభువు కాదని మీరెలా ఋజువు చేయగలరని సవాలు విసిరాడు.

వారి సంభాషణలో, తాను బైబిలు చదువుకున్నట్లు, క్రీస్తును ప్రేమించినట్లు పొరపాటున కూడ వెల్లడి చేయలేదు. అయితే యారుచ్ భావాల్ని ఆయన పూర్తిగా గ్రహించగలిగాడు. బాబాను గురించి ప్రత్యక్షంగా చెప్పకపోయినా, మెహెర్ బాబా గురించి ఆయన ఏభావంతో వెళ్ళాడో ఆ ప్రభువుకే తెలియాలి. వారి సంభాషణ మధ్యలోనే మురళి మెల్లగా జారుకున్నాడు. ఫాదర్ వెళ్ళిపోగానే యారుచ్ బాబా దగ్గరకు వెళ్ళాడు. అయితే అతని ఆలశ్యానికి గాని, గైరుహాజరైనందుకు గానీ బాబా ఎటువంటి ప్రశ్నలు వేయలేదు.

కొన్నాళ్ళైనంన తర్వాత, మురళి అద్భుత విజయం. ప్రీస్టు వచ్చి బహుమతి ఇవ్వటం, యివన్నీ బాబాకు తెలిసినప్పుడు చిరు నవ్వు నవ్వి వూరుకున్నారు. అంతా ఆయనకు తెలుసును గనుకనే కాబోలు ఆరోజు యారుచ్‌ని అంత సేపు మాట్లాడేందుకు అనుమతించారు. ఆ ప్రీస్టు హృదయాంతరాళంలో తన నామ బీజం ఎప్పుడు మొలకెత్తుతుందో, అనంతమైన తన సహనంలో బాబాకు తెలుసును.

అయితే మురళీకి బైబిలుపై వున్న మక్కువకు గుర్తింపుగా బాబా మెహెరాబాదులో 1952 సవంబరులో జరిగిన ఒకానొక సమావేశంలో బాబాచే సత్కరించారు.బాబా ఆజ్ఞ మేర మురళి ఒక ప్రీస్టు వలె బారు గౌను తొడుగుకొని, తన ఎదుట బాబా చేత క్రాసు ధరించి నిలబడగా శిఖరాగ్ర ఉపదేశం (Sermon on the mount) చదివాడు.

యిప్పుడు అసలు సంగతికి వద్దాం. నూరురోజుల ఏకాంత వాసం 1951 ఫిబ్రవరి 13 న ప్రారంభించబడింది. 1951 మే 23 తో అంతమయింది. 1949 జూన్ - జూలై మాసములలో బ్లూ బస్సులో చేసిన బ్రహ్మాండమగు ఏకాంతవాసం, నవజీవన దీక్షకు నాంది పలికింది. కాగా ప్రస్తుత ఏకాంతవాసం నవజీవనపు అంతిమ ఘట్టమైన "మనోనాష్" లో అడుగిడేందుకు తిరుగు లేని విధంగా పునాది వేసింది. నవజీవన కాలంలో రెండోసంవత్సరమంతా బాబా ఎక్కువ శ్రమతోకూడిన కార్య భారంతో, ఎగుడుదిగుడులతో కూడిన జీవితం గడిపారు.

## హైదరాబాదులో సభ

1951 జూన్ మొదటి వారానికల్లా బాబా తన మండలితో హైదరాబాదు చేరుకున్నారు. అంతకు ఓ నెల ముందుగా పాత జీవితపు తన శిష్యులు, ప్రేమికులు కొందరికి జూన్ నెలాఖరులో జరుగనున్న సభకు రమ్మనమని పిలవ సంకల్పించారు. ఎంచుకున్న కొద్దిమంది బాబా పరివారానికి ప్రత్యేకాహ్వానాలు పంపబడినవి. ఆహ్వానం గురించి క్లుప్తంగా తెలుసుకుందాం.

నా సమక్షంలో కొద్ది కాలం గడప కలుగు అవకాశం మీకిచ్చేందుకు, 1951 జూన్ 28 నుంచి 30 వరకు హైదరాబాదు రావలసిందిగా మిమ్మల్ని కోరుతున్నాను. దీని ప్రకారం, ఆ రోజుల్లో హైదరాబాదులో జరిగే కార్యక్రమాల్లో మీరు తప్పక పాల్గొనాలి. మీకు రావాలని వుండి, ఎంత ప్రయత్నించినా అని

వార్య కారణములు వలన రాలేకపోతే, విచారపడవద్దు. మీరు వచ్చేది రానిదీ తెలుపుతూ సంతకం చేసిన తిరుగు రశీదు పంపించండి. ఒకవేళ మీరు వస్తున్నట్లయితే, ఎప్పుడు రావలసినదీ, హైదరబాదులో ఎక్కడ దిగవలసినదీ అన్ని వివరాలతో జూన్ మొదటివారంలో ఆదీ మీకు ఉత్తరం వ్రాస్తాడు.

బాబా

ఈ పై ఉత్తరాన్ని బట్టి, మనకు బాబా ఏర్పాటు చేసే ఏ మీటింగైనా, చిన్నది కానీ పెద్దది కానీ, స్వేచ్ఛాపూరిత మనస్సుతో తన ప్రేమికులు అందులో పాల్గొనేందుకు వీలుగా ప్రతి చిన్న విషయంలోనూ ఎంతో జాగ్రత్త వహించేవారని అర్థమవుతుంది. కొంతమందిని 10 రోజులు ముందే రమ్మనమని కబురంపారు. మరి కొందరిని ఏడురోజులు ముందు రమ్మన్నారు. ఎక్కువ మందిని మూడురోజుల ముందు రమ్మన్నారు.

అంతకు ముందు మహాబలేశ్వరంలో జరిగిన మీటింగులో హాజరైనప్పుడు, వారు మళ్ళీ తన ప్రియతముని చూడలేమేమో ననుకున్నారు. బాబా పూర్వ జీవనంలో వున్నా, నవజీవనంలో వున్నా, ఆయన జీవితము, కార్యక్రమాలు, సాధారణమైనవిగా వున్నా రహస్యమైనవి. అయినా, ఆయన చెప్పే ప్రతిదీ, చేసేదీ కూడ పరిపూర్ణమై అనాంతం కొనసాగేది. అందుచేత, మళ్ళీ బాబాను చూచే అవకాశం కల్పించటమనేది ఆయన ముందుగా చెప్పకుండానే చేసిన నిర్ణయం. ఎవరైతే ఏ కోరికా లేకుండా ఆలోచనల కతీతంగా వుంటారో అటువంటివారి జీవితాల్లో బాబా

అనుకోని సంఘటనలు కలిగించటమే కాకుండా, అలా పాశాలకి దూరంగా వుండేట్లు చేస్తారు. ఆయన ప్రేమలో పెరిగినప్పుడు సహజ ధారావాహికమైన జీవితమంతా దైవేచ్ఛపై ఆధారపడి వున్నదన్న సత్యాన్ని మేధావులు సైతం అంగీకరిస్తారు. అట్టి వారే బాబాను అనుసరించగలుగుతారు.

బాబా అనంతమైన చంచలత్వం కలవాడైనప్పటికీ, ఆధ్యాత్మిక జీవనానికవుసరమైన ప్రాథమిక పాఠాలు నేర్చుకోవటంలో ప్రతివారికి సహాయ పడేవారు. హృదయ పూర్వక ప్రేమ ఆయన ఎడల ఎట్టి షరతులు లేని సమర్పణ, యివి ఆయన మనకు మార్గదర్శకుడుగా నేర్పిన ప్రాథమిక సూత్రాలు. కానీ అవి నేర్చుకోవటం, అంత సుళువేమీ కాదు.

సభ కొరకు ఏర్పాటు చేసిన సభాస్థలి, హైదరాబాదు నగరానికి ఈశాన్యంగా వున్న జూబిలీహిల్సు. చాలా పరిశుభ్రంగా వుండి విశాలమైన వీధులతో అందమైన భవంతులతో చూడ ముచ్చటగా వుండే ప్రాంతమది. వాస్తు శిల్పమంతా ప్రతి బంగళాలోను కొట్టవచ్చినట్లు కనపడుతుంది. పూలమొక్కలు, పచ్చిక మైదానాలతో కొన్ని, ఫలవృక్షాలతో కొన్ని ఇంద్రభవనాల్లా వున్నాయి. వాటిలో 2/529 నంబరు గల యింటిని సభ కొరకు, సభలో పాల్గొనేందుకు వచ్చే వారికొరకు ఏర్పాటు చేశారు.

ఈ భవనం పేరుగాంచిన హైదరాబాదు నవాబు అలీ నవాజ్‌జంగుకు చెందినది. ప్రసిద్ధి చెందిన శిల్పచాతుర్యం భవనమంతా కనపడుతుంది. విశాలమైన భోజనశాల, అందమైన వుపరి

భాగం, తిరుగుడు మెట్లు, నీటి పంపులు, పడకగదులే కాక, సకల సదుపాయాలతో అన్ని అవసరాలు తీర్చే వసతులతో వున్న ఆ భవనం చూడగానే నవాబుయొక్క కళా తృష్ణ అవగతమవుతుంది. రాజమహల్‌లో వుండే అవకాశం కల్పించడమే కాక బాబా సమక్షంలో గడిపే అదృష్టం కూడ కొద్దిమందికి దొరికింది. ఒకరి జీవితంలో బాబా అనుకోని సంఘటనలు కల్పిస్తారంటే యిటువంటివే కదా !

## ఏర్పాటువాలాల రాక

ఆహ్వానించబడిన వారిలో బహు కొద్దిమంది జూన్ 20 నాటికి బాబాతో గడిపేందుకు హైదరాబాదు చేరుకున్నారు. అందులో కొందరు ఏర్పాటువాలాలు కాగా మరికొందరు పాత సన్నిహిత మండలి సభ్యులు. మీటింగు మొదటి రోజున, బాబా నడుచుకుంటూ మెట్లదగ్గర కొచ్చేసరికి అమిత తేజస్సుతో వెలుగొందుతున్నట్లు కనిపించారు. కానీ రాజఠీవితో ఆయన నడిచే తీరులో ఏదో మందకొడితనం క్రొత్తగా కనపడింది. బహుశా అధికమగు ఆధ్యాత్మిక కార్యక్రమం వలన అలాంటి బలహీనత కలిగివుండవచ్చును.

సందర్శకులతో బాబా ముచ్చటిస్తూ, " తాను పైల్సుతో బాధపడటమే గాక కడుపులో విపరీతమైన నొప్పి వస్తోంది. ఆకలి పోయింది. అన్నం చూస్తేనే డోకు పుడుతోంది. ఏమైనప్పటికీ, కష్టతరమైన ఏకాంతవాస గడువు తీరాక ఆరోగ్యం కాస్త బాగానేవుంది " అని చెప్పారు. తర్వాత వచ్చిన వారందరి

ఆరోగ్యం గురించి విచారించారు. తమతమ ఆరోగ్యాలు ముఖ్యంగా మీటింగు జరిగిన రోజులన్నాళ్ళు జాగ్రత్తగా చూచు కోమని హెచ్చరించారు. వాళ్ళకున్న కష్టాలన్నీ మరిచిపోయి ఆనందంగా వుండమన్నారు. సాధారణ ఆరోగ్యం, నిలకడైన మనస్సు బాబా ఏర్పాటుచేసే సదస్సుల్లో పాల్గొనేందుకవసరమైన ముఖ్య విషయాలు.

అలాంటి మీటింగులు జరుగబోయేముందు బాబా ఆరోగ్యం చెడిపోవటం సర్వసాధారణం. దీనిని బట్టి, తన దర్శనానికి వచ్చే వారి బాధలన్నీ తనపై వేసుకుని ఆ బాధలన్నీ తాననుభవిస్తూ, తన ప్రేమికులను వారి బాధల్నుండి విముక్తి చేస్తున్నారేమో మరి ? నాకప్పుడప్పుడు అనిపిస్తుంది. కొందరు తామెన్నో కష్టాల్లో వున్నప్పటికీ బాబా దయవలన, ఆయన దర్శనభాగ్యం పొందగలిగాం అని చెప్పినప్పుడు, ఎంతో ఆశ్చర్యం వేస్తుంది. మళ్ళీ తన ప్రేమికులు ఆయన చెంతకు చేరటమే తరువాయి. బాబా తన శక్తిని పుంజుకొని మంచి మూడ్‌కు వచ్చేస్తారు.

మొదటి బృందంతో బాబా సమావేశమైనారు. 1951 అక్టోబరులోపల తానొక కొత్త అడుగు వేయబోతున్నానని, దానికి ముందు అన్ని భారాలనుండి విముక్తికాదలచానని ప్రకటించారు. దాని పరిణామంవలన, మండలివారికి 1952 ఫిబ్రవరి 16 వరకు కొన్ని అత్యవసర పదార్థాలు యివ్వదలచారు. వారికి యివ్వవలసిన సామాన్లేమిటో ఏర్పాటు వాలాలకు ఆదేశించారు. అంతలో కొందరు కల్పించుకొని సామూహిక దర్శనభాగ్యం కల్పించమని

ప్రాధేయ పడ్డారు. అందుకు బాబా తాను ముందుగా పూర్వపు మెహెర్‌బాబా స్థితికి వెళ్ళదలచానని అప్పుడుగానీ సామూహిక దర్శనము తదితర సమస్యలన్నీ తీరవని అంటూ, ప్రజలు నిజంగా అటువంటి అవకాశాన్ని వుపయోగించుకొవగలిగినప్పుడే ఆ దర్శనమునకు విలువ వుంటుంది అని వివరించారు.

గురువు తన యిచ్ఛ ప్రకారం ఎటువంటి ప్రాముఖ్యం లేనిది యిచ్చినా అది శుద్ధమైన పాలతో సమానము. నీవు కావాలని కోరుకున్నప్పుడు అది నా దృష్టిలో ఎంత మంచిదైనా, దానిని నీ గురువు యిచ్చినప్పుడు మంచినీటితో అది సమానమవుతుంది. అయితే నీ గురువును బలవంతపరచి నాకేదో కావాలని దానిని యిమ్మని నీ గురువును బలవంతం చేసినప్పుడు అది ఎంత తప్పంటే, నీవు నీ గురువు రక్తాన్ని పిండటమన్నమాట. యివి భక్తకబీరు చెప్పిన పలుకులు. దైవమానవుని చేతులమీదుగా అమూల్యమైన బహుమానం నీవు పొందదలిస్తే స్వచ్ఛందంగా సర్వార్పణ కావాలి. ఏ కోరికా కోరకూడదు.

ఏది ఎప్పుడు ప్రసాదించాలో ఆయనకన్నీ తెలుసును. అందుకే కాబోలు, మనోనాష్ కాలం పూర్తి కాగానే బాబా పశ్చిమ ఖండాలతోబాటు, భారత భూభాగంలో కూడ కొన్నిచోట్ల దర్శన కార్యక్రమాల్లో పాల్గొన్నారు. తన ప్రేమాగ్నికణాన్ని, దైవీ మానవుని ప్రశస్త బహుమతిగా, కొందరి హృదయాల్లో మేల్కొలిపారు. ప్రేమనేది ఒకరిస్తే వచ్చేది కాదు. దానికదే ప్రజ్వరి

ల్లాలి. దాని కాంతిపుంజాలు, హృదయమందిరాల్ని తేజోవంతం చేసి, మానవాళిని మేల్కొలుపుటకు దోహదపడతాయి.

## బాబా దర్శన ఏర్పాట్లు

బాబా దర్శనానికి, మీటింగులో పాల్గొనేందుకు వచ్చే వారందరినీ, వారివారి భోజనవసతి సౌకర్యాల ఏర్పాటు నిమిత్తం తలా ఒక రు75/-లు చొప్పున, ఆదీజీకి చెల్లించమని సర్క్యులరు కూడా అహ్వానితులకు పంపారు. అనేక శ్రమలకు లోనై క్రిక్కిరిసిన రైళ్ళలో, బస్సుల్లో, సతమతమైన ప్రయాణం చేసి, మొత్తం మీద అంతా జూన్ 27 నాటికి పూర్తిగా హైదరాబాదు చేరుకున్నారు. పెండు మేనేజరుగా లాడ్జింగు, బోర్డింగు ఏర్పాట్లు చూస్తున్నాడు. విష్ణు రైల్వేస్టేషన్‌లో వచ్చేవారికి స్వాగతం చెప్పి జూబిలీ హిల్సుకు చేర్చేందుకు రవాణా ఏర్పాట్లు చూస్తున్నాడు.

తోటలోని పూలన్నీ తలలూపుతూ సందర్శకులకు స్వాగతం చెపుతున్నట్లున్నాయి. వారి హృదయాలు పరవశించి 'దైవమాలి' మెహెర్‌బాబా ముఖారవిందాన్ని ఎప్పుడు చూస్తామా ? అని వువ్విళ్ళూరుతున్నయి. అంతా గబగబా, లాడ్జింగు, బోర్డింగు ఖర్చులు ఆదీకి చెల్లించారు. బాబా మేడపైన హాల్లో తన ప్రేమికుల కొరకు నిరీక్షిస్తున్నారు. ఒక్కొక్కరే, ముఖాలు కడుక్కొని బాబా సమక్షంలో చేరుకున్నారు. బాబాను కలిసినప్పుడు ఎవరూ ఎటువంటి ప్రశ్నలూ వేయరాదని సర్క్యులరులోనే తెలుపబడింది.

అందుచేత అంతా ఆ దివ్యసుందరమూర్తిని తదేకంగాచూస్తూ కూర్చుండిపోయారు.

బాబాయే, ఒక్కొక్కరిని పలుకరిస్తూ ఏమైనా బాధలున్నాయా ? నీ ఆరోగ్యం ఎలావుంది ? ఏమైనా కష్టాల్లో వున్నావా ? ప్రత్యేక విశేషమేదైనా వుందా ? అంటూ ఎన్నో ప్రశ్నలు వేశారు. వారి జవాబులకు ఎదురుచూడకుండా తానే, " విచారించకండి. దేని గురించి వ్యధ పడకండి. మీరు ఇక్కడ వున్నన్నాళ్ళు సుఖంగా సంతోషంగా గడపండి ! " అని సందేశమిచ్చారు. మెరిసే కళ్ళతో చిరునవ్వుతో మళ్ళీ మందహాసంచేస్తూ " మీ యిల్లూ కుటుంబం మరిచిపోండి. కానీ మీటింగులకు సకాలంలో హాజరవటం మరవకండి ! " అన్నారు.

బాబా సందేశం వినగానే అందరిలోను ఏదో ఒక క్రొత్త ప్రేమకెరటం దొర్లింది. శరీరంలో, నూతన శక్తి పెల్లుబికింది. ఏది ఏమయితే మాకేం భయమన్నధీమా ప్రతివారి ముఖంలోను కొట్టవచ్చినట్లు కనపడింది. రేపు జరుగబోయే సమావేశంలో దైవం ముందు తాను చేయబోయే ప్రకటనకు మీరంతా సాక్షులుగా వుండేందుకే మిమ్మల్నందరినీ పిలిచానని చెప్పారు. రేప్రొద్దున గం 8 లకు ఆలీవవాబు జంగ్ బంగళాకు వచ్చి మిమ్మల్నందరినీ స్వయంగా కలుసుకుంటానని చెప్పి బాబా తన నివాసానికి వెళ్ళిపోయారు. మర్నాడు వుదయం 7 గంటలకే అంతా కాఫీ ఫలహారాలు ముగించుకొని తయారై బాబా రాకకు ఎదురు

చూస్తున్నారు. 7-15 కు బాబా, మండలివారితో జరుగబోయే 3 రోజుల కార్యక్రమం గురించి చర్చించుకుంటూ వచ్చారు.

## బాబా ప్రకటన

నవాబ్ అలీనవాజ్‌జంగ్ బంగళా మొదటి అంతస్తులోని, ప్రత్యేకహాల్లో జూన్ 28 న, అత్యంత ప్రధానమయిన సమావేశం జరగవలసి వుంది. సర్క్యులరులోని ఆదేశాల మేరకు, ఆహూతులంతా, కాళ్ళు చేతులు ముఖం కడుక్కొని, బాబా పిలుపు కోసం ఆతురతతో ప్రక్కనున్న గదుల్లో ఎదురుచూస్తున్నారు. గం 8-00 లకు 10 నిమిషాలు ముందుగానే, బాబా చప్పట్లు కొట్టారు. బిలబిలమంటూ అంతా హాల్లోకి ప్రవేశించారు. భారతీయ సాంప్రదాయం ప్రకారం హాల్లో పరచిన తివాచీపై అంతా కూర్చున్నారు. రేగిన జుట్టుతో తెల్లని సద్రా తొడుక్కొని ఒక కొయ్య కుర్చీపై బాబా కూర్చున్నారు.

ముందుగా ఆదీ, పెండు తదితర బృందనాయకులు లోనికి వచ్చారో లేదో ఆరా తీశారు. ఆ పిమ్మట అక్షర ఫలకంపై బాబా వేళ్ళు కదల నారంభించాయి. సభనుద్దేశించి బాబా యిలా చెప్ప నారంభించారు. " 1952 ఫిబ్రవరి 16 నాటికి, నాకు మీకు, నాతో సంబంధం వున్నవారికి, పరిస్థితులు యిప్పటివలె వుండవని నేను దృఢంగా చెప్పదలుచుకున్నాను. అది మంచికి గానీ, చెడుకి కానీ, అంతా మంచికేనని నేను గట్టిగా భావిస్తున్నాను. నిజం చెప్పాలంటే, నవజీవనంలో నేనిప్పుడున్నంత సుఖంగా ఎప్పుడూ వుండలేదు. యీ ఆనందమే, నన్నిప్పుడు, దేముడే ఆ ప్రకటన చేయమని కోరుతున్నట్లుగా అనుకొనేటట్లు చేసింది.

నూరురోజుల ఏకాంత కాలంలో తానెటువంటి క్లిష్టపరిస్థితుల నెదుర్కొన్నది, నిస్సహాయతతో బలహీనపడిందీ అంతా సవివరంగా సభలో వివరించారు. క్రితం రాత్రి నాకు సరీగా నిద్ర పట్టలేదు. తెల్లవారుఝామున, గం 3-30 లకు దైవం నన్ను వెనుకకు తీసుకోలేని అడుగు వేయమని కోరిన అనుభూతి కలిగింది. అప్పటినుండి నాకు చాలా ఆనందంగా వుంది. ఏ భయము లేదు. 1952 ఫిబ్రవరి 16 నాటికి మళ్ళీ నేను పూర్వపు మెహెర్‌బాబా స్థితిని తిరిగి పొందగలిగేందుకు ఆ దైవం తప్పక సహాయపడతాడని, నేను హృదయ పూర్వకంగా విశ్వసిస్తున్నాను. నేను చేయబోయే ప్రకటనను శ్రద్ధగా వినండి. " అంటూ లేచి ప్రక్కనేవున్న బేసినులో చేతులు, ముఖం కడుక్కొన్నారు.

బాబా తన ప్రకటనను ప్రకటించేముందే దాని సారాన్ని డాక్టరు ఘనీమున్సిఫ్ చేత యీ క్రింది విధంగా చదివించారు.

1. తప్పనిసరిగా వేయవలసిన యీ అడుగుకు నిర్ణయించిన సమయం 1951 అక్టోబరు 16 నుండి 1952 ఫిబ్రవరి 16 వరకు వుంటుంది.

2. దైవం నేనే పరిపూర్ణ నాశనము అనే కార్యక్రమాన్ని చేయవలసినదిగా తీసుకోమని నన్ను కోరాడు.

3. నేనే యింతకుముందు, యిప్పుడు, యికముందు కూడ ఎవరైయున్నప్పటికీ, దైవమే తన అనంత న్యాయ దృష్టిలో సమస్తాన్ని చూస్తాడు. అందుచేత మీలో ప్రతిఒక్కరికి నా గట్టి

సలహా ఏమంటే, మీకిప్పుడున్న నమ్మకం, ప్రేమలు, యింత కంటే అధికంగా పెంచుకోలేకపోయినా, కనీసం వాటి స్థితికన్నా గట్టిగా కట్టుబడివుండండి.

4. ఈ సంస్వనాశ కార్యక్రమంలో అక్టోబరు 16 నుండి నేను గాఢంగా మునిగిపోతాను.

5. తలపెట్టిన ఫలితం ఫిబ్రవరి 12 నాటికల్లా సిద్ధించేట్లు చేయమని ఎంతో వినయంతో దైవాన్ని అడుగుతున్నాను.

6. ఒకవేళ నా భౌతిక మరణం సంభవిస్తే నేను ఏర్పాటు వాలాలకు యిచ్చిన ఆదేశాలన్నీ పాటించాలి.

7. అక్టోబరు 16 నుండి ఫిబ్రవరి 12 వరకు నేను హైదరాబాదులో వుండను.

8. యీ మృత్యుశయ్యాగత విధానం ద్వారా నన్నుసరించదలచినవారెవరైనాసరే నాతో రావచ్చును. అట్టివారికేమి జరిగినా, నాకేవిధమైన సంబంధం వుండదు.

9. నాతోవున్న సేవకులను రెండువిషయాల్లో ఏదోఒకటి కోరుకోమని ఆదేశిస్తున్నాను. నిరాశామయ కష్టదశలో నాతో వుండటమా, లేక హైదరాబాదులో వుండిపోయి నేను వప్పగించిన విధి నిర్వహించటమా ఏదో ఒకటి తేల్చుకోవాలి.

10. జూలై 1 నుండి ఫిబ్రవరి 12 వరకు, నేను అందరికి కనిపించవచ్చును. కొద్దిమందికే లభ్యము కావచ్చు లేదా ఎవరికీ దొరక్కపోవచ్చును

11. కనీసం మీలో ఒక్కరైనా నాతోవుంటే నేను చాలా సంతోషిస్తాను. అలాకాక చాలామంది నాతో రావాలనుకున్నా నాకేమి అభ్యంతరం లేదు.

12. నాతో రావాలనుకున్న వారిలో చివరకు నన్ననుసరించేవారిని నేనే నిర్ణయిస్తాను.

13. యీ సర్వనాశ కాలంలో నాచేతలు, జీవిత విధానం ఎటువంటి కట్టుబాట్లకు అతీతమై స్వేచ్ఛగా వుంటయి. నేనేదైనా అర్థించవచ్చును. అధికారయుతంగా ఏదైనా అడగవచ్చును. ఏదైనా అంగీకరించవచ్చును లేదా తిరస్కరించవచ్చును. లేదా ఒకవేళ యివి ఏవీ చేయకపోవచ్చును. నేను సాధారణమయినది చేయవచ్చును. మంచి చేయవచ్చును. చెడు చేయవచ్చును. సందర్భాన్ని బట్టి, దైవేచ్ఛ ననుసరించి, యీ గొప్ప సర్వనాశ కార్యక్రమమంతా జరుగుచున్నది.

యీ ప్రకటన అనువాదాన్ని వక్తా, హిందీ భాషల్లో కూడ డా॥ ఘనీ బిగ్గరగా చదివి వినిపించాడు. డా॥ సి. డి. దేశ్‌ముఖ్ మరాఠీలో చదివాడు. యిలా చదవటం పూర్తి కాగానే బాబా కుర్చీలోంచి లేచి నిలబడి, అందరినీ లేచి నుంచోమని సౌంజ్ఞ చేశారు. బాబా రెండు చేతులూ జోడించి ధ్యానంలో వున్నట్లు నిలబడ్డారు. అది చూచి చాలామంది అలాగే నమస్కరిస్తూ నిలబడ్డారు. బాబా కళ్ళు రెండూ మూసుకున్నారు. అప్పుడు బాబా తరఫున డా॥ డాన్‌కిన్ యీ క్రింది ప్రకటన చదివాడు.

" దేముని సమక్షంలో, అన్ని కాలాల్లో వున్న సమస్త సద్గురువుల్ని నా హృదయంలో, సాక్షీభూతులుగా నిలుపుకొని, దేవుని సహాయంతో, ఆయన యిచ్చ ప్రకారం నేనీ ప్రకటన చేస్తున్నాను. నేను తప్పనిసరిగా అక్టోబరు 16 న యీ సర్వనాశ కార్యక్రమం చేపడతాను. నా సంతృప్తి మేరకు, యింతకు ముందు నేను పూర్తిచేసిన నూరురోజుల ఏకాంతవాసం జయప్రదం కావటానికి నాకు దైవం పూర్తి సహాయం అందించాడు. మరి ఆ దైవమే నన్ను మళ్ళీ పూర్వజీవన మెహెర్‌బాబా స్థితికి చేర్చేందుకు సహాయమందిస్తాడన్న నమ్మకం నాకున్నది. విశ్వానికంతటికీ విశదీకరణ చేసేందుకాయన సహాయ పడగలడు.

ఇక్కడ యీ నా ప్రకటనకు సాక్షులుగా హాజరైవున్న వారందరినీ అక్టోబరు 16 న ఉదయం 8 గంటల నుండి 24 గంటలు వుపవాసం వుండి కేవలం టీ, మంచినీళ్ళు మాత్రం తీసుకొనమని కోరుతున్నాను. "

పవిత్రవంతమైన యీ ప్రకటనని అంతా మౌనంతో వుత్సుకతతో విని స్వీకరించారు. బాబా ప్రకటన చదవటం పూర్తి కాగానే మళ్ళీ తన కుర్చీలో కూర్చున్నారు. తక్కిన వారందరినీ 15 నిమిషాలు విరామంగా బయటకు వెళ్ళి రమ్మన్నారు. గంభీరమైన వుపన్యాసం కానీ, అత్యంత ప్రాముఖ్యమైన సందేశం కానీ యిచ్చిన ప్రతిసారీ బాబా మధ్యలో కొద్ది విరామం ప్రకటించటం ఆనవాయితీ.

# మనో నాశ వుపదేశం

విరామానంతరం అంతా హాల్లోకి వచ్చి కూర్చున్నారు. బాబా విశ్రాంతి తీసుకొని వుల్లాసంగా కనబడ్డారు. బాబా సదస్యుల నుద్దేశించి, తాను నాలుగు నెలలలుపాటు, అక్టోబరు మధ్యభాగం నుండి హైదరాబాదులో వుండనన్నారు. ఆ నాలుగు నెలల్లో తాను నిర్వహించనున్న కార్యక్రమం గురించి అక్షర ఫలకంపై చెపుతున్నారు. నాలుగు నెలలలో నాలుగు వందల మరణాలు సంభవించవచ్చును. మరి ఆ నాలుగు నెలల్లో తనతో వుండదలచిన వారు తీవ్రంగా ఆలోచించుకొని ఒక నిర్ణయానికి రండి. నేను మాత్రం ఎవరి గురించి ఎట్టి బాధ్యత తీసుకోను. నాతో వుండదలుచుకున్నవారు ఎటువంటి భౌతికపరమైన లేదా ఆధ్యాత్మికపరమైన లాభాన్ని అపేక్షించ రాదు.

తనతో వుండేవారికి నిద్రాహారాలు దుర్లభం కావచ్చును. రోగాలు రొష్టులు రావచ్చును. కటిక వుపవాసాలతో కడుపు మాడవచ్చును. వయోపరిమితితో సంబంధం లేకుండా ఏ వయస్సువారైనా, నాతో రావచ్చును. నాతో వుండవద్దంటూనేమోనని మాత్రం, అవునని సమాధానమివ్వకండి. నన్ను మూర్ఖుడ్ని చేసి, మీరు మూర్ఖులు కాకండి. మీ నిర్ణయం తెలుసుకున్నాక, నాతో వుండేవారిని నేను నిర్ణయిస్తాను.

అలా చెప్పింతర్వాత బాబా తన అక్షర ఫలకంపై మనో నాశము గురించి యింగ్లీషులో వుపన్యసించటం ప్రారంభించారు. దాంతోపాటే హిందీలో కూడ దాని అనువాదం చేయబడింది.

" సంస్కారాలను బట్టి మనస్సు మారుతుందే కాని రూపాంతరం చెందదు. మనస్సనేది మిధ్య. అది మిధ్యగానే వుండిపోతుంది. మిధ్య గనుకనే దానిని నాశనం చేయవచ్చును. ఈనాడు మీరు " నేనొక మనిషిని " అనుకుంటున్నారు. ఒకవేళ మీ శరీరం పోయి, ఒక స్త్రీగా జన్మించినప్పుడు మీరే అప్పుడు " నేనొక స్త్రీని " అనుకుంటారు. యీ " నేను " అనే మనిషిగా స్త్రీగా వుండటం మిధ్య. నిజమైన రూపాంతరం జరిగేంతవరకూ, యిలా అనుకోవటం కొనసాగుతూనే వుంటుంది. మనస్సనేది ఎప్పుడూ రూపాంతరం చెందదు. అహం అనేది ఒక్కసారే రూపాంతరం చెందుతుంది. అహం అనేది సత్యానికి సంబంధించి నది కనుక , అది ఎప్పుడూ సత్యంగానే వుండితీరుతుంది. ఆ అహం వలననే మీ అస్తిత్వ మనేది వుంటోంది. అహం దానం తటది మిధ్య కాదు. మనస్సే అలా అనుకొనేటట్లు చేస్తుంది. "

" మనస్సు ప్రపంచాల్ని సృష్టిస్తుంది. భ్రాంతిని, భ్రమల్ని కల్పిస్తుంది. అయితే అదిమాత్రం ఎన్నటికీ వాటిలో ఒకటి కాలేదు. అహమనేది ఎప్పుడూ దానిలోనే ఒకటిగా వుంటుంది. నిజమైన అహం మనలో, మనసులో బంధించబడి, మిధ్యగా అనిపిస్తున్నది. జనన మరణాల్ని, సుఖ దుఃఖాల్ని నిజమనే విధంగా నీ వనుకొనేటట్లు నీ మనస్సు చేస్తున్నది. యింతకంటే అబద్ధం మరోటి వుండదు. నీవెల్లప్పుడూ పుట్టవు. అయితే మనస్సే, " నేను యిది " " నేను అది " "ఈమె నా భార్య " " ఇది నా బిడ్డ " అంటూ ఆలోచనలనిపిస్తున్నది.

మనస్సెప్పుడూ, నిన్ను నాట్యం చేయిస్తుంది. "నీవు, నీ భార్య, నీ పిల్లలూ అంతా ఒక్కరే" అని నీవు తెలుసుకోగలిగితే, నీ నీవెప్పుడూ పుట్టవు, ఎప్పుడూ మరణించవు, ఎన్నడూ బాధలనుభవించవన్న సత్యం తెలుసుకో గలిగితే, మరి ఇంతకంటే తెలుసుకోవలసిందింకేముంటుంది ? "

అందుచేత, మిధ్యాలోచనలతో తయారైన మనస్సు, నిజమయిన నేనుని మిథ్య అనుకొనేట్లు చేస్తుంది. మనస్సు, మిమ్మల్ని "నేను దేముడ్ని" అని చెప్పేట్లు చేస్తుందేకానీ, "నేను దేముడ్ని" అని భావించేటట్లు చేయదు. కనుక మనస్సున్నంతవరకు అహం సత్య స్థితిపైపున్న తప్పుడు అభిప్రాయం నుండి రూపాంతరం చెందలేదు. నిజానికి మీరు శాశ్వతులు, అనంతులు. కానీ మీరాస్థితిని తెలుసుకోలేకున్నారు. అసలైన యీ స్థితిని అనుభవించాలంటే మనస్సు పోవాలి. మరి యీ మనస్సును నాశనం చేసేవారెవ్వరు ? నాశనము చేయుట అనే చర్యవలన సంస్కారాలు సృష్టించబడి మనస్సు బంధింపబడుతోంది. సంస్కారాల యింద్రజాలం నిన్ను ఎంతో నేర్పుతో బంధిస్తుంది. వాటినుంచి నీవు ఎంతగా బయటపడాలని తాపత్రయ పడితే అంతగా బంధింప బడతావు. మనస్సు దానంతటదే సర్వనాశనం కావటం ఒక్కటే యిందుకు మార్గం.

యీ సందర్భంలో హాఫీజు" ఓ హాఫీజు ! నీవే ఒక తెర గనుక, నీకు నీవే తొలగిపో " అన్నాడు. మరి నీకునీవు తొలగి

పోవటం ఎలా ? తొలగిపోవటమనే విధానమే సంస్కారాల్ని సృష్టిస్తోంది కదా ! కనుకనే సద్గురువులు అనేక మార్గాలని నిర్దేశించి, మనస్సు నాశనమయ్యే వైపు మరల్చి, చైతన్యాన్ని నిలుపుకొనే మార్గాలెన్నో చూపారు. యీ మార్గాలు ముఖ్యంగా, చేతలు, ధ్యానం, ప్రేమ వీటిమీద ఆధారపడి వున్నాయి, ఏ చర్యలలో అసత్య అహముఉన్నది, మనస్సంతా సంస్కారాలతో నిండి వున్నది, సద్గురువులకు బాగా తెలుసును. అటువంటి మనస్సుల్ని నాశనం చేసే బదులు, యింకా బాగా పెంచుతారు. చేతలనుండి తప్పించుకొనే మార్గం లేదు.

అందుచేతనే కొందరు గురువులు, " చర్య లేని చర్య " అనే మార్గాన్ని ప్రదర్శిస్తారు. ఈ చర్య కాని చర్య అంటే, ఇందులోని రహస్యమేమంటే, ఒక పని చేసేప్పుడు అ పనిని చేస్తున్నానన్న భావం రాకుండా చేయటం. అసలు చేశానన్నట్లు తెలియకుండానే చేయడం. అప్పుడేం జరుగుతుంది ? ఆ పనిని చేసేప్పుడు అంతకుముందున్న సంస్కారాలు ఖర్చయి పోతాయి. ఆ పనిలో నీ కెటువంటి స్వలాభం లేనందువ, కొత్త సంస్కారాలేవీ తయారు కావు. "

భోజనం వేళయింది కనుక ఖాళీ కడుపుకు మనో నాశవుపన్యాసం చెప్పటం అంత మంచిది కాదని, భోజనానికి లెమ్మన్నారు. అప్పటికి నాలుగు గంటలనుండి మనో నాశనమువకు సంబంధించిన వుపన్యాసంలో లీనమయి పోయిన సభ్యులకి బాబా

భోజనం విషయం జ్ఞప్తి చేయగానే అందరికీ ఒక్కసారి ఆకలి గుర్తొచ్చింది. భోజన శాలలో బల్లలపై ఘుమఘుమలాడే వంట కాలతో వడ్డన చేశారు. తృప్తిగా భోజనం చేసి, కాసేపు విశ్రాంతి తీసుకొని సరిగా 2-00 ల కల్లా మళ్ళీ అంతా మీటింగు హాల్లో సమావేశమయినారు.

## బాబా ననుసరించువారి ఎంపిక

బాబా ముందుగా, తన సేవకా మిత్రుల్ని వారి నిర్ణయం గురించి అడిగారు. బాబా మళ్ళీ విశదీకరించారు. ఒకవేళ ఎవరైనా కానీ, లేదా మిత్రులంతా కూడ తనతో రాదలచక పోయినచో, వారందరికీ మంచి ఆహారం, చక్కని వసతి, జేబు ఖర్చులకు కొంత పైకం ఒనగూరుస్తానని హామీ యిచ్చారు. ముందుగా బాబా విష్ణుని పిలిచి, హైదరాబాదులో వుండిపోయి, స్త్రీమండలికి కావలసిన భోజనం వసతి ఏర్పాట్లు చూడమని ఆదేశించారు.

నీలూ అనారోగ్యంతో వుండటంవలన, యీ సమావేశమునకు హాజరు కాలేదు. మురళి బాబాతో కాకుండా విడిగా వుండిపోవాలనుకున్నాడు. డాన్‌కిన్ ఎంతో భక్తితో " బాబా ! నా హృదయం మీతో రావాలనిపిస్తున్నది. అయితే శరీరం మాత్రం హైదరాబాదులో వుండిపోవాలనిస్తున్నది. " అని చెప్పాడు. తక్కిన ఆరుగురు సేవకమిత్రులు, పెండూ, గుస్తాద్‌జీ, బైదులు, యీరుచ్, కాకా, మరియు వైకోబాదులు బాబాతో వుండిపోవాలని నిర్ణయించుకున్నారు. వారావిషయాన్నే బాబాకు విన్నవించుకున్నారు.

అంత బాబా సందర్శకులవైపు చూచి, తాను చెప్పిన నియమాలకు కట్టుబడి, నాలుగు నెలలపాటు తనతో అనుసరించు టకు యిష్టమున్న వారిని లేచి నిలుచోమన్నారు. ఆనాడు హాజరైన 75 మంది ప్రేమికుల్లో 15 మంది మాత్రం బాబాను అంటిపెట్టుకొని అనుసరించేందుకు సంసిద్ధతను చూపించారు, వారు, మినూకరాస్, నానాఖేర్, ఫంకరాజ్, గోమాగణేష్. శైలర్‌మామా, తోడీసింగు, కిషన్‌సింగు, దౌలత్‌సింగు, ప్రీతమ్ సింగు, గడేకార్, బాబాదాస్, శ్రీపతి సహాయ, కైన్, పి డి. నిగమ్ (పుకార్) మరియు ఎ. సి. యస్. చారి.

ఏర్పాటువాలాలు, తమకు నవజీవనము ప్రారంభించే ముందు కొన్ని విధులు వప్పగించినందువలన, యీ విషయంలో ఎటువంటి నిర్ణయము చేయలేకపోయారు. బాబా తన నిర్ణయాన్ని పూర్తిచేస్తూ, " యీనాడు మీఅంతట మీరే నిర్ణయించుకొంటే, రేపు నా నిర్ణయం తెలుపుతాను. నాకు సంబంధించినంత వరకూ, నేనింతకుముందు ప్రకటించిందే ఖాయం. నిజానికి యీ నవజీవన ఘట్టం నాకు మాత్రమే సంబంధించినది. నేను దీనిని 1949 అక్టోబరు 16 న ప్రారంభించాను. నేటివరకు నేను నవజీవనం గడుపుతున్నప్పటికీ, నేను కోరుకున్నట్లుగా జీవించలేకపోయాను. రానున్న నాలుగు నెలల్లో, యీ నవజీవనమంతా పూర్తిగా గడిపి, సమాప్తం చేయదలచుకున్నాను. "

బాబా అలా ప్రకటించడం పూర్తికాగానే ఎంతో ప్రసన్నంగా కనిపించారు. మనో నాశనం గురించి వుపన్యాసం కొన

సాగించదలచలేదు. మర్నాడు దానిని పూర్తిచేద్దామనుకున్నారు. అంతలో ఛలోక్తులు విసురుతూ, ఏవైనా నవ్వు పుట్టించే కథలే మైనా చెప్పండి. మీరు నవ్వి నన్ను నవ్వించండి అని అడిగారు. అప్పుడు బాలనాటు "తెలివిగల నావికుడు" అనే ఒక హాస్య కథ చెప్పి బాబాని నవ్వించాడు. ఆ కథ యిది.

ఒక పెద్ద ఓడ నట్టనడిసముద్రంలో ప్రయాణం చేస్తున్నది. అందులో కొందరు అతితెలివిగల నావికులున్నారు. ఆ ఓడలోని 36 వ నంబరు గదిలో పయనిస్తున్న ఒక ప్రయాణీకుడు మరణించేసరికి అతడి శరీరాన్ని ఆ గదినుండి తీసి సముద్రంలో పారవేయమని, ఓడ అధికారి యీ అతి తెలివిగల నావికుడిని ఆదేశించాడు. పాపమా నావికులు 36 వ నంబరు గదిలోకి వెళ్ళేసరికి, చనిపోయాడనుకున్న ప్రయాణీకుడు లేచి కూర్చొని "నేను బ్రతికే వున్నానయ్యా !" అని చెప్పాడు. అందుకా నావికులు "లేదు. నీవు మరణించావని మా కెప్టెను చెప్పాడు. నిన్ను సముద్రంలో పారవేయమని ఆజ్ఞాపించుట చేత యిప్పుడు మేము నిన్ను సముద్రంలో విసిరివేయబోతున్నాము"ని చెప్పారు. అందుకా ప్రయాణీకుడు గజగజ వణకిపోతూ, "లేదు బాబూ ! లేదు ! నేను మరణించలేదు. మీరు పొరపడినట్లున్నారు. మరణించినవారు మరో గదిలో వున్నారేమో ? కనుక్కోండి !" అన్నాడు.

అందుకు నావికులత్యంత శ్రంచెపుతూ "లేదు మరణించినది నిజానికి నీవే ! అసలు నీవెవరవు. ?" అని అడిగారు. నేనొక

పత్రికా రిపోర్టరుని అని జవాబిచ్చాడు. దాంతో నావికులలో ధృఢ మైన అభిప్రాయం ఏర్పడింది. పత్రికా రిపోర్టర్లంటే మాకసలు నమ్మకం లేదు. వాళ్లిచ్చేవన్నీ తప్పుడు సమాచారాలే ! నిజంగా అసలు చచ్చిపోయింది నీవే అంటూ ఆతడ్ని బలవంతంగా పట్టు కొని, సముద్రంలోకి విసిరేశారు అని యీ హాస్యకథని చెప్పి బాబాతోపాటు అందరినీ కాసేపు నవ్వించాడు బాలనాటు. మరి కొందరు, హిందీలోను, గుజరాతీలోనూ, ఇంగ్లీషులోను, కొన్ని జోకులు చెప్పి అందరినీ కాసేపు నవ్వించారు.

## జీవిత గమ్యం

మర్నాడు, అది జూన్ 29 ఉదయం 8-00లకు అంతా మళ్ళీ హాల్లో సమావేశమైనారు. అప్పటికే బాబా వచ్చి కూర్చు న్నారు. గతరాత్రి తనకు సరిగా నిద్రపట్టనందున, మనో నాశన ఘట్టంలో తనతో అనుసరించేవారిని ఇంకా నిర్ణయించలేకపోయా నని బాబా చెప్పారు. ఏ విధమైన ప్రమేయాలు లేకుండా నేను పూర్తి స్వేచ్ఛగా వుంటేనే తప్ప యీ ఎంపిక తేలిగ్గా జరగదు. నా సేవకులు, పెండూ, యీరుచ్, గుస్తాద్ జీ, బైదులు వున్నారు. ఓ. కె. చాలామంచిది. కానీ, అది భగవంతుడికే తెలుసును. నేనింతవరకు వారిని గురించి కూడ నిర్ణయించలేకపోయాను.

ఏ మాత్రం విరామం లేకుండా గత రాత్రి గడిచింది. కనుక నేనెటువంటి నిర్ణయం తీసుకోలేక పోయాను. యిప్పుడా నిర్ణయం పూర్తైతేకానీ నాకు నిద్రపట్టదు. ఒకడున్నా నాకు అడ్డు

అనుకొంటే నేను ఒంటరిగానే వెళతాను. అయితే అది కూడ సాధ్యమయ్యేట్లు లేదు. కనుక నా నవజీవనంలో ఆఖరిసారిగా ఒక్క విషయం చెప్పదలచుకొన్నాను అని అంటుండగా ఘనీ కల్పించుకొని, "బాబా ! మహమ్మదీయులు, క్రిష్టియన్లు, ఒకే మరణం ఒకే జననం అన్న నమ్మకం కలిగి వున్నారు. దాని మీద మీ వివరణ తెలుపండి !" అని అడిగేసరికి బాబా ఇలా చెప్పారు.

"నిజమైన జీవిత గమ్యం, అహం చచ్చిపోవటం కాదు. మనస్సు చచ్చిపోవాలి. మహమ్మదు కానీ, జీసను కానీ, జోరాష్టరు కానీ, జననం కానీ, మరణం కానీ ఒకేసారి వస్తుంది అని చెప్ప టంలో వుద్దేశ్యం, అక్కడ మనస్సుది గానీ, శరీరంది కాదు, చావు పుట్టుకల అనుభవం మనస్సు పూర్తిగా చచ్చిపోయినప్పుడు, మిధ్యా అహం, యదార్థ నేనుగా మారుతుంది. అంటే మిధ్యా అహం పూర్తిగా తుడిచివేయబడి, నిజమైన నేను స్పష్టమౌతుంది. యదార్థానికి అహం ఎప్పుడూ పుట్టదు. కనుక దానికి మరణ ముండదు. అహం ఎప్పుడూ సత్యమే. మనస్సు వలననే, అహం తానొక పరిమితమని, మిధ్య అని భ్రమిస్తుంది. మనస్సు దానికున్న మంచి, చెడు సంస్కారాల ఫలితంగా శరీరం పొందు తోంది."

"శరీరాలు తీసుకోవటం, వదిలేయటం అనేది చేసేది మనస్సు కాదు. అలాగే అహం పుట్టటం లేదు. మరణించడం లేదు శరీరం వదిలేసిన ప్రతిసారీ, మనస్సు బ్రతికే వుంటున్నది.

సంస్కారాలు వుంటున్నాయి. యీ సంస్కారాలు, మరో రూపంలో శరీరందాల్చి వాటినివదిలించుకోమని, మనస్సుపై వత్తిడి తెస్తై. అందువలన, ఆ సంస్కారాలననుసరించి, మనస్సు మరో శరీరం తీసుకుంటోంది. అహం సాక్షిగా వుండిపోతుంది. అలా మరో శరీరం మరో శరీరం అంటూ గొలుసుకట్టుగా యివి జరుగుతూనే వున్నాయి.

నీవు గాఢ నిద్రలో వున్నావనుకో, అప్పుడు, అహం, మనస్సు, సంస్కారాలు అన్నీ నీలోనే వుంటయి. సంస్కారాలు మనస్సును తిప్పి, మమ్మల్నినుభవించి ఖర్చుపెట్టు, అంటయి. అలా నిద్రనుండి రోజూ లేపటమనేది ఒక విధంగా రోజూ శరీరానికి జననం వంటిది. ఒక శరీరం వదిలేసినప్పుడు మరో క్రొత్త శరీరం వస్తున్నది. యీ రెండు చర్యలమధ్య కొంత కాలయాపన జరుగుతుంది. నిద్రనుండి లేపినప్పుడు మాత్రం అదే శరీరంలో లేస్తున్నాడు. కొత్త శరీరంలో అహం ఉన్నా లేకపోయినా మనస్సనేది వుంటుంది. స్వర్గ నరకాలనేవి మనస్సనుభవించే స్థితి మాత్రమే. మనస్సనేది మానవ శరీరంలో వుండగా, పూర్తి చైతన్యం నిలుపుకొని, మనసు మాత్రం మరణించాలి. అదే మన గమ్యం అని బాబా చెప్తూ ఈ విషయం మీరు బాగా గ్రహించ గలిగితే మనో నాశనం గురించి నేను చెప్పబోయే ప్రవచనం మీకు బాగా అర్థం అవుతుంది, అని వివరించారు.

## త్రివిధ మార్గాలు

అసలు విషయాన్ని తేలిక పదాల్తో వివరించడం మొదలు పెట్టారు. "మనో నాశనమునకు, సద్గురువులు మూడు విధాలైన మార్గాల్ని ప్రబోధించారని, నిన్న మీతో చెప్పాను. చేతలకు సంబంధించిన మార్గం గురించి యిప్పుడు ప్రారంభిద్దాం. ఎందు చేతనంటే, శరీరం ద్వారా మనస్సు చేసే కార్య క్రమాలే చేతలు. మనస్సున్నన్నాళ్ళు శరీరం వుంటుంది, దాంతోపాటు చేతలు కూడా వుంటయి. చేతలుమూలాన సంస్కారాలొస్తాయి. యీ సంస్కారాలే మనస్సుకు మేత. కనుక అసత్య మిధ్యా అహం నిజమైన దానిగా రూపాంతరం చెందాలి. ఇందుకు మనోనాశనం తప్ప మరో ప్రత్యుపాయం లేదు.

అందుకే గురువులు, చేతలనేవి, సంస్కారాలు తయారు కాకుండ నిర్వీర్యమయ్యేట్లు చేయాలని చెపుతారు. ఆలా చేస్తే ఏ ఫలితముండదు. ఎటువంటి బంధము లేర్పడవు. ఉదాహరణకు తోక ఝాడించి కుట్టటం తేలు లక్షణం. ఎవరినో ఒకరిని కుట్టటం దానికి సహజం. దానివలన వచ్చే ఫలితమేమిటి ? కుట్టిన వ్యక్తి బాధపడతాడు. తేలు కొండిలోని ముల్లుని కత్తిరించినా, అది తన తోకని ఝాడిస్తూ కుట్టటం మానదు. అయితే దాని కొండీలోని ముల్లుని తొలగించినందువల్ల అది కుట్టిన వ్యక్తికి ఏమాత్రం బాధ వుండదు.

అదేవిధంగా గురువులు, చేతల్ని సంస్కారరహితంగా చేయటానికో వుపాయం ఆలోచించారు. ఎటువంటి బంధాలు,

సంస్కారాలు సృష్టించబడకుండా వుండే ఫలితాన్నిచ్చే విధంగా చేతలు చేయాలి. అయితే అలా చేయటానికి ప్రయత్నించటం చాలా కష్టం. భయంకర ఫలితాల్నిచ్చే చేతలు నిర్వీర్యమయ్యే విధంగా చేయటం చాలా కష్టం. ఎందుకంటే ? నేను వివరిస్తాను వినండి.

ఎటువంటి బంధాల్ని పొందని చేతలు, మూడు విధాల చేయవచ్చును. ఏవిధమైన స్వార్థ ప్రయోజనకాంక్ష లేకుండా చేయటం ఒకమార్గం. మరి, నిస్వార్థ సేవకోసరం చేసే యీ స్వార్థరహిత చర్య చేయటం చాలా కష్టం. అటువంటి చర్యల్లో యితరుల గురించి ఏమాత్రం జాలి దయ అనేవి వుండకూడదు. ఇతరులకు నేను సేవ చేస్తున్నాను, వారి వున్నతికి సహాయపడు తున్నాను అన్న భావం నీలో వచ్చిందా, అది బంధాన్నేర్పరిచిం దన్నమాటే.

యిహ రెండో మార్గం, నీవు ఏపని చేసినా, దైవానికి గాని, గురువునకు గాని సమర్పించుకోవటం. యీ సమర్పణ విడవకుండా నిలకడగా, ఒక్కక్షణం అంతరాయం కూడ లేకుండా కొనసాగాలి. యీ విధంగా నీవు చేయదలచినప్పుడు అట్టి చర్యలు ఏవిధమయిన బంధాల్ని, సంస్కారాల్ని సృష్టించవు. కానీ యిలా చేయటం కూడ చాలా కష్టమే.

మరి మూడో మార్గ మున్నది. యీ మూడో మార్గం ప్రకారం మనస్సు నాశనమయినవారు యిచ్చే ఆజ్ఞలు జవదాట

కుండా పాటించటం అలా చేసినప్పుడు సంస్కారాలంటవు. ఆయన నిన్నే పని చేయమంటే అది చేసినప్పుడు నీకేసంబంధ ముండదు. యిదీ అంత సులభం కాదు. నీకాసద్గురువుపై నూరు శాతం పరిపూర్ణ విశ్వాసం, నమ్మకం వున్నప్పుడే అలా నడుచుకో కలుగుతావు.

రెండవ మార్గం ధ్యానానికి సంబంధించినది. కొందరు గురువులు ధ్యానం ద్వారా, మనస్సును మనస్సుద్వారానే ఓడించే విధానాన్ని రూపొందించారు. ధ్యానంలో ఏకాగ్రత కావాలి. ఏకాగ్రతతో మనస్సును కేంద్రీకరించినప్పుడు దాని తదుపరి పని చేయటం బలహీనమైవున్న సంస్కారాలు వాటంతటవి, ఖర్చై పోతై. అమలు పరచి తీరాల్సిన పాపపాములు లాంటి యీ సంస్కారాలు వాటినవే తినేస్తయి. అయితే యీ విధానంలో మనస్సు నిష్ఫలమై నైరాశ్యం చెందుతుంది. అనవసరమయిన ఆలోచనలు నీకెన్నడూ రానివి, నిన్ను చుట్టుముట్టి ప్రచండ వేగంతో ఆక్రమించి, మూడురకాల విషయాలు సంభవిస్తయి.

1. విసిగిపోయిన నీవు ఏ మాత్రం ఏకాగ్రత చూపలేవు. 2. నిద్రమత్తులో తూలిపోతావు 3. యింకా యింకా దుష్టతలంపు లధికమవుతయి. కానీ బహు అరుదుగా, ఏ కొద్ది మందో, వీట న్నిటినీ ధైర్యంతో భరాయించి, ఓర్పుతో నిలదొక్కుకోగలిగితే, దాని ఫలితంగా వారి మనస్సు తాత్కాలికంగా పని చేయకండా ఆగి పోతుంది. అప్పుడాతడు హర్షోన్మాదాన్ని అనుభవిస్తాడు. అది ఒక మాదకద్రవ్యంగా మారి, దాని వ్యసనానికి లొంగిపోయేట్లు

చేస్తుంది. లేదా సమాధి అవస్థలోకి వెళతాడు. అయితే యిది మనో నాశనం క్రిందకురాదు. యీవిధంగా ఏకాగ్రతద్వారా మనో నాశనం చెందటం సాధ్యపడదు.

మూడవ మార్గం భక్తి. ఎవరైనాసరే ! భగవంతుడు లేదా గురువు యెడల పూర్తి భక్తితో వున్నప్పుడు, అతడు తనను తాను మరిచిపోతాడు. అప్పుడతని మనస్సుకు సరికొత్త సంస్కారాల్ని సంపాదించుకొనే అవకాశం వుండదు. శాశ్వత ప్రియతముడు ఎప్పుడూ నీ యెదుటనే వున్నాడు. నీ పాత అలవాట్లనుండి నీవు బయట పడితే తప్ప, ఆయనను కలవాలన్న ఆకాంక్ష నీకెలా కలుగుతుంది ? కనుకనే యీ భక్తిమార్గం ద్వారా కూడ, స్వార్థాన్ని పూర్తిగా మరవటమనేది, వ్యావహారికంగా దుర్లభమయిన విషయం. అందుకే మనో నాశనం జరగదు.

శరీరం ద్వారా అహం ఆలోచించేటట్లు చేయటం, మనస్సుయొక్క విధి. తప్పుడు భావాలు కలిగించి, సంస్కారాలు అనుభవించేట్లు చేస్తుంది. అయితే మిధ్యాఅహం తన నిరంకుశత్వాన్ని అంగీకరించేందుకు సిద్ధంగా లేదని మనస్సు గ్రహించినప్పుడు, అప్పుడది వినమ్రతగా తయారౌతుంది. బలహీనమయిన సంస్కారాలు తయారై క్రమంగా సడలిపోయి, తుదకు అతని గమ్యం చేరేట్లు చేస్తుంది.

యీవిధంగా నిస్వార్థసేవద్వారా కానీ. ధ్యానం ద్వారాగానీ, భక్తి ద్వారా కానీ, పరిపూర్ణత్వం లభ్చినా లభ్చకపోయినా, నూరుశాతం నమ్మకంతో సాధించాలన్న తపనతో ప్రయత్నించి

నప్పుడు, మనస్సు శాశ్వతంగా విశ్రాంతిగా వున్నప్పుడు, లేదా అసలు పనిచేయకుండా వున్నప్పుడు, భగవంతుని సర్వత్రా చూచే స్థితి వస్తుంది. ఆయనలో ఐక్యం కావాలన్న కాంక్ష కలుగుతుంది. పరిపూర్ణుడైన గురువు మాత్రమే, యితరుల మనస్సులను సమూలంగా నాశనం చేయగలుగుతాడు. కావాలనుకుంటే సామూహికంగా కూడ మనో నాశనం చేయగల సమర్థులు సద్గురువులు.

" అనంతుడు, శాశ్వతుడు అయిన ఆ దైవమే నీవని తెలుసుకోగలిగేందుకు అవసరమైన మనో నాశనం కొరకే యీ మార్గాలన్నీ వుద్దేశించబడ్డాయి. మనమంతా ఒక్కటే. దేముడొక్కడే. కానీ భ్రాంతిజనక మనస్సు వలన మోసపోతున్నాము. మనస్సు చచ్చిపోతే, నేనే దేముడ్ని అని, యీ శరీరంతో నాకేసంబంధం లేదని, అహం అనుభవంతో తెలుసుకోగలుగుతుంది. యీ ప్రచండమైన కుదుపు బలంగావుంటే, శరీరం వెంటనే వదిలేస్తాడు. లేకపోతే సంస్కారాల ప్రభావం వలన, కొంతకాలంపాటు శరీరంతో వుండి ఆ తరువాత వదిలేస్తాడు. "

" ఇది మజ్‌జూబ్‌యొక్క స్థితిని సూచిస్తుంది. మనస్ససలే వుండదు. యదార్థ " నేను " " శరీరం మాత్రమే మిగిలివుంటయి. మనో నాశనం జరిగింతర్వాత కొందరైతే శరీరంతో పాటు మనస్సును కూడ వుంచుకుంటారు. యీ మనస్సులకు సంస్కార రహిత సంస్కారాలుంటయి. అప్పుడుండేవి, నిజమైన నేను,

నిజమైన మనస్సు, నిజమైన శరీరం. అటువంటివారినే సద్గురువు అంటారు. ''

'' మనస్సు మరణించినప్పుడు, అహం సత్యాన్ని గుర్తిస్తుంది. మనో నాశనంతో జ్ఞానోదయ మవుతుంది. జ్ఞానంవలన, నేను దేముడ్నన్న స్థితి అనుభవానికి వస్తుంది. అప్పుడు దైవ జ్ఞానం నీదేఅవుతుంది. భగవంతుడు సర్వజ్ఞుడు కనుక తృటి మాత్రంలో నీవు సర్వం తెలుకోగలవు, ఇహ తెలుసుకోవలసిందంటూ ఏమీ లేదని నీవు తెలుసుకుంటావు. ''

నేనిప్పుడు పూర్తిగా నవజీవనంలో వున్నాను. నాలో అన్నీ బలహీనతలే. మరి మనో నాశనం సాధించాలంటే ఎంతో కష్టమైన పని. కేవలం నాలుగు నెలల కాలంమాత్రమే నాకిప్పుడున్నది. యీ నా పరిస్థితి, ఒక కుంటివాడు నాలుగు నెలల్లో ఎవరెష్టు శిఖరం అధిరోహించాలని కోరటం లాగా వున్నది. కాని నేను దానివి సాధించేందుకు దైవం నూటికి నూరుపాళ్ళ నాకు సహాయం చేస్తాడన్న నమ్మకం వుంది. అక్టోబరు 16న మీరంతా వుపవాసమున్నప్పుడు, ఒక్క అయిదు నిమిషాలపాటు, మీ హృదయాంతరాళాలనుండి, యిది సుఖాంత మయ్యేట్లు నాకు తగు సహాయాన్ని అందించమని దైవాన్ని ప్రార్థించండి. '' అని చెబుతూ ఆనాటి తన ప్రవచనాన్ని ముగించారు.

## దైవానికి ధన్యవాదములు

మనో నాశన కాలంలో నాతో అనుసరించవలసిన వారిని ఎంపిక చేసేందుకు నాకు కొంత విశ్రాంతి కావాలి. మనోరం

ఐతం కలిగేందుకు కాసేపేమైనా ఆటలాడుకుంటే వూరట కలు గుతుంది అన్నారు. అలా బాబా అనేసరికి, అందరి మనస్సులూ గంభీరమయిన విషయములనుండి మరలి ఒక్కసారిగా ఆనందంతో, హాస్యంపైన, ఆటలపైన లగ్నమయింది. ఏమాటలాడదామన్న ప్రశ్న వచ్చేసరికి, ఒక్కొక్కరూ ఒక్కో ఆట ప్రదిపాదించారు.

బాబా అందరు చెప్పేవి శ్రద్ధగా విన్నారు. మధ్యలో కొందరు చెప్పిన ఆటలపై ఛలోక్తులు కూడా విసిరారు. అనుకోకండా మధ్యలో ఆయన ఒక అర్ధగంట విరామాన్ని ఆజ్ఞాపించారు. ఆ విరామ సమయంలో అవునన్న 21 మందినీ ఒక్కొక్కరినీ పిలిచి ఇంటర్వ్యూ చేశారు. వారిలో అత్యధికులు గృహస్థులు కనుక, తనతో వస్తే కలిగే సాధక బాధకాలు, కష్ట నష్టాలు, లాభ నష్టాలు, బాధ్యతలు మున్నగు వాటన్నిటి గురించి స్వేచ్ఛగా చర్చించారు. తనయందు వారికున్న భక్తి శ్రద్ధలు, ఆయన పిలుపుకు వారిచ్చిన ప్రతిస్పందన, చూపిన ధైర్య సాహసాలకు సంతృప్తి చెంది మెచ్చుకున్నారు.

నిష్కపటం నిజాయితీతో కూడిన ఎటువంటి నివేదన కానీ, భావప్రకటన గానీ, బాబా ప్రశంశకు పాత్రమవుతయి. వారి వినవిధేయతకు ముగ్ధులైన బాబా, ఆ అదృష్టఘడియకొరకు ఎదురు చూడమని వారిని సంతృప్తి పరిచారు. తర్వాత హాల్లో మళ్ళీ సమావేశమయినప్పుడు ఆ 21 మందిలో 15 మందిని వద్దని

చెప్పారు. నాలుగు నెలలు తప్పనిసరిగా ఆయనను అనుసరించ వలసిన వారి పేర్లలో పెండూ, ఈరుచ్, గుస్తాద్‌జీ, బైదులు, కాకా, కైకోబాదుల పేర్లు తప్పని సరిగా వున్నాయి. మినూ కరాస్ దౌలత్‌సింగుల విషయంలో 1951 సెప్టెంబరు 7వ చెపుతా మన్నారు.

ఆదీని పిలిచి, బాబా ప్రేమికులందరికీ, బాబాతో ఎటు వంటి ఉత్తర ప్రత్యుత్తరాలు జరపవద్దని, ఒకవేళ ఆయన జాడ వారికి తెలిసినా కలిసేందుకు ప్రయత్నించ వద్దని ఒక సర్క్యులరు పంపమని ఆదేశించారు. అంతకు ముందనుకున్నట్లు మళ్ళీ ఆటల గురించి చర్చ సాగింది. వుల్లాసం కలిగించే ఫ్యాన్సీ డ్రెస్సు ప్రదర్శనవంటిది చేస్తే బాగుంటుందని బాబాయే స్వయంగా ప్రతిపాదించారు. ఆ కార్యక్రమంలో పాల్గొన వల సిన వారి పేర్లు కూడ ఆయనే వెల్లడించారు.

భోజనాలయింతర్వాత పెండూ ఆధ్వర్యంలో హాల్లో చిన్న స్టేజీ నిర్మించారు. సాయంత్రం 3 గంటలకు ప్రదర్శన ప్రారంభమైంది. అంతా సంతోషంతో తిలకిస్తున్నారు. ముందుగా డా॥ ఘనీ పఠాన్ వేషంలో వచ్చేసరికి అంతా కరతాళ ధ్వనులు చేశారు. ఆనాటి కార్యక్రమాలన్నిటిలోకీ, సేవక్ కొత్వాల్ అనే వారు వలభై ఏళ్ళు నిండినా యువకుడులా అద్భుతంగా నాట్యం చేసి, తన నటనాకౌశలాన్ని ప్రదర్శించేసరికి, బాబా ఆశ్చర్య చకితులైనారు.

ఆఖరి అయిటం, రుస్తుంకాకా స్వయంగా హార్మోనియం వాయిస్తూ పాడిన మీరాబాయి గీతం. "దైవమానవుడైన రాముని దివ్యనామం అనే అమూల్య ముత్యాన్ని, నిజానికీనాడు నేను కనుగొన గలిగాను" అనేది ఆ పాటయొక్క సారాంశం. యీ పాట పాడినంతసేపు బాబా గంభీరంగా మారిపోయారు. ఎక్కువసేపు కళ్ళార్పకుండా కిటికీనుండి బయటకు చూస్తూ వుండిపోయారు. ఇలా జరగటం చాలా అరుదు. రుస్తుంకాకా కళ్ళు మూసుకొని పాటలో లీనమై తన్మయత్వంలో పాడుతున్నాడు.

పాట పూర్తయ్యేసరికి, బాబా దృష్టి సభాసదులవైపు మరలింది. "నేనీపాటని, ఇటువంటి యింకా అనేక పాటల్ని, ఇంతకు ముందెన్నిసార్లో విన్నాను. కానీ యీనాడు విన్నదాంట్లో కొంత తేడా వుంది. యీ పాట నాలో ఏదో మేల్కొలిపింది, దేముని ముందు నేను చేపట్టిన పని, దిగ్విజయంగా సమాప్తమవుతుందన్న భావం నాలో కలిగింది. కనుక మనమంతా దైవానికి ధన్యవాదములు చెబుదాం" అన్నారు. బాబా ఆదేశం మేరకు అంతా నిలబడి, తమ హృదయాంతరాళాలనుండి దైవమునకు ధన్యవాదములర్పించారు.

అప్పుడు సాయంత్రం గం 4-30 ని॥ లైంది. కార్యక్రమం ఆఖరులో అందులో పాల్గొన్న అందరికీ బాబా తన ఫొటో వున్న లాకెట్లను బహుమతిగా తలాఒకటి తన స్వహస్తాలతో యిచ్చారు. అదిచూచి తక్కిన వారు, ప్రియతముని స్వహస్తాలద్వారా అమూల్య బహుమానం తాముకూడ పొందలేక పోయామే అని

చింతించారు. బహుశా వారి భావాల్ని బాబా కనిపెట్టారల్లేవుంది. కొన్ని గులాబీపూలు తెప్పించి, తక్కిన వారందరికీ తలాఒక పూవు యిచ్చారు.

తర్వాత సభికులనుద్దేశించి బాబా యిలా చెప్పారు. మిమ్మల్ని పిలిపించిన ప్రధానకార్యక్రమం సమాప్తమైంది. రేపు మనమంతా వుస్మాన్‌సాగర్ తదితర ప్రదేశాలు చూచేందుకు వెళదాం. అంతా నాతో రండి అన్నారు. అంతలో ఒకరు కల్పించుకొని బాబాతో గ్రూపు ఫొటో ఒకటి తీసుకొనేందుకు అనుమతి కోరాడు. అందుకు బాబా అంగీకరించేసరికి, వెనువెంటనే అందరితో గ్రూపు ఫొటో తీయబడింది. బాబా నవజీవనంలో తీసిన ఆఖరి ఫొటో ఇదే. నిజానికీ ఫొటో అమూల్య సంపద లాంటిది.

## దైవమానవుని లీల

మర్నాడు జూన్ 30. ఆనాడు ఉదయం గం 7-00 లకల్లా అంతా హాల్లో తయారయ్యారు. బాబా ఆనాడు మామూలుగా తొడుక్కొనే తెల్ల సద్రాపైన పసుపు పచ్చని సిల్కు కోటు ధరించారు. తల దువ్వుకొని జడ వేసుకున్నా కురులు చెవులపై వ్రేలాడుతున్నాయి. ఆయన బక్క చిక్కినట్లు కనపడినా, ఎంతో అందంగా శక్తివంతునిగా కనపడుతున్నారు. అక్షర ఫలకం తీసుకొని వ్రేళ్ళు కదిలిస్తున్నారు. "ఈ రెండు రోజులు నాకెంతో ఆనందం కలిగించాయి. మీరు కూడ ఆ ఆనందంలో

పాలు పంచుకుంటున్నారనుకుంటాను. దైవం, గత కాలపు, ప్రస్తుత రాబోవు సద్గురువుల సమక్షంలో నేను చేసిన ప్రకటనకు మీరు కూడ సాక్షులు. నేనందుకు చాలా సంతోషిస్తున్నాను. ఏ కపటం లేకుండా చెపుతున్నాను. నాకు చాలా ఆనందం కలిగింది. అంటూ తన చేతిలోని అక్షర ఫలకం ప్రక్కన పెట్టారు. బయట వీరి కోసం సిద్ధంగావున్న బస్సుల్లో ఎక్కమని సౌంజ్ఞ చేశారు.

బాబా ఆదేశానుసారం అంతా బస్సుల్లో బయలుదేరారు. ముందుగా హుస్మాన్‌సాగర్ దగ్గరికి వెళ్ళారు. అది మానవ నిర్మిత మైన పెద్ద చెరువు. టాంకు బండు దాటి అవలివైపున వున్న ఉద్యానవనం చేరారు. చల్లని పిల్లవాయువులు ఆహ్లాదం కలిగిస్తు న్నాయి. కాసేపు అక్కడ గడిపి, తర్వాత చార్మినారు వెళ్ళారు. దాని ప్రక్కనే వున్న మదీనా మసీదు కూడ సందర్శించారు. సమీపంలో వున్న ఒక మంచి హోటలులో బాబా అందరికీ టీ ఇప్పించారు.

చార్మినారు నుంచి తిరిగి వస్తూ సాలార్‌జంగ్ మ్యూజియం లోనికి తీసుకు వెళ్ళారు. ఇది ఒక అద్భుత కళాఖండం. 78 గదులున్నాయి. ప్రసిద్ధి చెందిన అమూల్య, అద్భుత కళాఖండా లెన్నో ప్రదర్శించబడ్డాయి. అవన్నీ చూడాలంటే రోజంతా తిరిగినా చాలదు అయితే బాబా మాత్రం 45 నిమిషాల్లో అన్నీ చూపించి, బయటకు తీసుకు వచ్చారు. పిమ్మట పబ్లిక్ గార్డెన్సుకు తీసుకువెళ్ళి గబగబా వనమంతా తిప్పారు. దారిలో, బృందాన్ని

ఆపి, హైదరాబాదంటే తనకెంతో ఇష్టమని, దాని ఆధ్యాత్మిక వాతావరణం తనకు బాగా నచ్చిందని, ఆధ్యాత్మికంగా, హిందూ ముస్లింల ఐక్యత, ప్రత్యేక ప్రాధాన్యతగా చెప్పవచ్చని వివరించారు. మాటల మధ్య, గత రెండు నెలలుగా తాను తలంటి పోసుకోలేదని, వారంతా వెళ్ళిపోగానే తల స్నానం చేయాలనుకుంటున్నానని తెలిపారు. యిలాంటి "స్వంతవిషయాలు ఎందుకు చెప్పటం ?" అని మనకనిపించవచ్చును. ముచ్చటిస్తున్న వారితో తనకున్న సన్నిహితత్వాన్ని యిది నిరూపిస్తుంది.

బృందమంతా ఆలీనవాజ్ జంగ్ భవనం చేరగానే అంతా మేడమీదకు వెళ్ళారు. బాబా ప్రతి ఒక్కరికి మిఠాయి పొట్లాలు ప్రసాదంగా పంచిపెట్టారు. యింటికి చేరేంతవరకూ ఆ పొట్లాన్ని తెరవ వద్దని ప్రతి ఒక్కరికీ చెప్పారు. ఇళ్ళకు వెళ్ళాక, తమ కుటుంబ సభ్యులతో లేదా యిష్టమైన సన్నిహితులతో అందులో వున్న ప్రసాదాన్ని పంచుకొని తినమన్నారు. ఆయన ప్రేమని ప్రతి ఒక్కరిమీద అలా వర్షింప చేశారు. "నేను భోంచేసి గం 2-00 లకు వచ్చి మీ అందరికి వీడ్కోలు చెపుతాను. ఎవరూ ఆ సమయంలో నన్నేమి ప్రశ్నించకండ"ని చెప్పి, భోజనానికి బాబా వెళ్ళిపోయారు.

ప్రేమికులంతా తమ సామానులు, బెడ్డింగులు సర్దుకొని. భోజనాదులు పూర్తిచేసి, బయలుదేరటానికి సిద్ధంగా వున్నారు, కాసేపు విశ్రాంతి తీసుకొందామనుకొనేంతలో బాబా కారులో రానే వచ్చారు. పిచ్చాపాటి మాట్లాడుకుంటూ, చతురోక్తులతో.

హాస్య కథలతో కాసేపు కులాసాగా గడిచింది. రాత్రి భోజనం పొట్లాలు కట్టి అందరికీ పంచిపెడుతూ "యిందులో ఒక్క మెతుకు కూడ వృథా చేయవద్దు. దైవీమానవుని యింటినుంచి యిచ్చిన ప్రసాదమిది. నిజానికిది పుచ్చుకోతగిన అమూల్య పదార్థం" అంటూ చేతులూపుతూ విచారించకండి సంతోషంగా ఉండం డంటూ చిరునవ్వుతో వీడ్కోలు చెప్పారు.

తనతో ఇంకెవరినీ, వస్తామని కానీ, రావటానికి ప్రయత్నం చేయటం కానీ చేయవద్దని మరోసారి చెప్పారు. యీరుచ్, పెండూ గుస్తాద్‌జీ బైదులు మాత్రం, తనతో తీసుకు వెళతు న్నట్లు, చివరకు ప్రకటించారు. నాలుగు నెలల తర్వాత అక్టోబరు 16 నుండి మినూ, డా॥ దౌలత్‌సింగులు వుండాలని నిర్ణయించారు.

## మనో నాశన తొలి ఘట్టం

జూన్ ఆఖరి వారంలో జరిగిన అత్యంత ప్రాముఖ్యత గల సమావేశానంతరం, నవజీవన మిత్రులతో సహా బాబా హైదరాబాదులోనే వుండిపోయారు. వారిలో మురళికాలే అనే ఆయన ఒకరు. ఒక రోజున ఆయన బాబా అనుమతిస్తే, వారికి అభ్యంతరం లేకపోతే, తాను హోమియోపతి వైద్యం కోర్సు చదువుకుంటానని వెల్లడించాడు. అందుకు బాబా సమ్మతించి, అతడిని నవజీవనం నుండి విముక్త పరచి, మళ్ళీ పూర్వ జీవనం లోకి పంపి మంచి హోమియోపతి డాక్టరుగా యోగ్యత సంపా దించమన్నారు. అలాగే మురళికాలే కోర్సు పూర్తిచేసి, ఆ

తర్వాత జబల్‌పూర్‌లో డాక్టరు వృత్తి ప్రారంభించి, 1977 లో ఆయన మరణించే వరకూ తన ప్రాక్టీసు కొనసాగించారు.

బాబా ఆజ్ఞానుసారం, సేవక మిత్రులు, స్త్రీమండలి, అందరూ కూడ జూలై 10 న ఉదయం గం 6-00 ల నుండి 24 గంటలపాటు వుపవాసం వున్నారు. మరువరాని యీ జూలై 10వ తేదీన తన ప్రియ ప్రేమికులంతా వుపవశించటం, మౌనం పాటించటమనేవి చేసేట్లు బాబా ఆజ్ఞాపించటం బహుశః యిదే మొదటి సంవత్సరం. తదుపరి సంవత్సరాల్లో అంటే 1960 దశకంలో యిలాంటివి ఆచరించమని తన ప్రేమికులకు యధా క్రమంగా సర్క్యులరు రూపంలో కోరటం జరిగేది. 1968 లో వుపవశించాలన్న నియమం పెట్టలేదు. యిహ అప్పటినుండి తన ప్రేమికులు కేవలం ఆనాడు మౌనం పాటిస్తే చాలని ఆయన కోరికేమో ! జూలై 10 న మౌన ప్రేమతో మౌనావతారుడ్ని గుర్తుంచుకోవటం ఎంతటి అనిర్వచనీయ అనుభవమో చెప్ప నలవి కానిది.

రాబోయే రోజుల్లో ఏర్పాటు చేయవలసిన అనేక విష యాల గురించి చర్చించేందుకు బాబా, ఆగస్టు రెండో వారంలో మెహెర్జీ, ఆదీ, తను కనిష్ఠ సోదరుడు ఆదీ జూనియరులను హైదారాబాదుకు పిలిపించుకున్నారు. వారితో సంభాషిస్తున్న సమయంలో, సూచన ప్రాయంగా మనోనాశనము యొక్క అమిత వత్తిడి వలన, సంకట పరిస్థితిలో తను శరీర త్యాగం చేసే అవకాశం వుండవచ్చునన్నారు. పైపెచ్చు యీ నాలుగు

నెలల కాలంలో పూర్తి స్వేచ్ఛతో తన యిష్టం వచ్చిన రీతిలో నడచుకుంటానని కూడ చెప్పారు. ఏ క్షణంలోనైనా, తానంతకు ముందు నిర్దేశించిన పథకాన్ని మార్చాలనుకుంటే మార్చేస్తానన్నారు.

పరస్పరం ఆపాదించుకున్న బంధములన్నిటి నుండి పూర్తి స్వేచ్ఛను కలిగి వుంటానని, చెపుతూ, నాలుగు నెలలకు సంబంధించి, ఒక తాత్కాలిక కార్యక్రమాన్ని తయారు చేయించారు. ఆ కార్యక్రమం మూడు ఘట్టాలుగా నిర్ణయించారు. మొదటి ఘట్టంలో ముప్పయి, నలభై రోజులపాటు ఏదైనా ఒక ఆధ్యాత్మిక చరిత్ర వున్న కొండపై గడపదలచారు. అటువంటి కొండ హైదరాబాదు నగరానికి అంత సన్నిహితంగా కాకుండా, మరీ దూరంగా వుండకుండా వుండేట్లు వెతకమని శిష్యులను ఆదేశించారు. ఆ కొండపై ఆయన చేసే పని మొదటి ఘట్టానికి సంబంధించినది.

రెండవ ఘట్టంలో, కాలినడకన హైదరాబాదు నుండి ఔరంగాబాదు వెళ్ళేందుకు పథకం వేశారు. ఆ ప్రయాణ సమయంలో కేవలం తాను లంగోటీ మాత్రమే ధరిస్తానని సూచించారు. ఇంకా, భోజన విషయంలో తింటే రోజుకు నాలుగు సార్లు భోజనం చేస్తానని, లేకపోతే రోజులు తరబడి వుపవశిస్తానని చెప్పారు. క్లుప్తంగా చెప్పాలంటే, దేముడేమిచేయమంటే అది చేస్తానని వివరించారు.

మూడవ ఘట్టం ఆయన భౌతిక శరీర పరిస్థితి మీద ఆధారపడి వుంది. తన మనో నాశన కార్యక్రమం పరిసమాప్త దశలో గడిపేందుకు, అహమ్మదునగరం గానీ, పూనానగర సమీపంలో కానీ ఎక్కడో ఒకచోట అనువైన కొండను ఎంపిక చేయమని ఆదీని కోరారు. మొదటి రెండు ఘట్టాల్లో మనో నాశనమును సాధించుటలో ఎదుర్కొనే శ్రమలో తాను పూర్తిగా మునిగి వున్నందున, తన భౌతిక శరీరం వదిలేసే ప్రమాదావకాశం వుంది. అటువంటి పరిస్థితి సంభవిస్తే 1952 ఫిబ్రవరి 16 వరకు, తన పూర్వ జీవనంతో ముడిపడి వున్న మెహెరాజాదు కొండపై గడపదలచానన్నారు.

ముందు జాగ్రత్తగా అటువంటి పరిస్థితి నెదుర్కొనేందుకు, ఆయన, ఆదీని, ఆదీజానియరుని, సరోషీఇరానీ వద్దకు వెళ్లి పాద్రీని సంప్రదించి, ఆ కొండమీద వున్న క్యాబినుని, రిపేరీచేసి, ఒక గుడారం కూడా నిర్మించి సిద్ధంగా వుంచమని ఆదేశించారు. దీనిని బట్టి మనకు అవగాహనయ్యేదేమంటే, సర్వశక్తిమయుని యిచ్ఛ ప్రకారం, బాబా ఒక సామాన్య మానవునిగా దైవంపై పూర్తి నమ్మకముంచి, ఎటువంటి పరిస్థితులనైనా ఎదుర్కొనేందుకు సిద్ధపడుతున్నట్లనిపిస్తుంది. అవతారుని దైవ జీవనం, మానవజ్ఞానానికి అవగాహన కాదు.

## మతము - రాజకీయాలు

ఆగష్టు మూడవ వారంలో ఒక సర్క్యులరు జారీ అయింది. అందరు బాబా ప్రేమికులను వుద్దేశించి, అందులో

ఒక వార్త ప్రచురించారు, " బాబాకు ఎప్పుడూ రాజకీయాలతో ఎటువంటి పొత్తు పెట్టుకోలేదు. వాటితో ఆయన కెటువంటి సంబంధంలేదు. అందువలన, ఆయన ఒకవేళ మీలో ఎవరైనా రాజకీయ కలాపాలు నిర్వహించదలిస్తే, అటువంటి కార్యక్రమంలో ఆయన ప్రమేయం తేవటం కానీ, ఆయన పేరు వాడుకోవటం కానీ చేయరాదు. తన పూర్వ జీవన సహచరులందరినీ బాబా, ఎటువంటి స్వార్ధపూరిత ప్రలోభాలకు లోను కావద్దని కోరుతున్నారు. తమ హృదయాంతరాళాల్లో ప్రేమజ్యోతిని వెలిగించ కోరుతున్నారు." దీనిని బట్టి బాబా దృష్టిలో నిజమైన మతమంటే, మానవుడు నిస్వార్ధంతో దైవాన్ని ప్రేమించడమని స్పష్టమౌతోంది.

మతం – రాజకీయాల గురించి బాబా చక్కని సందేశం యిచ్చారు. " పిపీలకాదిపర్యంతం సకలసృష్టిలోని, జంతు, వృక్ష జాతులతో సహా అన్ని ప్రాణులలోను దైవ జీవనం ముడిపడి వుంటుంది. కనుక, మనో నాశన సాధించిన మరుక్షణం నుండి, కొలువ శక్యంకాని, అపరిమితమైన దివ్య జీవనంలో నేను లీనమై పోతాను. నేనప్పుడు ఏ కులంతోను, జాతితోను, మతంతోనూ, రాజకీయపార్టీలతోనూ సంబంధం వుంచుకోను. "

" నా దృష్టిలో అన్ని మతాలు గొప్పవే, అయితే భగవంతుడందరికంటే గొప్పవాడు. అదేమాదిరిగా, అన్ని రాజకీయ పార్టీలు, వాటి విధానాలను బట్టి కులీనమైనవి. అయితే, అవిభాజ్యము, అగోచరము అయిన జీవితముయొక్క పరమార్ధం

అవరోధించ అలవికాని వున్నతమైనది. కనుకనే ఏపార్టీ అయి నప్పటికీ అది ఎంతటి ఆదర్శవంతమైన దైనప్పటికీ జీవిత మనేది వీటన్నికంటే కూడ చాలా గొప్పది. "

ఈ విధమైన సందేశం, రాజకీయాలపై యివ్వటంలో విశేషం లేకపోలేదు. 1947 లో బ్రిటిషుపాలన అంతమై, భారత దేశానికి స్వాతంత్ర్యం ప్రాప్తించినా, హైదరాబాదు పాల కుడైన నిజాం నవాబు, తన సార్వభౌమత్వాన్ని ప్రత్యేక భాగంగా కొనసాగించుకోవాలని ప్రయత్నించాడు. ఎంతో అలజడి ఫలి తంగా చివరకు భారత ప్రభుత్వం జోక్యం చేసుకొని నిజాం పాలనకు వ్యతిరేకంగా " పోలీసు చర్య " జరుపగా, నిజాం నవాబు లొంగిపోయి భారత సార్వభౌమత్వానికి తల ఒగ్గాడు. దాని ఫలితంగా హైదరాబాదు రాష్ట్రము అఖండ భారతదేశంలో భాగంగా రూపొందింది.

1951 లో భాషాప్రయుక్త రాష్ట్ర ప్రాతిపదికపైన, హైదరాబాదు రాష్ట్రము, విభజించబడి, ఆంధ్ర, మహారాష్ట్ర, కర్ణాటక రాష్ట్రాలలో కలిసిపోయింది. ఇలా జరిగేముందు, స్వాతంత్ర్యం వచ్చి సంవత్సరం గడిచినా, మతకల్లోలాలు సర్దు మణగలేదు. రాజకీయ కక్షలు పోలేదు. భారతదేశంలోని తక్కిన ప్రాంతాలనుండి హైదరాబాదు వచ్చేవారికి భద్రత కొరవడింది. క్రొత్తగావచ్చే వ్యక్తులపై భద్రతాశాఖ ఒక కన్ను వేసి, వారి కదలికల్ని జాగ్రత్తగా గమనించేవారు.

ఇదే కాలంలో బాబా బృందం, హైదరాబాదులో మనో నాశన ఘట్టంలో వుండటం తటస్థించింది. బాబా మిత్రుల్లో, భిన్న మతాలకు, జాతులకు సంబంధించిన వారున్నారు. ఒక్కొక్కప్పుడు వీరిని పోలీసు అధికారులు ప్రశ్నించటం జరిగేది. యీ మనో నాశ ఘట్టంలో సాధారణ జీవిత ఆచారాలకతీతంగా, స్వేచ్ఛతో తన యిష్టంవచ్చిన రీతిలో గడుపుతానని బాబా అంతకు ముందే సూచించి వున్నందువలన, ఆటువంటప్పుడు ఆయన నడతను చూచిన ప్రజల్లో కుతూహలం పెరిగి చుట్టూ చేరితే, ఆయనకు చిరాకు కలగటమే కాక, ఆయన కార్యక్రమానికి అవరోధం కావచ్చునని యీరుచ్ భావించాడు,

అలాంటి ఆలోచన రావటమే తరువాయి, యీరుచ్, రాష్ట్ర పోలీసు సూపరింటెండెంటును, కొత్త ఘట్టం ప్రారంభం కావటానికి ముందే కలిసి, బాబా చేపట్టిన కార్యక్రమాల్ని, ముఖ్యంగా కాలినడకన, ఔరంగాబాదు వరకు చేయ తలపెట్టిన ప్రయాణం గురించి సవివరంగా చెప్పి, వాళ్ళ సహాయం అర్థించదలచాడు. అప్పట్లో ఔరంగాబాదు వరకు, హైదరాబాదు పోలీసు పరిధి విస్తరించి వుండేది. అందువలన అక్కడవరకు వీళ్ళు పయనించే దారిలో తగిలే అన్ని పోలీసు స్టేషనులకు, వీరి ప్రయాణం గురించి శాఖాపరమైన ఆదేశాలు పంపించే ఏర్పాటు చేయించాలనుకున్నాడు.

అలా అనుకొని ఒక రోజున యీరుచ్ పోలీసు ఇనస్పెక్టరు జనరల్ కార్యాలయానికి వెళ్ళాడు. ఉన్నతాధికారిని కలిసేందుకు

ఇంటర్వ్యూ దొరకడమే చాలా కష్టమయింది. క్రింది అధికారి యీరుచ్ రాకకు కారణం, సూపరింటెండెంటును ఏ సందర్భంలో కలవదలచాడో వివరాలడిగాడు. అయితే తన రాకకు అసలు కారణం వెల్లడించక, అత్యవసర విషయంపై ఆయనను కలిసేందుకు అనుమతి యిప్పించమని కోరాడు. అతడొక సబిన్స్పెక్టరు. యీరుచ్ వాలకం చూచి కొంత విసుక్కుంటూనే చివరకు సూపరింటెండెంటు గదిలోకి పంపాడు.

ఆ సూపరింటెండెంటు పేరు రెడ్డి. ఆయన చాల మంచివాడు. స్ఫురద్రూపి. ఈరుచ్‌ని చూచి, "ఏం కావాలి బాబూ ?" అని అడిగాడు. అందుకు యీరుచ్ తన రాకకు కారణంచెప్పాడు. "మేము ఆరుగురం వున్న బృందం మాది. మా పెద్దన్నయ్య బృందంలోని మరో సభ్యుడు మౌనం పాటిస్తున్నారు. యాత్రా సందర్భంలో మా బృందం కాలినడకన, హైదరాబాదు నుండి ఔరంగాబాదు వెళ్ళ దలచాము. మా ప్రయాణ సమయంలో, దారిలో మా పెద్దన్నయ్య, అవసరానికాదుకొనేందుకు పేదలకు ఆర్థిక సహాయం అందచేయదలచారు. దానికితోడు దైవోన్మత్తులకు తన భక్తి ప్రపత్తులు అందచేయ కోరుతున్నారు. మేమంతా బొంబాయి ప్రాంతంనుండి వచ్చాం.

ప్రస్తుత పరిస్థితులదృష్ట్యా, ముందు జాగ్రత్తగా, తమరు దయయుంచి, మేము వెళ్ళ నిర్ణయించుకున్న మార్గంలో వచ్చే పోలీసు స్టేషనులన్నిటికీ, మా ప్రయాణం గురించి తెలిపితే, మా ఉద్దేశ్యాలను, తప్పుగా భావించి మమ్మల్నెక్కడా ఆపకుండా

వుంటారని, అందువలన, యీ సహాయం చేయ''మని కోరాడు అంతేకాక, తమ బృందాన్ని పరిచయం చేస్తూ ఒక లేఖ యిస్తే ఎంతో ఋణపడి వుంటామని చెప్పాడు. యీరుచ్ చెప్పే మాట లన్నీ ఎంతో శ్రద్ధగా రెడ్డిగారు విన్నారు. ఫోనుతీసి, తన యింటి నంబరు తిప్పి, క్షణంలో, ఒక అతిధితో వస్తున్నట్లు చెప్పాడు.

యీరుచ్ మనస్సులో, సూపరింటెండెంటుగారు వేరే కార్యక్రమం అంతకుముందే నిశ్చయించుకొని వున్నారు కాబోలు అనుకున్నాడు. తన పని పూర్తికాకుండానే వెళ్ళిపోతాడేమోనని ఆదుర్దాతో, యీరుచ్ తన సంభాషణ కొనసాగించాడు. కానీ వూహించని రీతిలో రెడ్డిగారు, యీరుచ్‌ని తనతో వారి బంగళాకు వెళదాం రమ్మనమని పిలిచాడు. హఠాత్పరిణామానికి యీరుచ్ సంభ్రమాశ్చర్యాలలో మునిగిపోయాడు. రెడ్డిగారు అప్పటికే తన స్థానం నుండి లేవటంతో గత్యంతరం లేక యీరుచ్ కూడ ఆయన్ని అనుసరించాడు. ఆయన కారులో కాసేపటికి వారి బంగళా చేరారు.

అది అన్ని హంగులతో శోభాయమానంగా వున్న బంగళా. అతిధుల గదిలో యీరుచ్‌ని కూర్చోపెట్టి రెడ్డిగారు లోనికి వెళ్ళారు ఇప్పుడే వస్తానంటూ ! పదినిముషాల్లో సేవకుడొకరు బిస్కట్లు టీ తెచ్చి యీరుచ్ ముందుంచాడు. మరి కొన్ని నిమిషాలు గడిచాక, యజమాని శ్రీ రెడ్డిగారు బయటకు వచ్చారు. ఆయన చాలా హుషారుగా కనిపించారు. ఫ్రేము కట్టిన ఫొటో ఒకటి తెచ్చారు. అది విద్యార్థులుగా దిగిన క్రికెట్టు టీము

యొక్క గ్రూపు ఫోటో. ఆ ఫోటో యీరుచ్ కిచ్చి, **అందులో** వున్న బాబాను చూపిస్తూ, "యీ ఎమ్. ఎస్. ఇరానీయేనా మీ పెద్దన్నయ్య?" అని **అడిగారు.** "నేను పొరపడలేదను కుంటాను. అవునా?" అని రెడ్డిం చేసరికి యీరుచ్ ఆశ్చర్యపోయాడు.

అప్పుడు రెడ్డిగారు తన విద్యార్థి దశ గుర్తు చేసుకుంటూ, పూనాలో బాబాతో పాటు తానూ సైంటువిన్సెంటు హైస్కూల్లో చదువుకున్నానని, ఆయతో క్రికెట్టు ఆడేవాడినని, ఆ సందర్భంలో తీసిన ఫోటోయే యిదని చెప్పాడు. దాంతో యీరుచ్ బాబా హైదరాబాదులో వచ్చి వున్న సంగతి అంతకుముందే పోలీసు నిఘా విభాగం ద్వారా సూపరింటెండెంటు హోదాలో విషయ సేకరణ జరిపి తెలుసుకున్నాడని, తన సంభాషణ వినగానే, యీయనే తన స్కూలుమేట్ ఎమ్. ఎస్. ఇరానీ అని నిర్ధారించుకున్నాడని గ్రహించాడు.

బాబాను గురించి ఏ మాత్రం దాయలేక పోయాడు. యిహ వారి సంభాషణ స్నేహపూర్వకంగా సాగింది. చివరకి, యీరుచ్ కోరినట్లు ఔరంగాబాదు వరకూ వచ్చే అన్ని పోలీసు స్టేషనులకు బాబా చర్యల గురించిన పరిచయ వుత్తరువులు పంపుతామని హామీ యిచ్చి సాదరంగా పంపించాడు. జరిగిందంతా బాబాతో చెప్పగా ఎంతో సంతోషించారు. ఏమైనప్పటికీ నవజీవన నియమాల వలన, యిరువురు క్రికెట్టు వీరులు పరస్పరం కలుసుకోలేకపోయారు. ఒకటి రెండు రోజుల్లో వారి

కవసరమైన ధృవీకరణపత్రాన్ని పోలీసు ప్రన్నతాధికారి కార్యాలయాలనుండి ఎటువంటి ఇబ్బంది లేకుండానే సంపాదించాడు. యీ విధంగా ఒక పాత సహాధ్యాయి సహాయంతో సుహృద్భావ పూర్వకంగా పొందిన ఆదేశాల ఫలితంగా దారిలో ఏవిధమైన పోలీసువారి జోక్యం లేకుండా పోయింది.

## డా॥ ఘనీ మున్సిఫ్ అంతిమశ్వాస

ఒకవైపున తన చిన్ననాటి సహాధ్యాయి, తన బృందానికి సంకట పరిస్థితులెదురు కాకుండా తగు రక్షణ ఏర్పాట్లుచేస్తే సరిగా అదే సమయంలో మరో చిన్ననాటి సహాధ్యాయి మిత్రుడు శిష్యుడైన డా॥ అబ్దుల్‌ఘనీ మున్సిఫ్ ఆగష్టు 20 వ తేదీన పూనాలో సాయంత్రం గం 7-00 లకు తుది శ్వాస విడిచాడు. హఠాత్తుగా సంభవించిన గుండెపోటుతో బాబాలో శాశ్వతంగా లీనమైనాడు.

ఘనీ మరణవార్త విన్న పిదప బాబా ఆయన గురించిన ప్రత్యేక సర్క్యులరు స్వయంగా చెప్పి జారీ చేయించారు. దాని వలన బాబాకు ఘనీ యెడల ఎంతటి ప్రేమ ఉన్నదో వెల్లడి కాగలదు. " ఈ నవజీవనంలో నేను త్యాగం చేసినవి, బాధ పడిన వాటన్నికంటే ఘనీ మరణం చాలా గొప్పది. దేశవిదేశాల్లోని నా పూర్వ జీవన శిష్యులు ప్రేమికులెందరో మరణించి నప్పుడు నేను పొందిన నష్టానికి చాలా బాధపడ్డాను. కానీ ఘనీ హఠాత్తుగా నానుండి తీసుకుపోబడినందువలన, నాకు వినాశకర

మైన దెబ్బ తగిలింది. నవజీవనం సమాప్తం కాబోయే తరుణంలో అతని వియోగం భరించరానిదైంది. ఘనీ మీ అందరి కంటే నాకు అద్వితీయమైనవాడు.

యితరులు నాకు చేయవలసిన కార్యక్రమంలో ఘనీ వంతు చేయవలసిన పని చాలా వుంది. అది మరెవ్వరూ చేయలేరు. అతని పెద్ద తల నాకొక ధనాగారంవంటిది. అందులో జ్ఞానం, హాస్యం రెండూ మిశితమై, పరిపూర్ణత్వంగా మలచబడ్డయి. మేమిరువురం చిన్ననాటి సన్నిహిత మిత్రులం. అతడెంత ధైర్యశాలో, ఎంత నమ్మకస్తుడో, ఎంత ప్రేమమయుడో, ఎంతటి సహృదయుడో, బాగా నాకు తప్ప మరెవరికీ తెలియదు. అతని స్థానం మళ్లీ పూరించబడదు. నాపనిలో అతడొక పనిముట్టుగా, మంచి మిత్రునిగా, ఘనీ వహించిన అద్వితీయ స్థానాన్ని ఎవరూ పూరించలేరు. 1952 ఫిబ్రవరి 16 వరకూ అతడు శరీరంతో వుంటాడనుకున్నాను. అయితే అక్టోబరు 16న చేయవలసిన వుపవాసం అతని బదులు అయన అల్లుడు బగ్గూని చేయమని కోరాను. ”

భగవంతుని యిచ్ఛ వుంటే 1952 ఫిబ్రవరి 16 న విశ్వవ్యాప్తమైన ప్రకటీకరణ చేస్తాను. ఘనీతోపాటు, మరణించిన పాత జీవిత శిష్యులంతా ఆ ప్రకటీకరణను అనుభవిస్తారు. వారు భౌతిక శరీరంతో వున్నట్లే దానిని అనుభవించగలరని సన్నిహిత మిత్రులతో చెప్పారు.

# కొజ్జాగూడ కొండ

బాబా ఒక రోజున ఏమీ చెప్పకుండా స్వయంగా హైదరాబాదు నగరమంతా శిష్యులతో తిరిగి వచ్చారు. తన బంగళాకి శిష్యుల్ని పిలిపించి, నగరానికి సమీపంలో ఏదైనా గుహ వున్నదేమో విచారించి తెలుసుకోమని ఆజ్ఞాపించారు. సాధారణంగా బాబా చేసే విశ్వ కార్యక్రమాలన్నీ సహజత్వంవుండే గుహల్లోనే ప్రారంభమవుతాయి. శిష్యులు నగరమంతా తిరిగి, ఎందరి ద్వారానో ఆరా తీసినా ఫలితం మాత్రం దొరకలేదు. చివరికి ఒక మేదరి వాని ద్వారా సమీపంలోనే వున్న కొజ్జా గూడా దగ్గర వున్న ఒక కొండలోగుహ వున్నట్లు తెలుసుకున్నారు.

హైదరాబాదు పట్టణానికి దాదాపు 18 కిలోమీటర్ల దూరంలో యీ కొజ్జా గూడ కొండ వుంది. దాని శిఖరాగ్రాన, 14 వ శతాబ్దంలో నివశించిన హజరత్‌బాబా ఫ్రకుద్దీన్ దర్గా వున్నది. ఆయన ఆరోజుల్లో ఒక గొప్ప వలీగా గౌరవించబడ్డాడు. ప్రతి సంవత్సరం అనేకమంది సందర్శించివెళ్ళే యాత్రా స్థలంగా వున్నా, ప్రస్తుతం దర్గాకి కప్పంటూ లేదు. విచారించగా తెలిసిందేమంటే, చాలాసార్లు, వలీ భక్తులు గతంలో ఆ సమాధిపై కప్పు నిర్మించాలని చందాలిచ్చి కట్టిస్తే, ప్రతిసారీ, కట్టిన ఒకటి రెండు రోజుల్లోనే కూలిపోయేదట. అందుచేత దరిమిలా మళ్ళీ కప్పు కట్టించే ప్రయత్నం చేయలేదు.

ఆ కొండకు వేరొక ప్రక్కన శేషశయనుడుగా విష్ణుమూర్తి దేవాలయంవుంది. నాగదేవత పడగ విష్ణువు తలపై

వున్నట్లు విగ్రహం మలచబడింది. దర్గాకి సమీపంలో వున్న మరో ముఖ్యమైన ప్రదేశం, 20'×15' వున్న ఒక గుహ. లోనికి వెళ్ళినకొలది ఎత్తు తగ్గుతూ చీకటిగా వుంటుంది. బాగా లోనికి వెళితే ఒక గూడు లాంటిది వుంది. దీన్ని బాబా తన మనోనాశన సమయంలో చేసిన కార్యక్రమంలో భాగంగా నమూనాలుంచేందుకు అరగా వుపయోగించారు.

శిష్యులు ఎందరినో విచారించి, చివరకి గాలించిన యీ కొండను బాబా మొదటి సారిగా చూచినప్పుడు, దర్గా ప్రాంతంలో రెండు గదులు కట్టమని ఆదేశించారు. దానిమీద వున్న దర్గా, దేవాలయం, గుహ, మూడింటిని పరిశుభ్రంగా వుంచమని కోరారు. బాబా 15 రోజులపాటు అక్కడ వుండదలచారు. అయితే నీటివసతి లేనందున వారి పథకం తారుమారైంది. మిత్రులు దర్గాప్రక్క, నడుస్తుండగా సమీపంలో నిలవవున్న నీటి గుంట ఒకటి వారి కంట బడింది. ఆ వార్త విన్న బాబా సంతోషించారు. తన కార్యక్రమానికది అనువైన ప్రదేశమైనందున, బాబా మిత్రులందరినీ ఆ గుంటలోని నీటిని కాచి వడపోసి, అన్ని అవసరాలకు వాడుకోమన్నారు. పర్వతపాదం చెంత వరిపొలాలున్నాయి. తాటిచెట్లున్నాయి. కొన్ని నిటారుగా, కొన్ని నేలబారుగా వంగి వున్నాయి. కొండపై ఒక్క మొక్కైనా లేదు. నున్నగా బీడులా నల్లటి బండరాళ్ళతో నిండి వుంది.

## అయిదు నమూనాలు

మనోనాశన ఘట్టం ప్రారంభించటానికి ఒక నెల ముందు బాబా, యీరుచ్ చేత అయిదు మతాలకు ప్రతీకలైన ఐదు

నమూనాల్ని తెప్పించే ఏర్పాటు చేశారు. దేవాలయమును హిందూ మతానికి, మశీదు నమూనా మహమ్మదీయ మతానికి, చర్చి నమూనా క్రిష్టియన్ మతానికి, పగోడా లేక బౌద్ధాలయపు నమూనా బౌద్ధమతానికి, అగ్ని దేవాలయ నమూనా జోరాష్ట్రియన్ మతానికి గుర్తులు. ఈ అయిదు ప్రపంచంలోని ప్రధాన మతాలు.

ఆదీ ఆగ్రా వెళ్ళి పాలరాతిపై ఈ ఆయిదు నమూనాలు చెక్కించే ఏర్పాటు చేశాడు. ఒక శిల్పితో మాట్లాడి వాటి తయారీ పని వప్పగించాడు. అయితే అతడు ఎన్నడూ పార్సీ వారి అగ్ని దేవాలయ గర్భగుడి చూచివుండనందున, దాని నమూనా తయారుచేసేందుకు తన అశక్తత తెలియచేశాడు. జోరాష్ట్రియన్ మతస్తులు తప్ప, అన్య మతస్తుల్ని, అగ్ని దేవాలయంలోనికి అనుమతించరు. ఒక్క మత గురువుల్ని మాత్రమే లోనికి పోనిస్తారు. ఈ గురువుల్లోకూడ అందరికీ అర్హత వుండదు. కొందరికి లైసెన్సు లాంటిది యిచ్చి ప్రత్యేక అర్హతకల్పిస్తారు. ఇటువంటి వారికి మాత్రమే లోనికి పోయే వీలుంటుంది. అయితే మెహెర్ జీ ప్రీస్టుకాకున్నప్పటికీ, ఆయనకు ప్రత్యేక అర్హత వున్నది. ఒకవేళ ఆయన పార్శీ దేవాలయంలోనికి వెళ్ళదలిస్తే తన దుస్తుల్ని మార్చుకొని, తెలు గౌను, పైజమా ధరించి, తలపాగా చుట్టి, నోటికి ముక్కుకి గుడ్డ కట్టుకొని వెళ్ళాలి. అందుచేత అగ్నిదేవాలయ ప్రాంగణంలో వుండే అగ్నిదీపిక బొమ్మని యిచ్చి దానిప్రకారం నమూనా తయారుచేయమన్నాడు.

బాబా చాలా సంతోషించారు. వాటితో ఆయన ఏమి చేఒ
చారో, శిష్యులెవరికీ అవగాహన కాలేదు. వాటిని చాలా జాగ్రగ
త్తగా వుంచమని మిత్రుల్ని ఆదేశించారు.

అక్టోబరు 13 వ తేదీన, కొంతమంది శిష్యుల్ని పిలిచి, కొండపై వున్న గుహలో మనోనాశన కార్యక్రమం ప్రారంభించ బోతున్నానని, అవసరమున్న సామాన్లన్నీ అక్కడకు చేర్చమని, వాటితోపాటు నమూనాలుంచిన పెట్టె కూడ భద్రంగా చేర్చమని ఆదేశించారు. శిష్యులంతా ఎవరి సామాన్లు వారు హడావిడిగా సర్దుకుంటున్నారు. ఎవరిసామాన్లు వార్ని కాలినడకన తెచ్చుకోమని చెప్పారు. అయితే బాబా సామాన్లు, పాలరాతి విగ్రహాలున్న

వాలుగా వున్న ప్రదేశంలో అది క్రిందకి జారకుండా ఆపా లన్న తపనతో పిచ్చివానిలా కదిలే కారువెంట పరుగెడుతున్నాడు యూరుచ్. ఏదోవిధంగా క్లచ్‌ప్లేటు నొక్కి బ్రేకు వేయాలన్నది అతని ఆరాటం. కానీ కారు తలుపులు తాళం వేయబడి వున్నాయి. ఫుట్‌బోర్డన్నా లేదు. అందువలన లోనికి ప్రవేశించి స్టీరింగు పట్టు కొనే అవకాశం లేకుండా పోయింది. అయినా కదులుతున్న కారు వెంట పరుగిడుతూనే వున్నాడు. అంతలో దాని దారి వాలుగా వున్నందున 10, 15 మైళ్ళ వేగానికి పుంజుకున్నది. దూరాన చూస్తే కొండ దిగువ భాగాన అన్నీ తాడిచెట్లే. కొన్ని నేల బారున వంగి వున్నట్లున్నాయి.

నమ్మటానికి వీల్లేనంతగా, యీ కారు వుండేకొద్దీ వేగం పెరిగి, గుర్రంలా రాళ్ళనీ రప్పల్నీ దాటుకుంటూ, లేడిలా దుముకుతూ వంగివున్న తాటిచెట్లను దాటుతూ పరుగిడుతోంది. ఏదైనా అడ్డొస్తే ఢీకొడుతుందేమోనని యీరుచ్ భయపడ్డాడు. చేసేది లేక స్థాణువులా నిశ్చేష్టుడై చూస్తూ ఉండిపోయాడు. దూరాన వున్న తక్కిన మిత్రులంతా యిదో వింతగా చూస్తూ ఉండిపోయారు. యీరుచ్ యీ విషయం చెపుతూ, తన జీవితంలో యిలాంటి సంఘటన ఎన్నడూ కనీ వినీ ఎరుగనంటాడు.

తన భయం కారు పాడవుతుందని కాదట. బాబాకు అత్యంత ప్రియమైన అయిదు సమూనాలు పగిలిపోయాయేమోనని భయపడ్డాడు. అందునా బాబా తన విశ్వకార్యక్రమంలో వాటి కెంతో ప్రాధాన్యత వుందని హెచ్చరించి యుండుటచేత, యీరుచ్ మరీ కంగారు పడిపోయాడు. అవి పూర్తిగా ధ్వంసమై పోయేవుంటాయనుకున్నాడు. న్యాయానికి యీరుచ్ కారునాపి నప్పుడు న్యూట్రల్లో వుంచి, ఎమర్జన్సీ బ్రేకుకూడ వేశానంటాడు. ఏమైతేనేం ? ఏదోశక్తి లోపలవుండి స్టీరింగు తిప్పుతూ కారు నడుపుతున్నదా అన్నట్లు జరిగిపోయింది. అలా ఒక మైలు దూరం పరుగిడి, చివరకు ఒక వరిచేలో ఆగిపోయింది.

నిజంగా యిది ఒక అద్భుతలీల. గేరులో వున్న కారు అప్రయత్నంగా కదిలి, రాళ్ళు, గుట్టలు, పొదలు దాటుకుంటూ తాడిచెట్లను సైతం దాటుకుంటూ పరుగిడుటఅంటే, విచిత్రమే మరి ! ఆ దృశ్యం చూస్తున్న పెండూ తదితరుల మనస్సు,

అది ఆగగానే కుదుట పడింది. యారుచ్ గుండె బిగపట్టుకొని వణుకుతున్న చేతులతో మెల్లగా తలుపు తెరిచి సమూనాలున్న బంగీ భద్రంగా వుందోలేదో చూచాడు. అవి పదిలంగానే వున్నా యనుకున్న పిదప స్టీరింగు ముందు కూర్చొని, కారు స్టార్టు చేశాడు. బాబా ఆ కారుని పైకి తీసుకురమ్మనమని డాన్‌కిన్‌తో కబురంపారు. దాన్ని ఎలాగైనా పైకి చేర్చాలి. అందుకని అది పని చేస్తోందో లేదోనని చూచేందుకు స్టార్టు చేస్తే, అది భయంకర శబ్దం చేస్తూ బుర్రుమని తటాలున ఆగిపోయింది.

అది చూచి యారుచ్ గుండెల్లో రైళ్ళు పరుగెత్తాయి. యింజను బహుశః పగిలిపోయుంటుందనుకున్నాడు. "యిప్పు డేమిచేయాలా?" అని స్టీరింగుపై చేతులుంచి ఆలోచించడం మొదలు పెట్టాడు. అంతలో బాబా బృందంవారు వంటచెరుకుగా వాడుకొనేందుకు కొని తెచ్చిన కట్టెలతో ఒక లారీ అక్కడకు చేరింది. ఆ లారీ కట్టెలతో కొండపై వున్న గుహ దగ్గరకు పోతూ చేలో ఆగిపోయివున్న కారును చూచి, డ్రైవరు ట్రక్కును ఆపాడు. "ఏమైంది? కారు చేలో ఎలా కూరుకుపోయిందని" అడిగి తెలుసుకున్నాడు.

యారుచ్ మంచి విసుగులో వుండటంతో గంటక్రితం రావలసిన వాడివి యింత ఆలశ్యంగా వచ్చి సవాలక్ష ప్రశ్నలు వేస్తావా? అంటూ ఎదురుప్రశ్న వేశాడు. అయితే మరుక్షణం లోనే తేరుకొని, డ్రైవరుకు నచ్చచెప్పి, అతని సహాయం తీసుకున్నాడు. పొలంలోని బురదలో కూరుకుపోయిన చిన్న కారుని

తాడుతో లారీకి కట్టి ఎలాగైతేనేమి రోడ్డుమీదకి లాగించారు. యిద్దరూ క్రిందకు దూరి యింజనుకేమయిందోనని పరీక్షించారు. వరిగడ్డి, ఆకులలములు యింజనులోకి దూరి చుట్టుకుపోయాయి. యీరుచ్ మెల్లగా చెత్తనంతటినీ తొలగించాడు.

తరువాత స్టీరింగుముందు కూర్చొని స్టార్టు చేశాడు. మీరు నమ్ముతారో నమ్మరోకానీ, ఆశ్చర్యం ! కారు, క్షణంలో మామూలుగా స్టార్టు అయింది. దానికే ప్రమాదం సంభవించలేదు. అంతకు ముందు వచ్చినమోత, మోటారుకు చుట్టుకున్న చెత్త వలన అయివుండవచ్చుననుకున్నాడు. అన్ని దూకుళ్ళు దూకినా ఏ ప్రమాదం జరుగలేదు. కనీసం గీతలన్నా పడలేదు. ఎలాగైతేనేమి కారుని భద్రంగా కొండపైకి చేర్చారు. కార్లో వున్న సామాన్లన్నీ దించిచూచారు. అన్నీ చెక్కు చెదరకుండా వున్నాయి. నమూనాలున్న ట్రంకు తెరిచి, అవి ఎలావున్నాయో చూదామని ఒక గదిలో పెట్టి ట్రంకు మూత తీశాడు. ఏమి ఆశ్చర్యం ? అవి పెట్టినవి పెట్టినట్లు కదలకుండా వున్నాయి. ప్రస్తుతం, యిప్పుడా నమూనాలు గ్లాసు కేసులో వుంచి మెహెరాబాదు కొండపైవున్న మెహెర్ రిట్రీటులోని ఎగ్జిబిషను హాల్లో బీరువాలో వుంచబడినయి.

ఆ సాయంత్రం యీరుచ్, బాబాను కలిసి జరిగినదంతా చెప్పాడు. అసలు బాబాయే అడిగారు ప్రొద్దుట ఆలశ్యంగా వచ్చారేమని. జరిగిందంతా విని, ఒక చిరునవ్వు నవ్వారు. నాకంతా తెలుసులే అన్నట్లున్నదా నవ్వు. అదంతా నాలీలే సుమా ! అన్నట్లు

న్నది. యూరుచ్ బాబాతో చెబుతూ, నాకన్నిటికన్నా ఆశ్చర్యం కలిగించిన విషయం, కారు క్రిందకు పరుగిడుతూ, దారిలో బండ రాళ్ళు అడ్డు వస్తే ఆగినట్లు కనపడి, తన వేగాన్ని రివర్సుగా మార్చుకొని, రాయిని తప్పుకొని, దుముకుతూ మళ్ళీ ముందుకు పోతూవుంటే ఆశ్చర్యం వేసిందంటాడు.

యూరుచ్ జరిగిన సంఘటనని ఎంత వివరంగా చెప్పినప్పటికీ, బాబా గుస్తాద్‌జీ యీ సంఘటన గురించి సౌంజ్ఞలతో వివరించినప్పుడు ఎక్కువ ఆనందం పొందారు. గుస్తాద్‌జీ మౌనంతో వుండుటవలన మాట్లాడడు కదా ! అందువలన కారు సంఘటన వివరిస్తూ అది లేడిలా ఎలా దూకిందో తాను కూడ గంతులేస్తూ అది ఎలా దూకిందో తానుకూడ అలా దూకుతూ చూపి, బాబాని ఆనందపరచాడు. అయితే బాబా మాత్రం ఎటువంటి ఆశ్చర్యాన్ని వెలిబుచ్చలేదు. తర్వాత సంవత్సరాల్లోకూడ యీ సంఘటనపై ఎటువంటి అభిప్రాయాన్ని తెలుపలేదు.

బాబా మనోనాశ కాలంలో ఏమి చేశారో తెలియదు కానీ, యూరుచ్ చేత ఆ అయిదు నమూనాల్ని కొండపైవున్న ఒక గదిలో, ఒక బండరాయి అంచుపైన, వరుసగా ఒకదాని ప్రక్కన ఒకటి వుంచేట్లు చేశారు. ఆ పిమ్మట యూరుచ్‌ని బయటకు వెళ్ళి తలుపు మూయమన్నారు. మరి అయిదు మతాలను సూచించే ఆ నమూనాలతో ఏకాంతంగా, గడిపిన వలభై రోజులు మనోనాశ ఘట్టంలో తెలియని కార్యక్రమమేదో విడవకుండా జరిపారు.

# నవజీవన ద్వితీయ వార్షికోత్సవం

కొజ్జాగూడా కొండమీదికి డాన్‌కిన్ బాబాని కారులో అక్టో బరు 15వ తేదీనే తీసుకువెళ్ళాడు. ఆ కారులో బాబాతోపాటు విష్ణూ, నీలూ, ఒక ముల్లాకూడా వెళ్ళారు. విడిగా గుస్తాద్‌జీ, బైదుల్, పెండూ యారుచ్, దౌలత్‌సింగు యీ అయిదుగురు ముందుగానే కొండపైకి వెళ్ళారు. వీరు మనోనాశ ఘట్టమంతా బాబాతోనే గడపాలి. ఆరోవాడు మినూచెరాన్ అనారోగ్య కార ణాలవలన రాలేకపోయాడు. సాయంత్రం 3-00 లకు చినుకులు మొదలయ్యాయి. కారు వానలో తడిసిపోయింది. కొండవాలులో జారుతుందని కారును ఆపేశారు. అంతా దిగి కాలినడకన బాబా ఫక్రుద్దీన్ దర్గా వద్దకు చేరారు.

అక్కడ చేసిన ఏర్పాట్లు చూచి బాబా సంతోషించారు. కాసేపయినాక ముల్లా బాబా వారి మిత్రుల సమక్షంలో మతపర మైన ప్రార్థనలు జరిపాడు. నీలూ, విష్ణూ, ముల్లాలు తర్వాత కొండదిగి వెళ్ళిపోయారు. మర్నాడు బాబా నవజీవన ద్వితీయ వార్షికోత్సవము. అంతేకాకుండా ఆదేరోజున బాబా మనోనాశ ఘట్టం ప్రారంభించి అందులో మునిగిపోతారు. జూన్‌లో హైద రాబాదులో జరిగిన మీటింగుకు హాజరైనవారికి మరీ ముఖ్య మైనరోజు. బాబా ఆదేశానుసారం, ఆనాడు వారంతా వుపవాసదీక్ష పూనాలి. తేనీరు, మంచినీళ్ళు మాత్రమే తాగాలి.

అది అక్టోబరు 16. మనోనాశ కార్యక్రమం ప్రారంభ మయ్యేరోజు. సరిగ్గా అదేరోజున, పాకిస్తాన్ ప్రప్రథమ ప్రధాని,

హత్యచేయబడ్డాడన్నవార్త వెలువడింది. దాన్ని శిష్యులంతా విన్నారు. బాబా తన బృందంతోవున్న కొజ్జాగూడకొండ ప్రాంత మంతా "కొజ్జాగూడ" అంటారు. ఈ ప్రాంతంలో, మొగలాయి సామ్రాజ్యం రోజుల్లో కొజ్జాలుండేవారట. కొజ్జాలంటే ఆడ మగ కాని పేడివారు. యీ పర్వతప్రాంతంలో మొగలాయి రాణులకు వేసవి విడిదిగా బ్రహ్మాండమైన భవంతి ఉంది. వేసవిలో రాణీవాసపుస్త్రీలు వచ్చి, యీ భవనంలో వుండేవారట. రాణులకు తోడుగా వుండేందుకు, మొగలాయి ప్రభువులు, కొజ్జాలను వుంచేవారు. యీప్రాంతం చాలా అందమైనది. కమనీయమైన ప్రకృతిశోభతో కన్నులవిందు చేస్తుంది. చుట్టూ పోకచెట్లు, చక్కని ఉద్యానవనాలు వున్నయి.

ఇది యింతటి రమణీయమైన స్థలం కావునసే, చాలా మంది మహమ్మదీయులు యీ ప్రాంతాన్ని వదలకండా యిప్పటికీ కాపురాలుంటున్నారు. పాకిస్తాన్ మాజీప్రధాని మరణ వార్తను వీరే క్షణాల్లో ఆ ప్రాంతమంతా వ్యాపింపచేశారు. సరిగ్గా ఆరోజే బాబా మనోనాశ ఘట్టం ప్రారంభించాలి, అంతలో నారిమన్ వచ్చి, మరణించిన మాజీప్రధాని, లియాకత్ ఆలీఖాన్ అని చెప్పాడు.

## అమనస్క యోగారంభం

అమనస్క యోగమంటే మనోనాశము. అంటే మనస్సనే దుష్ట ప్రభువు, తన పరివారమైన కామ, క్రోధ, లోభ,

మోహ, మద, మాత్సర్యములనే అరిషడ్వర్గములతో సహా భగ వత్ప్రేమాగ్నిలో భస్మీపటలమైనప్పుడు, అనంతము అవ్యయము, అవిభాజ్యము అగు ఆత్మానుభవం మనస్సుకు లభిస్తుంది. అప్పుడు గాని మనోనాశం జరగదు. మరి బాబా మనస్సు విశ్వాత్మక మైనది. మానవుని మనస్సువలె, కలుషితము, సంకుచితము, సంస్కారమయము కాదు. ఆయన మనస్సు విశ్వాత్మకమైనది కనుక, అటువంటి విశ్వాత్మక మనస్సు నాశనమొనరించబడితే, మన అందరి మనస్సులు నాశనమొనరింపబడినట్లే !

నిజానికి బాబా మనోనాశ కార్యక్రమం చేపట్టారంటే, అది ఆయనకవసరమై కాదు. ఎవరో అదృష్టవంతులు కొందరు తమ మనస్సులను నాశన పరచుకొని, అమనస్కులు కావలసియున్నది. వారికి సహాయపడుటకే, ఈ అమనస్క యోగకాలాన్ని నిర్ణ యించారు. ఆ సమయంలో మనోనాశం జరుగవలసిన అభిలాషా పరులకు బాబా ప్రత్యేకంగా సహాయపడ్డారన్నమాట. సరే ! ఇప్పుడు అసలు సంగతికి వద్దాం. పాకిస్తాన్ మాజీప్రధాని లియా ఖత్ ఆలీఖాన్ మరణవార్తతో కొజ్జాగూడలోని మహమ్మదీయ వాడలో అలజడి జరుగుతుందేమోనని శిష్యులు భయపడ్డారు. కానీ అలాంటిదేమీ జరుగలేదు.

ఆనాడు అక్టోబరు 16. మనోనాశ ఘట్టం ప్రారంభమయ్యే రోజుకదా ! ముందుగా నిర్ణయించిన ప్రకారం బాబా ఉదయం నుండి వుపవాసదీక్షతో, ఈ ఘట్టాన్ని ఆరంభించారు. దర్గాలో బాబా అయిదు మతాలకు సంబంధించిన ప్రార్థనలు చేశారు.

గత అవతారాలైన, జోరాష్టరు, కృష్ణుడు, బుద్ధుడు, జీసను, మహమ్మదులుగా మానవరూప ధారులై అవతరించిన అనంతుడగు భగవంతుని పేర ఈ అయిదు విభిన్న ప్రార్థనలు జరిగాయి. మిత్రులంతా ప్రశాంతంగా నిలబడి వుండగా, బాబా యీరుచ్‌తో ఈ క్రింది విషయాన్ని చదవమని సౌంజ్ఞ చేశారు.

" ఓ ! అహురమజదా ! నీ అనంతమైన గొప్పదనం పేరుమీద, ప్రియతమమైన జోరాష్టరు పేర, అందరు సద్గురువులు, సాధుపుంగవులు, నీ ప్రేమికుల పేర, మెహెర్‌బాబా యీనాటినుండి అంటే 1951 అక్టోబరు 16 నుండి నాలుగు నెలల పాటు, చేయ తలపెట్టిన కార్యక్రమాన్ని దిగ్విజయంగా నిర్వహించ కలిగేటట్లు సహాయమందించమని ప్రార్థిస్తున్నారు. అంతే కాదు. తన కోరిక సఫలం కావటమేకాక 1952 ఫిబ్రవరి 16 నాటికి అంతిమధ్యేయం సాధించేటట్లు చేయమని వినమ్రులై అడుగుతున్నారు - " అని యీరుచ్ చదివాడు.

యీ పై ప్రార్థననే, శాశ్వతుడైన భగవంతుడ్ని పరమాత్మగా, అల్లాగా, కృష్ణుడు, బుద్ధుడు, జీసను, మహమ్మదుల పేర కొద్ది మార్పులతో ప్రార్థించటం జరిగింది. అదేరోజున, పూర్వజీవన సహచరులు అయిదుగుర్ని గుజరాతులోని వుద్వాడ, ఉత్తర ప్రదేశ్‌లోని మధుర, బీహార్‌లోని సారనాడ్, బొంబాయి సమీపంలోని గోవా, రాజస్థాన్‌లోని అజ్మీర్ లకు ఒక్కొక్క చోటుకి ఒక్కొక్కరిని పంపారు. భారతీయ ఆచారం ప్రకారం, ఈ అయిదు పట్టణాలు, జోరాష్ట్రియనులకి, హిందువులకు, బౌద్ధమతస్తులు -

జైనులకు, క్రిష్టియనులు, మహమ్మదీయులకు, ముఖ్యమైన ప్రార్థనా స్థలాలు. అంతేకాకుండా బ్రహ్మాండమైన ఆధ్యాత్మిక ప్రాముఖ్యత సంతరించుకున్న కేంద్రాలవి.

బాబాచే నియుక్తులైన యీ అయిదుగురు ముందుగానే అయిదు స్థలాల్ని దర్శించి, ఆ యాత్రాస్థలం ఏ మతానికి ప్రసిద్ధైతే, ఆ మతానికి సంబంధించిన ఒక నిరుపేదని వెతకాలి. అప్పుడు వారు అతడ్ని, అక్టోబరు 16న వుపవశించేటట్లు కోరాలి. ఆనాడు, అటువంటి వ్యక్తి శుభ్రంగా స్నానంచేసి, అగ్ని దేవాలయం, హిందూదేవాలయం, బౌద్ధదేవాలయం (పగోడా) చర్చి మశీదులకు వెళ్ళి అట్టి పవిత్ర స్థలాల్లో, పైన చెప్పిన బాబా ప్రత్యేక ప్రార్థనను, చేయాలి. చివరిలో, బాబాకి బదులుగా, ఆయనచే నియుక్తులైన అయిదుగురు మిత్రులు ఈ అయిదుగురు వ్యక్తులకు తలా ఒక నూటఒక్క రూపాయలు దక్షిణగా సమర్పించాలి.

ఆనాటి రాత్రి బాబా కొండమీదున్న బాబా ఫక్రుద్దీన్ దర్గాలో ఏకాంతవాసం గడిపేందుకు లోనికి వెళ్ళిపోయారు. మర్నాటి ఉదయంవరకు షుమారు ఏడుగంటలపాటు లోపలే వుండిపోయారు. లోపల ఆయన చేసే కార్యక్రమానికి ఎటువంటి అంతరాయం కలుగనీయకుండా బయట, మిత్రుల్ని కాపలా వుంచారు. లోపల బాబాకు తోడుగా అయిదు వమూనాలు మాత్రం వున్నాయి. ఎంతో ఉత్సుకతతో మొదలైన మనోనాశ ఘట్టం ఈ విధంగా ఆరంభమైంది.

మనోనాశమంటే, దైవంతో కట్టుబడివుండి, ఆత్మవేరు, పరమాత్మ వేరని పురికొల్పే మనస్సు పోవటమని తెలుసుకున్నాం గదా ! దైవమానవుడైన బాబా, ఎవరికోసరం యీ మనోనాశ ఘట్టం వుద్దేశించబడిందీ ఆయన వివరించలేదు. మెహెర్‌బాబా అవతారునిగా అవతరించుట గురించి, బాబా ప్రథమ గురువైన హజరత్‌బాబా జాన్, ఒక పర్షియన్ ద్విపదను యీ సందర్భంలో పేర్కొన్నది.

"నాది అనుకుంటే, నీవు స్వేచ్ఛా జీవివే.
నాది అనుకున్నప్పుడు నీకు నీవు బంధాల్ని కొనితెచ్చుకుంటావు"

ఏ బాబా ప్రేమికుడైనాసరే, సామాన్యమానవునిగా, ఆయన ప్రేమ పరిధిలోనికి, ఆయనకున్న అపార కరుణవలన వచ్చే అదృష్టం కలిగివున్నప్పుడు, మనోనాశనమనే ఈ అదనపు భారాన్ని తనపై వేసుకొని, తద్వారా కలిగే పూర్ణత్వం వలన వారికి ఎంతో సహాయం లభించి, మనోసంకెళ్ళు ఛేదించబడి ఆయనకు సన్నిహితులు కాగలరు. యిది ఆయన వున్న కాలం లోనే జరుగుతుంది. బాబా పరిధిలోనికి వచ్చినవారు వివేకం కోల్పోతారు. మనసున్నంతవరకు, ప్రతివారు, సంభావ్యమగు ఆలోచనలను, తాను వ్యక్తీకరించినా, చెప్పలేకపోయినా, కలిగి వుంటాము. కానీ, నిశ్చలస్వభావం, నిష్కపటంతో కూడిన సడత వలన, అదృష్టఘడియ వస్తుంది.

దైవీమానవుని చేతల వెనుక దాగివున్న భావాన్ని జాగ్రత్తగా అర్థం చేసుకోలేవని ఎవరైతే ఆనందంతో అంగీకరించే తమ అస

మర్థతను ఒప్పుకుంటారో వారు ధన్యులు. బహుశః యిటువంటి బుద్ధులు పెరుగుట వలననే కాబోలు, బాబా ఎంతో ప్రేమతో అటువంటివారి హృదయంలో తన క్షణిక దృష్టిని గుర్తింపచేసి, వారి మనస్సు పని చేయకుండా చేస్తారు. సిద్ధాంత పరమైన వ్యాఖ్యానాలు చేయకుండా హృదయం ఎంత ఖాళీగా వుంటే, అంతగా ఆయన ప్రేమ జ్యోతితో నింపబడుతుంది. అప్పుడు ఎటువంటి వాద ప్రతివాదాలు ఆ ప్రేమికుడ్ని బాధించవు. లెక్కకు వచ్చేది ప్రేమ మాత్రమే.

కొండమీద దర్గా వదిలి, గుహలోనికి బాబా అక్టోబరు 18న ప్రవేశించారు. యీరుచ్, బాబా ఆదేశం ప్రకారం గుహలోనికి అయిదు నమూనాలు తీసుకువెళ్ళి లోపలున్న గూటిలో అమ ర్చాడు. ప్రథమంలో కదలకండా ఏడుగంటలపాటు కూర్చు న్నారు. అదేమాదిరి రెండోరోజున విష్ణాలయంలో మూడు గంటలు కూర్చున్నారు. సాయంకాలం, గులాంహుశ్శేన్ అనే మస్తును కలిశారు. కొండమీద బాబా తొమ్మిది రోజులపాటు సంతృప్తికరంగా ఏకాంతవాసం గడిపారు. ముందుగా నిర్ణయిం చిన ప్రకారం కొండమీద 15 రోజులు వుండటం మానివేసి, కాలినడకన ప్రయాణం సాగిద్దామని నిర్ణయించారు. నవజీవ నంలో యీ యుగావతారుడు ముఖ్యంగా రెండు మార్గాల్లో కాలి నడకన యాత్ర చేశారని బాబా ప్రేమికులు ముఖ్యంగా తెలుసు కోవాలి.

ఒకటి ఉత్తర భారతం, బీహార్‌లోని సారనాథ్ గుండా బెనారస్‌నుంచి, ఉత్తరప్రదేశ్‌లోని నజీబాబాదుకు. రెండవది ఆంధ్రప్రదేశ్‌లోని హైదరాబాదునుండి మహారాష్ట్రలోని ఔరంగాబాదు ఖుల్దాబాదు, ఇమాంపూరుల మీదుగా మెహెరాబాద్ కొండ. మొదటి నిర్ణయానికి ముందుగానే కొజ్జాగూడ వదిలేశారు. అక్టోబరు 24 సాయంత్రం తమ సామానులన్నీ సర్దుకొని, అయిదుగురు మిత్రులు వెంటరాగా, ప్రాముఖ్యతగల కొజ్జాగూడా కొండ వదిలేసి, కాలినడకన పయనమైనారు. మెహెరాబాద్ ఏకాంత కొండ చేరేందుకు దాదాపు నెలరోజులు పట్టింది. యీ ప్రయాణంలో ఆయన కార్యక్రమ వత్తిడి భారాన్ని అనుసరించి, సమయాన్నిబట్టి, అవసరాన్నిబట్టి, తొందరనిబట్టి, బాబా మానసిక భావాలు ఆధారంగా బస్సులు, లారీలు, ఎడ్లబళ్ళుసైతం వాడటం జరిగింది.

యీ ప్రయాణంలో మొదటి మజిలీ లింగంపేట. ఒక రహదారీ బంగళాలో బృందమంతా ఆరాత్రికి విశ్రమించి మరుసటిరోజు ప్రయాణం సాగింది. మొదటివారంలో ఒకసారి బాబా వృద్ధుడైన గుస్తాద్‌జీ అలసిపోవటం గమనించారు. ఎలాంటి కష్టాన్నీ బాబాకు చెప్పకపోయినప్పటికీ, ఈ సందర్భం పురస్కరించుకొని, అందర్నీ లారీపై పయనించేందుకు అనుమతించారు. అంతలో వారికి ఓ లారీ తారసిల్లింది. దానినిండా సరుకు మూటలున్నాయి. పాపం మిత్రులంతా ఏదోవిధంగా సర్దుకొని ఆ మూటలపైనే లారీ ఎక్కి కూర్చున్నారు. పాపం అలసట చెందిన

గుస్తాద్ జీని చూచి, తన ఆవేదన ఆపుకోలేక జాలి చెందిన బాబా ఆ విధంగా సామానులపైనే కూర్చొని లారీమీద ప్రయాణం సాగించే అవకాశం కల్పించారు.

సాక్షాత్తు అవతారమూర్తి మానవరూపధారియై తోటి మానవులతో ఒక సామానుల లారీపై ఎక్కి ప్రయాణం చేయటమంటే ఆయన ఎటువంటి హితైషిలాషో వూహించవచ్చును. నడక సాగించేప్పుడు శిష్యులు తమ సామానులు మోసేందుకు ఎద్దులబండి కిరాయికి మాట్లాడి వుపయోగించేవారు. ఒక్కొక్కప్పుడు, ఆ సామానులతోపాటు, శిష్యుల్నికూడ సర్దుకొని ఆ బండిపై కూర్చోమనేవారు.

దారిలో జోగిపేట పట్టణం తగిలింది. అక్కడ ఒక మస్తున్నాడని తెలిసింది. అతని కోసరం మిత్రులు వృధా ప్రయత్నం చేసి వెతికారు. కానీ కనపడలేదు. తదుపరి మజిలీ సదాశివపేట. అక్కడో మంచి మస్తును బాబా కలిశారు. "చిటగాపు" అనే వూళ్ళో గోపాలమనే మస్తును కలిశారు. పూర్వ జీవనంలో బాబా మస్తుల్తో ఏం చేసేవారో ఎవరూ చూచేవారు కాదు. నవజీవనం ఆరంభమైంతర్వాత యీ ఆంక్ష తొలగించారు. దివ్య ప్రియతముని సమక్షంలో మస్తులు వుండి, పొందే ప్రేమానుభూతిని ప్రత్యక్షంగా చూచేవారు. హఠాత్తుగా కలిగే ఆత్మీయత వలన, మస్తులు ఒక్కొక్కప్పుడు బాబాకు సన్నిహితంగా తీసుకురాబడేవారు. ఒక్కోసారి భావోద్రేకాలు పెరిగి ఆయన వంక రెప్పార్పకండా చూస్తూండి పోయేవారు.

ఆయన మృదువైన స్పర్శ, మెరిసే దృష్టి, మస్తుల హృదయాల్ని అరుదైన సమాధి స్థితిలో నింపేసేవి. తదుపరి మజిలీ హుమ్నాబాదు. ఇది 19వ శతాబ్దానికి చెందిన మానిక్ ప్రభువనే ప్రఖ్యాతి చెందిన సద్గురువుయొక్క సమాధి ఇక్కడ వుంది. ఆయనకు శిష్యుడు, కొడుకూ అయిన, మనోహర్ అను వారు తన శిష్యులతో తన తండ్రి సమాధి ప్రక్కనే సజీవ సమాధి చేయించుకున్నాడు. ఆనాటి మధ్యాహ్నం బాబా, యీ మనోహర ప్రభువుయొక్క సమాధి చెంత కాసేపు కూర్చున్నారు. ఆ తర్వాత మిత్రులతో కలసి నడక సాగించారు.

## ఆనంద దీపావళి

ఆక్టోబరు 29 న బాబా గుల్బర్గా పట్టణం వదిలి, "ఈత్గా" అనే వూళ్ళో వుండే ప్రియమస్తును కరిని కలిశారు. 1940 ప్రాంతంలో బాబా ఈ వూరుని రెండు సార్లు దర్శించారు. కొన్నేళ్ళ క్రితం యీ మస్తు దైవోల్లాసంతో నగ్నంగా తిరిగేవాడు. తర్వాత రోజుల్లో బట్టలు బలవంతంగా యితరులిచ్చే ప్రోద్బలం వలన ధరించేవాడు. మామూలుగా అతడు ఏ నూతి పక్కనో నిలబడి వేయించిన పప్పులు ఒక్కొక్క గింజే తినేవాడు. బాబా ప్రథమంలో అతడ్ని కలిసినప్పుడు, తన అమాయకత్వంలో ఆయన మౌనాన్ని విరమించమని ప్రాధేయ పడ్డాడు. రెండోసారి కలిసినప్పుడు, ఓ కప్పు టీలో రెండుగుక్కలు తాను తాగి తక్కింది బాబా కిచ్చి త్రాగమన్నాడు. ఆ ఎంగిలి టీని బాబా ఎంతో ప్రేమతో త్రాగారు.

యిప్పుడు మూడోసారి మళ్ళీ మస్తుని కలిసిన తర్వాత, సంపూర్తి కలిగించే సమావేశం జరిపి, బస్సుపై గుల్బర్గా తిరిగి వచ్చారు. పట్టణ పొలిమేరల్లో వున్న రహదారి బంగళాకు, ముగ్గురు మిత్రులు వెంటరాగా నడిచి వెళ్ళారు. నాలుగో మిత్రుడ్ని సామానంతా ఒక ఎద్దుల బండిపై వేసుకొని, బంగళాకు తెమ్మన్నారు. యిటువంటి వాహనాలు వాడటం, వద్దనటం, మోయమనటం, వద్దులే బండెక్కండి అనటం అంతా ఆయన యిష్టం మీదనే కాని, ఎందుకని అడిగే అవకాశం ఎవరికీ లేదు.

మరుసటి రోజున ప్రముఖుడైన క్వాజాబందేనవాజ్ దర్గాని సందర్శించి వచ్చారు. దర్గాలో ఒక ఏకాంత ప్రదేశంలో దాదాపు అరగంటసేపు ప్రశాంతంగా కూర్చొనేందుకు అవసరమైన ఏర్పాట్లు చేయబడ్డయి మౌనంగా గడిపిన యీ ఏకాంత సమయం పూర్తి కాగానే పట్టణంలో తిరిగే మస్తుల్ని కలుద్దామని బయలుదేరారు. ఇటువంటి దైవోన్మత్తుల్ని కనుగొనుటలో బైదులు కడు నిపుణుడు. భారతావనిలో విభిన్న ప్రాంతాల్లో వున్న మస్తులందరి పేర్లు అతనికి బాగా జ్ఞాపకం వుంటయి. వాళ్ళుండే ప్రాంతాలు కూడ గుర్తే!

అందుచేత, యిప్పుడు బాబాను పట్టణంలో మస్తులుండే ప్రాంతాలన్నీ తిప్పాడు. వుదయం యీరుచ్‌కి కొంత అదనపు పని వప్పగించారు. మస్తు కార్యక్రమంతోపాటు, బాబా ఆనాడు పేదల్ల కార్యక్రమం కూడ సాగించారు. జాతి, కుల, మత వివక్షత లేకుండా, ఎవరైనా సరే ఒకప్పుడు బాగా బ్రతికి, యిప్పుడు

కటిక దరిద్రం అనుభవిస్తున్న మధ్యతరగతి నిరుపేదల్ని వెతక మని యూరుచ్‌ని ఆదేశించారు. అటువంటి కుటుంబ యజమానికి ఆర్థికంగా సహాయం అందించ దలచారు. యిటువంటి పనిలో యిదివరకు అనుభవం వున్న యూరుచ్, కొందరు సంఘ సేవ కుల్ని కలిసి కొంత ప్రాథమిక సమాచారం సేకరించాడు.

అందులో, నిజానిజాలు తెలుసుకొనేందుకు, కొంతమంది సహాయంతో అటువంటివారుండే చోటుకు వెళ్ళి ఆరా తీస్తున్నాడు. అంతలో యీ విషయమంతా పట్టణంలోచి ఒక ప్రముఖ వ్యాపా రికి తెలిసింది. సరిగ్గా ఆ రోజుల్లో పొరుగున వున్న తెలంగా ణాలో కమ్యూనిష్టు పార్టీవారు, విప్లవాత్మకమైన పేదల కార్య క్రమం సాగిస్తున్నారు. యీ ప్రముఖ వ్యాపారి, మరో పార్టీకి చెందిన వాడు. గుల్బర్గాలో ప్రముఖ రాజకీయ నాయకుడు కూడా. పేదల సహాయార్థం వివరాలు సేకరిస్తున్న యూరుచ్‌ని ఒక కమ్యూనిష్టు వాడిగా ఆయన భ్రమ పడ్డాడు. "తనతో సంప్ర దించకుండా పేదల సహాయ కార్యక్రమం చేసేందుకు యితని కెన్ని దమ్ములు ?" అనుకున్నాడు. తన రాజకీయ పలుకు బడి దెబ్బతింటుందనుకొని, వెంటనే పోలీసు వున్నతాధికారులకు ఫోను చేసి, పట్టణంలో ఈ అపరిచితవ్యక్తి చేస్తున్న కార్య కలా పాల్ని వెంటనే కూపీ తీయవలసిందిగా కోరాడు.

యూరుచ్‌ని కలిసి ప్రశ్నించేందుకు పోలీసు స్టేషనుకు తీసుకు రమ్మని ఒక కానిస్టేబులును, పోలీసుశాఖ నియోగించింది. అతడు యూరుచ్‌ని కలిసి, పై అధికారుల ఆజ్ఞలు తెలిపి స్టేష

నుకు రమ్మన్నాడు. నోటితో చెప్పే మాటలు నాకనవసరమని అతని కోరికను తిరస్కరించి రాను పొమ్మన్నాడు. తన పని ఆప కుండా కొనసాగించాడు. పేదల యిళ్ళు తిరగటం మానలేదు. కొందరు సంఘ సేవకులు చెప్పిన సమాచారం నిజమేనని తేలిన సందర్భాల్లో ఆ కుటుంబ యజమానులతో, వారికి, తమ పెద్ద న్నయ కొంత ఆర్థిక సహాయం అందించే ముందు జరిగే మామూలు తతంగం గురించి వివరిస్తున్నాడు.

అలా కొంతమంది కుటుంబ యజమానులను కలిసి, చెప్పటం పూర్తి అయిన పిదప బంగళాకు బయలు దేరాడు. దారి లోనే అనుకోకండా బాబా, బైదులు తారసపడ్డారు. వారు ముగ్గురు కలిసి నడుస్తుండగా అంతలో మళ్ళీ యిందాకటి కానిస్టేబులు ఎదురయ్యాడు. యీరుచ్‌తో మా "బాసు నిన్ను వెంటనే తీసుకు రమ్మన్నాడు. వస్తావా ? రావా ?" అంటూ అధికార హోదాలో డబాయించాడు. బాబా బృందం వారికి రాష్ట్రమంతా యదేచ్ఛగా తిరిగేందుకు పోలీసు వారిచ్చిన అనుమతిపత్రం హైదరాబాదు పోలీసు సూపరింటిండెంటు స్వయంగా బృందంవారికిచ్చిన ధృవీ కరణపత్రం వున్నట్లు యీరుచ్ ఆ కానిస్టేబులుకు తెలిపి, తాముం టున్న బంగళా గుర్తు చెప్పాడు. యిది మా అడ్రసు. మీ ఇన్స్పె క్టరు గారికి మరేమైన సమాచారం కావాలంటే, మా బంగళాకు వచ్చి మమ్మల్ని కలువ వచ్చునని చెప్పమన్నాడు.

తమనే ధిక్కరిస్తున్నట్లున్న ఈ జవాబు కానిస్టేబుల్ని విస్మయ పరచింది. చేసే[illegible] తిరిగి వెళ్ళిపోయాడు. బాబా

బృందం బంగళా చేరారు. అప్పటికి సాయంకాలమయింది. ఎవరూ భోజనం చేయలేదు. నడవటం వల్ల అంతా అలసి వున్నారు. భోజనానికి ముందు స్నానం చేస్తే బాగుంటుందనుకున్నారు. స్నానాదులు పూర్తిచేసి, భోజనం కావించి విశ్రాంతి తీసుకుంటువ్న సమయంలో ఒక పోలీసు వ్యాను వచ్చి బంగళా ముందు ఆగింది. యీరుచ్ సమాధానం విన్న డిప్యూటీ పోలీసు సూపరింటెండెంటుకు చాలా కోపం వచ్చి, తన అధికారాన్ని వెలగ బెట్టేందుకు స్వయంగా బంగళాకి వచ్చాడు.

వ్యాను దిగి బంగళా దగ్గరికి వచ్చేసరికి, అతనికి ముందుగా పెండూ కనిపించాడు. అతడ్ని చూచేసరికి, ఆ బృందం గురించి తనకు కలిగిన దురభిప్రాయం మాయమైంది. అతడు పెండూని బాగా ఎరుగును. పెండూ మెహెర్‌బాబా శిష్యుడని కూడ తెలుసును. కొన్ని సంవత్సరాల క్రితం యీయన, అహ్మదునగరులో ఒక పోలీసు ఇన్స్పెక్టరుగా పని చేశాడు. అప్పట్లో, పెండూ అహ్మదునగరులోని ఒక ప్రముఖ కమ్యూనిష్టు నాయకునితో కలిసి తిరుగుతుంటే, ఇతడ్ని వామపక్ష సభ్యుడేమోనన్న అనుమానంతో వెంటాడాడు.

నిజానికి, పెండూ, ఆ కమ్యూనిష్టు నాయకుడిని, బాబా చేసే పేదల కార్యక్రమంలో అవసరమైన పేదల ఆచూకీ తెలుసుకోవటం కొరకే కలిసేవాడు. పల్లెటూళ్ళల్లో వుండే నిరుపేదలైన వారికి బాబా, ఆహారపదార్థాలు, బట్టలు వుచితంగా పంచి పెట్టేవారు. చివరికీ యిన్స్పెక్ట[illegible]సలు విషయం తెలుసుకొని,

బాబా మండలి, రాజకీయాలకు అతీతులని, బాధ్యతతో కూడిన క్రమశిక్షణ పాటిస్తూ మెహెర్‌బాబాకు తమ జీవితాలు అంకితం చేసుకున్న ధన్య జీవులుగా గుర్తించాడు. అప్పుడు పెండూని కలిసి, అతడ్ని పొరపాటుగా అర్థం చేసుకున్నందుకు క్షమించ మని అర్థించాడు, అప్పటినుండి వారి మధ్య సుహృద్భావం పెర గటమేకాక, బాబా దర్శనం కూడ అప్పుడప్పుడు చేసుకుంటూ వుండేవాడు.

కొన్నేళ్ళు గడిచాయి. డిప్యూటీ సూపరింటెండెంటుగా ప్రమోషనువచ్చి గుల్బర్గాలో యిప్పుడు పని చేస్తున్నాడు. బంగళా లోకి వస్తున్న ఆనాటి మిత్రుడైన డిప్యూటీ పోలీసు సూపరింటెండెంటుని చూచి, పెండూ, పలకరిస్తూ, "ఏం యిలా వచ్చారు ? ఏదైనా ఎంక్వైరీ వున్నదా ?" అంటూ ప్రశ్నలవర్షం కురిపించేసరికి ఇద్దరూ నవ్వుల్లోపడి కరచాలనాలు చేసుకున్నారు. మాటల మధ్యలో, హైదరాబాదు పోలీసుఅధికారులు జారీ చేసిన వుత్తర్వులో అనుమతించిన మార్గం ప్రకారం, గుల్బర్గా పట్టణం చేర్చలేదని ప్రస్తావించాడు. ఆ సర్క్యులరు తాను చదివానని, అందులో గుల్బర్గా లేకపోయినా, బాబా గుల్బర్గా ద్వారా ప్రయాణం చేయాలని సంకల్పించటం ఎంతో ముదావహమని అది నా అదృష్టమని తన సంతోషం వ్యక్త పరచాడు. "బాబాను దర్శించవచ్చునా ?" అని అడిగాడు.

పెండూ, "యిప్పుడేవస్తాను వుండ" మని చెప్పి లోనికి వెళ్ళి విషయమంతా బా[illegible]పాడు.

నవజీవన నియమాలకి విరుద్ధమైనప్పటికీ, బాబా ఆ పోలీసు అధి కారిని మర్నాటి-వుదయం వచ్చి దర్శించుకోమని చెప్పమన్నారు పెండూ ఆశ్చర్యపోయాడు. ఆ పోలీసు ఆఫీసరు పేరు "ఘంటి" మర్నాడు అక్టోబరు 31. దీపావళి రెండోరోజు పండుగ. వుద యమే తన కుటుంబ సమేతంగా వచ్చాడు, బాబా దర్శనం కొరకు. పరిమళించే పెద్ద పూలదండ, ఒక బుట్టతో మిఠాయిలు తీసుకొని భార్యా పిల్లలతో బాబా దర్శనం చేసుకున్నాడు. ఇటీ వలి నియమాలెరుగని ఆ అధికారి, బాబా ముందు సాష్టాంగ పడినా ఆయన అభ్యంతరం చెప్పలేదు. కాసేపు గడిచింతర్వాత కుటుంబంతో పాటు వుప్పొంగిన హృదయంతో వెళ్ళిపోయాడు. యీ విధంగా యీరుచ్ పోలీసు స్టేషనుకు వెళ్ళి రిపోర్టు చేయటా లికి బదులు, డిప్యూటీ సూపరింటెండెంటునే తన బంగళాకు రప్పించి పాదాక్రాంతుడయ్యేట్లు చేయటం, సర్వజ్ఞుని చర్య కాదా ?

అదేరోజు 10-30 గం.కు వెళ్ళే రైలెక్కి బాబా బృందం "యాదగిరి" చేరారు. సాయంకాలం నాలుగు మైళ్ళు నడచి, తుంకూరులోవున్న "తిగ్గురి స్వామి"ని కలిశారు. ఈ స్వామిని బాబా యింతకు ముందు 1944 లోను 1949 మే నెలలోను కలి శారు. పూర్వం ఈ స్వామిని చిన్నపిల్లలు రాళ్లేసి కొట్టేవారు. చెవులులాగి, జుట్టులాగి ఆట పట్టించేవారు. ఎంత అల్లరి పెట్టినా హాస్యంగా తీసుకొనేవాడే కానీ ఏమాత్రం వుద్రేక పడేవాడు కాదు. కాలక్రమంలో గ్రామస్తు[illegible]తనిలోని దైవశక్తిని

గుర్తించి ఆయనయందు భక్తి ప్రపత్తులు పెంచుకున్నారు. ఆయన వుండేందుకు కనువైన పక్కాని గదిని తుంకూరు గ్రామ కరణం కట్టించాడు. ఆయన భౌతిక శరీర త్యాగానంతరం, ఆ కాయాన్ని నిక్షిప్తం చేసేందుకో సమాధిని కూడ తయారు చేయించారు.

తుంకూరులోని తిలుగురుస్వామి జీవన్ముక్తుడని గతంలో ఒకసారి బాబా మండలితో చెప్పారు. జీవన్ముక్తుడే, దైవ చైతన్యం, సృష్టి చైతన్యంతో పరిపూర్ణుడైన ఏకైకుడన్నమాట. ప్రశాంతమైన వదనం, రాజసం వుట్టిపడే ముఖంతో ఆజాను బాహుడతడు. యిటువంటి తిలుగురుస్వామిని బాబా యిప్పుడు మూడోసారి కలిశారు. ఈ సారికూడా మునుపటి రెండు సమావేశాల్లాగానే విశిష్టమైంది. ఒకరికొకరు కళ్ళల్లోకి తీక్షణంగా చూచుకున్నారు. బహుశః వారి అనంతలోతుల్లో ఏకాగ్రతతో చూచారేమో ! అంతలో స్వామి బాబాకు సాష్టాంగపడి సమస్కరించ ప్రయత్నించగా, అలా చేయకుండా వుండేట్లు బాబా అడ్డుకున్నారు.

భక్తితో స్వామి చూపిన వినయం, ఎంతో ప్రాముఖ్యత కలిగి వున్నది. సనాతనుడుగా సహజజ్ఞానం కలిగి వున్నప్పటికీ, బాబా, తన అవతార కార్యక్రమం కోసరం పూర్తి నిస్సహాయత కలిగిన నవజీవన ఘట్టంలో ప్రవేశించారు. యిప్పుడాయన సాధారణ మానవుడుగా వ్యా[illegible] తిలుగురుస్వామి, ఆత్మ సాక్షాత్కారం పొ[illegible]డి, అవతారుని యొక్క అనంత వినమ్రతను

గుర్తించి, ఆయన సాధారణ మానవుని స్థాయికి దిగి వచ్చాడని తెలుసుకున్నప్పటికీ, ఆశ్చర్యకరమైన, ఈ అవతార పాత్రను గౌరవించి, తన ప్రణామములర్పించకుండా వుండలేక పోయాడు

ఈ విధంగా బాబా నవజీవనంలో సాధారణ మానవులతో, మస్తులతో. యింకా పూర్ణపురుషులతో యీ తుంకూరు జీవన్ముక్తుడైన తిలుగురుస్వామిద్వారా తన సంబంధాన్ని పాదుకొల్పారు. పూర్ణమైన ఈ సమావేశం కాగానే, బాబా చకచకా యాదగిరి విడిచి వెళ్ళారు. బృందంతో బాబా నగరంలోకి చేరే సరికి, దీపకాంతులతో వెలుగొందుతోంది. పట్టణం మొత్తం బాబాకు దీపాలతో స్వాగతం చెబుతోందా ? అన్నట్లుంది. ప్రతి యింటి ముంగిట మట్టి దీపపు ప్రమిదలుంచారు. ఆరోజు దీపావళి పండుగ. యింటింటా దీపాలంకరణ బ్రహ్మాండంగా చేశారు. చిన్ని దీపాలు, దివ్య తేజస్సుకు స్వాగతం చెబుతున్నట్లున్నాయి. చిరుదివ్వెలు జ్ఞానప్రకాశానికి స్వాగతం పలికాయి.

## పవిత్రమైన పూర్ణత్వ సిద్ధి

గుల్బర్గాలో బాబా ఆదేశానుసారం యీరుచ్ కొందరు నిరుపేదలను కనుగొనటం, ఆ కుటుంబ పెద్దలకు బాబా తగిన ఆర్థిక సహాయాన్ని అద్వితీయ రీతిలో పంచటం, యివన్నీ జరిగాక, బృందంతో హుమ్నాబాదు చేరారు. తన పాత అలవాట్ల ప్రకారం, ఆఖరికి నవజీవన యాత్రా సమయంలో కూడ బాబా ఎంతో వినయ విధేయతలు [illegible] పేద సాదలకు సహాయపడి ఆవసరానికాదుకొన్న సంఘటనలెన్నో జరిగాయి. తన అద్వై

తీయ ప్రేమను అలా పంచేవారు. యీ వూళ్ళో ఒక పేద బాలిక, అస్వస్థురాలై, ఆర్థిక ఇబ్బంది వలన తగు వైద్య సదుపాయంలేక, కష్టదశలో వుంటే కరుణామయుడు బాబా అత్యవసర వైద్యసదుపాయం ఆ పిల్లకు కలిగించారు.

తర్వాత నడక సాగించి తుల్జాపూరు చేరారు. ఈ పట్టణంలో భవానీదేవి దేవాలయం జగత్ప్రసిద్ధి చెందింది. యీ దేవి మహత్తుతో శివాజీకి ఒక ఖడ్గం ప్రసాదంగా బహూకరించ బడిందని, ఆ మహారాజు, దానివలననే దాదాపు అన్ని యుద్ధాల్లోను విజయం సాధించగలిగాడని ప్రతీతి. ఈ వూళ్ళో రెండు రోజులు వుండి, యిక్కడ కూడ కొందరు మస్తుల్ని కలిశారు. తుల్జాపూరు నుండి, ఒస్మానాబాదు, భాడ్, ఔరంగాబాదుల మీదుగా ఖుల్దాబాదు చేరారు. అది ఒక చిన్న పల్లెటూరు. బాబా ఈ వూళ్ళో నవంబరు 15 వరకూ ఒక వారం రోజులున్నారు.

ఆ వారంరోజులూ ఆదాలియా మసీదు ప్రక్కనేవున్న భవనంలో విడిది చేశారు. యిప్పుడాభవనం అతి ముఖ్యులకు అతిథి గృహంగా వుంది. అందులో మూడు గదులున్నాయి. బాబా నవ జీవనంతో ముడిపడ్డ అతిముఖ్యమైన ప్రదేశాల్లో ఇది ఒకటి. వూరు చిన్నదైనా ఆధ్యాత్మిక సంస్కృతిలో అత్యున్నతమైనది. 13, 14 శతాబ్దాల్లో, దౌలతాబాదునుండి ఎల్లోరా వరకు మధ్యలో వున్న ఖుల్దాబాదుతోసహా వున్న ప్రదేశమంతా దక్కన్ పీఠభూమిగా వు[illegible] సూ[illegible]ృతికి కేంద్రంగా వుండేది.

దేశంలోని యితర ప్రాంతాలనుండి వందలాది మంది ఆధ్యాత్మిక మార్గదర్శకత్వం కోరేవారు, యిక్కడకు వలస వచ్చేవారు. **14** వ శతాబ్దాంతానికి, చిన్నా పెద్దా కలిపి దాదాపు **1400** సమాధులు, ఆధ్యాత్మిక చింతనాపరులవి వుండేవి. ఖుల్దాబాదులో వున్న సమాధులలో అతి ముఖ్యమైన దర్గా, జర్ జరీ జర్ భక్షీ అనే సద్గురువు సమాధి. ఈ ప్రాంతంలో మార్గదర్శకుడుగా స్థిరపడిన సూఫీ సద్గురువాయన. యిక్కడకు చేరిన మర్నాడు బాబా సాధుపుంగవుల దర్గాలనేకం దర్శించారు.

జర్ జరీ జర్ భక్షీ దర్గాతో సంబంధమున్న ఒక గుహలో బాబా ఒంటరిగా కొంతసేపు కూర్చున్నారు. ఆ ప్రాంతంలో వున్న ఒక మస్తును స్నానం చేయించి, నూతన వస్త్రములు యిచ్చి, మౌనంగా యీ గుహలో కూర్చోవటం సమాప్తి చేశారు. సద్గురు శాయిబాబాకి ఆత్మ సాక్షాత్కారం కలిగించిన గురువీయన. శాయిబాబా జర్‌జరీజర్‌భక్షీ ఆదేశాలమేరకు యీ గుహలోనే, కఠోరమైన ఆధ్యాత్మిక, నియమాలు పాటిస్తూ చాలాకాలం గడిపారు. ఎన్నో జన్మల ఫలితంగా, శాయిబాబా చూపిన ప్రేమ, భక్తి వీటికి ముగ్ధుడైన గురువు తన కృపను వర్షించటమేకాక, దైవసాక్షాత్కార ప్రాప్తి కలిగించటమేకాక, యుగావతారునికి కార్యభారాన్ని వప్పగించేంతవరకు, ఆధ్యాత్మిక వారసత్వానికి ప్రముఖుడుగా వుండేవాడు శాయిబాబా. ఔరంగాబాదుకు వాయువ్యంగా వున్న దౌలతాబాదుకు 1[illegible]చ్చారు.

ఆ మర్నాడు ఆయన ఎల్లోరాగుహలు చూచేందుకు వెళ్ళారు. వీటిని, బౌద్ధులు, బ్రాహ్మణులు, జైనులు, కలిసి చెక్కించారు. ఈ గుహలు, క్రీ. శ. 4 వ శతాబ్దం 13 వ శతాబ్ద ముల మధ్య చెక్కబడినయి. అతి విశాలంగా విస్తరించబడి, ఉత్కృష్టరీతిలో, ఆకర్షణీయమైన కళావైభవంతో అవి అతి సుందరంగా మలచ బడినయి. ఎంతో గుంభనంగా కళాకారులు కృషి చేసినందున, విగ్రహ రూపంలో మలిచిన చిత్రకళలో, నిస్వార్థము భక్తి ప్రపత్తుల్ని ప్రతి గుహలోనూ వుండే దేవతా మూర్తుల్లో వుట్టి పడుతుంది. బాబా ముఖ్యంగా 10, 16 నం గుహల్లో ప్రత్యేక శ్రద్ధ చూపించారు. మొత్తం అక్కడ 34 గుహలున్నయి. 10 వ నంబరు గుహలో సుతారుని పనివాడితనం బాగా కనపడుతుంది. ఇక్కడ బుద్ధుని విగ్రహం విశ్వకర్మకు ప్రతీకగా మలచబడింది. విశ్వకర్మ సృష్టినిర్మాణశక్తి మూర్తీభ వించిన విశిష్టవ్యక్తి. ఆయన కళలకు మూలపురుషుడు. వెయ్యి రకాల చేతి పనులను అమలు పరచే శక్తిమంతుడుగా ఆయన గౌరవించబడతాడు. బుద్ధుడు పరిపూర్ణ శిల్పకారుడుగా ఈ 10వ నంబరు గుహలో మలచ బడ్డాడు.

పోతే 16వ నంబరు గుహలో, కైలాస దేవళం మలచ బడింది. నిజానికిది ప్రపంచ విచిత్రాల్లో ఒకటి. ఓ పెద్ద కొండని తొలిచి, దేవాలయ రూపంలో చెక్కారు. దేవాలయం సహజంగా కట్టారా ? అన్న [illegible] వుట్టిపడే లాగున ధ్వజస్థంభం. గర్భగుడి, [illegible]లిగోపురం, ముఖప్రాంగణం, దేవతాపీఠం, శివ

లింగం, గోడలపై అనేక చిత్తరువులు అన్నీ ఒకే కొండ రాతిని తొలిచి చెక్కబడినవే ! బాబా ఆనాడు తన కార్యక్రమ నిర్వహణకు 32 వ నం. గుహను ఎంచుకున్నారు. యీ గుహని "ఇంద్రసభ" అంటారు. యీ గుహలో జైనమత స్థాపకుడు, 24వ తీర్థంకరుడైన మహావీరుని విగ్రహాన్ని సింహపు సింహాసంపై కూర్చున్నట్లు చెక్కబడింది. పరిపూర్ణ సన్యాసియైన మహావీరుని విగ్రహంముందు బాబా వంటరిగా కొంతసేపు కూర్చున్నారు.

అతి సున్నితమైన చెక్కడములు, ఎంతో నేర్పుతో ఉలిని ఉపయోగిస్తే గాని తయారు కావు. యీ చెక్కడాల్లో వులితో చెక్కిన నిపుణత్వం, దిగంబర మతానికి చెందిన జైనుల సిద్ధాంతానికి ప్రతీకలుగా నిలచాయి. అంతర్గతంగాను, బాహ్యంగానూ సర్వసంగపరిత్యాగాన్ని యీ మతం ప్రబోధిస్తుంది. అందుకే కాబోలు, బాబా యీ స్థలాన్ని తన నవజీవన నిస్సహాయ స్థితికి పూర్తి సర్వ సమర్పణకి అనువైన ఏకాంత ప్రదేశంగా ఎంచుకున్నారు.

ఇక్కడ తన కార్యక్రమం పూర్తి చేసుకొని, బాబా అవాలియా మసీదుకు తిరిగి వెళుతూ, దారిలో ప్రహ్లాదుడు, కేశవ మహారాజు లనే యిద్దరు మస్తుల్ని కలుసుకున్నారు. నవంబరు 14 వ జర్ జరీ జర్ బక్షీ దర్గా కావలివాడు "ముజావర్" అనునాతడ్ని తమ నివాసానికి పిలిపించి, అతని పాదాలు కడిగి రు 21-00 లు బహుమతిగా [illegible] తరువాత అతనితో

కలిసి భక్షీ దర్గా దగ్గరకు వెళ్ళారు. అంతకుముందీ కావలివాడు 74 మహమ్మదీయుల్ని పోగుచేసి గురువు సమాధివద్ద వుంచాడు. మామూలు ప్రకారం, బాబా వారందరి కాళ్ళు కడిగి, తుండుతో తుడిచారు. " ముజవర్ " ఖురాన్ నుండి ప్రత్యేక ప్రార్థన చేసిన అనంతరం, అంతా ఆశీర్వాదం కోరుతూ బృందగానం చేశారు. " హే ! భగవాన్ ! ఆయన చేసేది ఎటువంటి కార్య క్రమమైనా సరే ! ఆ కార్యక్రమం నిర్విఘ్నంగా పూర్తి అగు గాక ! " అంటూ అందరిచేత ప్రార్థనలు చేయించారు.

పిమ్మట బాబా దర్గా వదలి, వూళ్ళో అయిదు హిందూ గృహాల్లో భిక్ష నర్థించారు. భిక్షగా ఏమి పెట్టినా ప్రేమతో, నమ్రతతో అంగీకరించారు. ఒకవైపు తాను భిక్షను అర్థిస్తూ మరో వైపున, ఆనాటి వుదయం కొందరు పేదవారికి సహాయ పడినట్లే యిప్పుడు కూడ పేదసాదలకు సహాయం అందించారు. మొత్తం మీద ఆనాడు ఖుల్దాబాదు వూళ్ళో దాదాపు వెయ్యి రూపాయలు పేదలకు సహాయంగా పంచి పెట్టారు. ఆయన ఆహారం కోసరం ఒక వైపున అర్థించారు. మరో వైపున ధనాన్ని పంచారు. ఒక వైపున బాబా భిక్షకుడు. మరో వైపున ప్రసాదించువాడు అభ్యాగతి.

## దైవీమానవుని ఆశీర్వదించుట

మరుసటి రోజున రెండు అసాధారణమైన సంఘటనలు జరిగాయి. వుదయం, బాబా [illegible] బృందంతో బస్సులో ఔరంగాబాదు వెళ్[illegible]. [illegible]ం చేరగానే బాబాకు అలవాటులేని

అనూహ్యమైన కోరిక జనించింది. యూరుచ్‌ని పిలిచి, తనను ఆశీర్వదించేందుకు ఈ ఔరంగాబాదులో ఎవరైనా " క్రిష్టియన్ ఫాదరు " దొరుకుతాడా ? అని అడిగారు. తన శాయశక్తులా ప్రయత్నిస్తానని యూరుచ్ బదులిచ్చాడు. అందుకు బాబా " నీవా తడిని కలువగానే అతడెవరో నీవు తెలుసుకో గలవు " అన్నారు.

బాబా యూరుచ్ యిరువురూ ఒక టాంగా మాట్లాడుకొని దైవీమానవుడ్ని ఆశీర్వదించే అదృష్టవంతుడైన బిషప్‌ను గాలించటం మొదలు పెట్టారు. చర్చిలు, ఫాదరులుండే క్వార్టర్లు బంగళాలు అన్నీ గాలించారు. యూరుచ్ కొందరు క్రీస్టులను కలిశాడు కానీ, వారిలో ఏ ఒక్కరిలోనూ బాబా చెప్పిన లక్షణాలు కనిపించలేదు. యిలా యూరుచ్ అనేకమంది క్రీస్టులను కలవటం చూచేసరికి, టాంగావాలాకు అనుమానం వచ్చింది. అలా ఎందుకు కలుస్తున్నాడో తెలుసుకోవాలన్న జిజ్ఞాస కలిగింది. " బాబూ ! ఎవరికొరకు మీరిలా వెతుకుతున్నారు ? " అని అడిగాడు. "పేరుగాంచిన ఒక వృద్ధ క్రీస్టు " కోసరం వెతుకుతున్నామని జవాబిచ్చాడు. అందుకా డ్రైవరు నవ్వి, " అయ్యో ! మీరు ముందుగానే నాతో యీ విషయం చెప్పివుంటే, యింత వృధా ఆలశ్యం జరిగి వుండేది కాదు కదా ! ఫాదరీలు, క్రీస్టు, మంత్రులు వుండే బంగళాలు నాకు బాగా తెలుసును. నేను తీసుకు వెళతాను రండి ! " అంటూ గుర్రాన్ని అదిలించాడు.

ఒక గుమ్మం ముందు టాం[illegible] బాబాను టాంగాలోనే ఆపి, యూరుచ్ లోనికి క్రీస్టుని గురించి తెలుసుకొనేందుకు

వెళ్ళాడు. వరండాలో తెల్లని దుస్తులు ధరించిన ఒక ప్రీస్టు నిల బడి వున్నారు. యీరుచ్‌ని ఆప్యాయతతో పలకరించి, " బిడ్డా ! ఏం కావాలి ? " అని ప్రశ్నించాడు. అతని పలకరింపులో వుట్టి పడిన ప్రేమ, రూప లావణ్యం వీటిని చూచి ముగ్ధుడై " మా పెద్దన్నయ్యను ఆశీర్వదించగలరా ? " అని అడిగాడు. ఆయన ఎక్కడ వున్నారని అడుగగా బయటనే వున్నారని సమాధాన మిచ్చాడు. " ఆయనను పిలుచుకు రమ్మంటారా ? " అని మళ్ళీ అడిగాడు " ఓ ! తప్పకండా పిలుచుకురా బాబూ ! " అని జవాబిచ్చాడా ప్రీస్టు.

చూపులకా ప్రీస్టు పొట్టిగా వున్నా, బాగా లావుగా వున్నాడు. సంభాషణలో అతడు ఆంగ్లేయుడు కాడని తెలిసింది. యీ ఫాదరు ఫ్రెంచివాడా ? ఇటాలియనా? అని కూడా తేల్చుకోలేక పోయాడు. కానీ, యితడే బాబా ఎదురుచూస్తున్న వ్యక్తి అని మాత్రం అనుకున్నాడు. బయటకు వెళ్ళి బాబాను పిలుచుకు వద్దా మనుకొని వరండాలోనికి వెళ్ళే సరికి అప్పటికే బాబా లోనికి వచ్చేందుకు టాంగా దిగి ఎదురు చూస్తున్నారు. ఆ వుదయం టాంగా ఎక్కిన దగరనుంచి, టాంగా దిగటం అదే ప్రథమం. వరండాపై వున్న మెట్లు ఎక్కుతున్నారు. అనుకో కండా అప్పుడు అక్కడ యితరులెవరూ లేరు.

బాబా నిర్ణయించిన సమయం అంత పరిపూర్ణమైందన్న మాట. ఆ ఫాదరీ పేరు " బర్జర్. " అతడిని యీరుచ్ పిలిచి " యిరుగో, మా [illegible] అంటూ బాబాను పరిచయం చేశాడు. [illegible] బా పైకి వచ్చారు. భక్తి ప్రపత్తులతో బాబా

బర్జరు పాదాలకు వంగి ప్రణామం చేశారు. ఫాదరు పాదాలకు ప్రణమిల్లి ఎంతో ప్రేమతో అతని చేతిని ముద్దాడారు. కుమారుడ్ని హృదయ పూర్వకంగా ఫాదరీ ఆశీర్వదించాడు. ప్రణమిల్లిన బాబా లేవగానే అయనకు బదులుగా యీరుచ్, ధన్యవాదాలు తెలుపుకున్నాడు. యిహ ఎటువంటి సంభాషణ లేకుండా యిరువురూ వరండా దాటి బయటకు వచ్చారు. అసలు జరిగిందేమిటో అర్థం కాని ఫాదర్ బర్జకు యీరుచ్‌ని పిలిచి, " బిడ్డా ! నిన్నుకూడ ఆశీర్వదిస్తాను రా " అని పిలిచాడు. అందుకు యీరుచ్ " అవుసరం లేదులే ! " అని సమాధానమిచ్చాడు.

అలా జవాబిచ్చిన యీరుచ్ బాబాను తీసుకొని టాంగా ఎక్కాడు. నవజీవన సంఘటనలన్నీ సుళువుగా అర్థము కావు. అన్ని సంఘటనలు, నిగూఢమైన అర్థమేదో కలిగి, దుర్భేద్యమై మానవ మేధకు అంతుబట్టని రీతిలో వుంటయి. తిన్నగా స్థానికంగా వున్న శాంతిస్థూపం దగ్గరకు చేరుకున్నారు. ఇది పార్శీలు మరణించిన వారి అంతిమ సంస్కారాలు చేసే చోటు. దీన్నే " ఢఖ్మా " అనికూడ అంటారు. అక్కడ తన బృందంవారిని జోరాష్ట్రియన్ ప్రార్థనల్ని చేయుమని ఆదేశించి వారు చేసే ప్రార్థనలలో తాను కూడ మౌనంతో పాల్గొన్నారు.

హిందువుల్లో దింపుడు కల్లం అంటూ శవాన్ని శవ వాహకులు చితికి యివతల కొంత దూరంలో దించి, కొన్ని మత పర సంస్కారాలనంతరం [illegible] మోసుకొని పోయి అంతిమ సంస్కారాల నిమిత్తం చిత[illegible]. అలాగే

జోరాష్ట్రియనులు, అంతిమ సంస్కారం జరిపే శాంతి స్థానానికి సమీపంలో శవాన్ని కొంత తడపుంచుతారు. యీ స్థలాన్ని "సఘడి" అంటారు. బాబా యీ రోజు యిటువంటి స్థలంలో కొన్ని నిమిషాలు మౌనంతో కూర్చున్నారు. ఆనాడు బాబా ప్రత్యేక లక్షణాలతో ముభావంగా కనిపించారు. అదైనతర్వాత తననొక క్రిష్టియనుల స్మశానానికి తీసుకువెళ్ళమన్నారు. అది పట్టణ పొలిమేరల్లో ఎక్కడో దూరంగా ఉంది. బాబా అక్కడకు చేరగానే గోరీల మధ్యలో వున్న ఒక వేపచెట్టు క్రింద కాసేపు ఒంటరిగా, నిశ్శబ్ద వాతావరణంలో గడుపుతానన్నారు.

యధాప్రకారం, నలుగురు శిష్యుల్ని ఆ గోరీల దొడ్డికి నాలుగు వైపుల కావలి వుంచి, తనకెటువంటి అలజడి కలిగించ కుండా వుండేందుకు నిశ్శబ్దాన్ని కాపాడమని ఆదేశించారు. గోరీల దొడ్డికున్న మెయిన్‌గేటులో కాపలా వుండే పనిని యీరుచ్‌కి వప్పగించారు. అది మిట్టమధ్యాహ్నం. అటువంటి సమయంలో స్మశానం లోనికి ఎవరూ వచ్చే అవకాశం లేదు. అయినా, తన సమీపానికి వచ్చుటకు గానీ తన వైపు చూచుటకు గానీ ఎవరినీ ప్రయత్నించ నీయవద్దని మరీమరీ చెప్పారు. మొదట్లో అంతా బాగానే జరిగింది. కొద్ది నిమిషాలు గడచేసరికి, ఎక్కడనుంచో ఒక పెద్ద వూరేగింపుతో స్మశానంవైపు ఓ శవాన్ని మోసుకొస్తూ కొందరు యీరుచ్ కంట పడ్డారు. మరణించిన వాని బంధువులు, మిత్రులు, హితులు, మౌనంగా శోకతప్త హృదయంతో శవ వాహనంపై తీసుకు వస్తున్నారు. యిప్పుడీ వాహకబృందం,

స్మశానంలో ప్రవేశించి తీరుతారు. అలా వచ్చినప్పుడు, బాబా ఏకాంతానికి భంగం కలుగుతుందేమోనని ఆవేదన పడ్డాడు యీరుచ్.

యిటువంటి ఆలోచన వచ్చీ రాగానే బుర్ర చురుగ్గా పని చేసింది. శవానికి ఎదురువెళ్ళి దానిననుసరించి వస్తున్న వారికి తన విచారాన్ని, సానుభూతిని వ్యక్త పరచాడు. ఎంతో సహజత్వం పుట్టిపడేటట్లు, వారిని, మరణించినవాని వృత్తాంతం సేకరిస్తూ, మరణానికి కారణమేమిటని, తనమీద ఆధారపడిన వారికి ఏమైనా ఆధారం కలిపించబడిందా అంటూ అడగటం ప్రారంభించేసరికి మాటల్లో పడిన బృందం శవాన్ని దారిలో అక్కడే ఆపేశారు. సంభాషణ యింకా జరుగుతూనే వున్నందున అంతా తాత్కాలికంగా ఆగిపోయారు. యీరుచ్ భావంలో బాబా తన కార్యక్రమం పూర్తైపోయిన గుర్తుగా చప్పట్లు చరిచేంతవరకూ వారిని అలా ఆపాలనుకున్నాడు.

దైవీమానవుని యందుండే విధేయతకు ప్రియతముని సంతోషపెట్టడం తప్ప మరేదీ కోరాలన్న తలంపు రాదు. ఎవ రెన్ని రకాలుగా విమర్శించినా, మండలి మాత్రం, బాబా ఆజ్ఞల్ని తు. చ. తప్పక పాటించారు. యీ సన్నివేశం, నిజానికి యీరుచ్‌కో అగ్ని పరీక్ష అయినా, అంతలో బాబా చప్పట్లు విని పించాయి తన పని అయిపోయిందన్నట్లు. ఆ మరుక్షణంలోనే వారి సంభాషణ శపీమని ఆపేసి, ఒక్క వుదుటులో బాబాను సమీ పించేందుకు పరుగున వెళ్ళిపో[illegible]హాక బృందం

చివరలో వున్న వారికి, ముందేమి జరిగిందో అంతు పట్టలేదు. స్మశానం దగ్గరకొచ్చింతర్వాత రోడ్డు మీద ఎందుకు ఆగారో అర్థం కాలేదు. ఈ ఆలశ్యానికేదో సరైన కారణమే వుండి వుంటుందనుకున్నారు.

బాబా తన కార్యక్రమం పూర్తి చేశారు. తన మిత్రులంతా ఆయన దగ్గరకు చేరి బయలు దేరటానికి సన్నద్ధులై వున్నారు. అంతలో, శవ వాహకులు బయలుదేరి గేట్లోకి రాబోతున్నారు. శవం వుంచిన పెట్టెను చూపి, " అందులోని శవం తాలూకు ఆత్మ చాలా అదృష్టమైంది. శాశ్వత విశ్రాంతికై, తన భౌతిక శరీరాన్ని సమాధి చేయబోయేముందు, స్వయంగా నా సమక్షంలో వుండి నాచే ఆశీర్వదించబడటమంటే, అది ఎంత అదృష్టమో మీరు ఎరుగరు. " అన్నారు. ఆనాడు చేయవలసిన కార్యక్రమం పూర్తైంది. ఎంతో వుల్లాసంగా బాబా గోరీల దొడ్డి వదిలారు. అటువంటి భావాలు కలిగినప్పుడు, బాబా పెద్ద పెద్ద అంగలు వేసుకుంటూ చేతులు గబగబా వూపుతూ నడుస్తారు. చాలా హుషారుగా కనిపిస్తారు.

## నమ్మలేని సంఘటన

నవంబరు మొదటి పక్షమంతా ఔరంగాబాదు బాబాకు తాత్కాలిక కేంద్రస్థానంగా తయారైంది. నవంబరు 17 న, 16 వ శతాబ్దానికి చెందిన సద్గురు ఏకనాధమహారాజు యొక్క సమాధిని దర్శించేందుకు పైఠాన్ వెళ్ళారు. యీ పవిత్ర

స్థలాన్ని, సంవత్సరం పొడుగునా వేలాదిమంది యాత్రీకులు సందర్శిస్తూ వుంటారు. వీరి గురువు జనార్దనస్వామియొక్క సమాధి దౌలతాబాదు కోటలో వుంది. యీయన బాహ్యంగా గృహస్థు జీవనం గడిపినప్పటికీ అంతర్గతంగా, అత్యున్నత ఆధ్యాత్మిక ఔన్నత్యం అనుభవించాడు. మనం మన వేదాల్ని, వుపనిషత్తుల్ని ఎలా గౌరవిస్తామో, అలా మహారాష్ట్రులు తమ భాషలో వ్రాసిన భక్త ధ్యానేశ్వరుడు, ఏకనధుడు, తుకారాం, రామదాసుల జీవిత చరిత్రలను గౌరవిస్తారు. సంస్కృతంలోతప్ప మరేభాషలోనైనా ఆధ్యాత్మిక విషయాలు వ్రాస్తే నిందించే రోజులవి. అటువంటి రోజుల్లో పైవారి జీపిత చరిత్రలు, వారి సేవా కార్యక్రమాలను అంతా ఎంతో గౌరవభావంతో ఆదరించారు.

ఆ మర్నాడు బాబా " జాల్నా " వెళ్ళి అక్కడ వుండే " ఛల్లేవాలా బాబా " అంటే వ్రేళ్ళనిండా వుంగరాలుండే బాబాను కలిశారు. అన్ని చేతి వ్రేళ్ళకు డజన్లకొద్ది వుంగరాలు పెట్టుకొనే వాడు. బాబా అతనికోరిక మీద మెహెరాజాదు రమ్మని ఆహ్వా నించారు. ముందుగా వచ్చి ఆదీని కలవమన్నారు. యీడుచ్ ఆదీ చిరునామాని ఒక కాగితంపై వ్రాసియిస్తే, అతడ్ని తానే రమ్మ న్నట్లు గుర్తుగా దానిపై బాబా సంతకం చేసి యిచ్చారు. ఆ విధంగా బాబా మస్తుల ఆలోచనలకు, యిష్టాయిష్టాలకు అను గుణ్యంగా నడుచుకొనేవాడు. అయితే ఈ మస్తు మాత్రం. మెహెరాజాదు రానేలేదు. అందుకు కారణం బాబాకే తెలియా నవంబరు 19 నాటికి బాబా నా ... రాందేదు ...

ద్వారా ప్రసిద్ధిచెందింది. సిక్కుల పదోగురువు గురుగోవిందసింగు సమాధి యిక్కడ వుంది. తన శిష్యులకు అందించిన " గురు గ్రంధ సాహిబ్ " అనే గ్రంథ రాజము ఒక గొప్ప ఉద్గ్రంథం.

గురుగోవిందసింగు యుద్ధ ప్రియుడు. సిక్కుల్లో యుద్ధ తంత్రాన్ని రేపెట్టి వుద్రేకపరచాడు. మొగలాయి చక్రవర్తుల దాడుల్ని తిప్పికొట్టేందుకు బలమైన సేనావాహినిని తయారు చేశాడు. కానీ పరిస్థితుల ప్రభావంతో దక్కను పీఠభూమికి పారి పోవాల్సి వచ్చింది. ఆయన నాందేడులో వుండగా, శత్రువుల చేత ముట్టడించబడి తీవ్ర గాయాలకు లోనై చివరికి తన భౌతిక శరీరాన్ని వదిలేశాడు. సిక్కు మత స్థాపకుడైన గురునానక్‌తో ఆరంభమైన గురుపరంపర, ఈ విధంగా గురుగోవిందసింగుతో అంతమైంది. ఆయన యెడల గౌరవంతో నాందేడులో గురు ద్వారా అనే అతి సుందర పవిత్ర మందిరం నిర్మించారు. ఆ విధరిగా నాందేడు పట్టణం సిక్కులకు పవిత్ర యాత్రా స్థల మైంది. యీ గురు ద్వారాలో ఆధ్యాత్మిక వాతావరణాన్ని తిరిగి నింపుటకా అన్నట్లు, బాబా దానిని దర్శించారు. యింకా దాదాపు ఎనిమిదిమంది మస్తుల్ని నగరంలో కలిసి రైలుపై ఔరంగాబాదు చేరారు.

ఈ ప్రయాణంలో పాపం దౌలత్‌సింగుకు సుస్తీ చేసింది. జ్వరం ఎక్కువై చిక్కిపోయాడు. రానున్న మనోనాశ కార్య క్రమం దృష్టిలో [illegible] హెరాజాకొండ చేరేందుకు

చేసే ప్రయాణంలో అతడ్ని తమతో తీసుకువెళ్ళటం మంచిది కాదని భావించారు, ఆ మరుసటి రోజునే బెంగుళూరు వెళ్ళిపోయి తన యింటివద్ద కుటుంబంతో వుండిపొమ్మని ఆదేశించారు. తన ననుసరించి వచ్చేందుకు అంగీకరించినందువలన తనకెంతో సంతోషంగా వున్నదనీ, మరి అతని వలన ఎటువంటి తప్పు లేక పోయినా యింటికి పంపించివేయ వలసిందని చెప్పారు. బెల్గాంలో వున్నప్పుడు పంపించివేసినట్లుగాక, యీమాటు యింటికి పంపించి వేయబడటం బాబా ఆదేశాల మేరకే జరిగింది కనుక, అతడికి సంతోషంగానేవుంది. ఎంతో ఆనందంతో తన ఆజ్ఞను పాలిస్తున్న దౌలత్‌సింగును చూచి, బాబా ఎంతో సంతోషించారు. పెండూ బైదులు గుస్తాద్‌జీ, యీరుచ్‌లు వెంటరాగా బస్సుమీద బాబా టోకా వెళ్ళారు. టోకా, పవిత్ర గోదావరి నది వడ్డున వున్న ఒక చిన్న పట్టణం. 1928 లో జూన్ నుండి, నవంబరు వరకూ బాబా ప్రేమాశ్రమ బాలురతో యిక్కడ వున్నారు.

బాబా ప్రేమికుల్లో వున్న పాశ్చాత్యుల ప్రథమ బృందం ఈ టోకాలోనే బాబాని కలిశారు. ఇంగ్లాండునుంచి వచ్చిన మెరిడెత్ స్టార్, రష్యన్ సాధువొకరు, క్రిష్టియన్‌లీక్ మున్నగువారు బాబాను యిక్కడే కలిశారు. ఆ రోజుల్లో బాబాతో వుండే మండలికి ఈ జాగా బాగా నచ్చడంతో, దానికి క్రొత్త మెహెరాబాదు అని పేరు పెట్టారు. వనజీవనంలో బాబా బృందంతో యిక్కడ ఒక్క రోజన్నా గడపలేదు. భోజనంచేసి, కొద్ది విశ్రాంతి తరువాత, ' " వెళ్ళిపోయారు.

ఇక్కడే అనుకోకుండా, బాబా మిత్రులు, సరోష్ ఇరానీకి చెందిన లారీనీ కనుగొన్నారు. ఆయన బాబా శిష్యుడేకాక అహమ్మద్ నగరంలో ప్రసిద్ధి చెందిన ఆటోమొబైలు వ్యాపారి. దాని డ్రైవరుకు బాబా ఆయన బృందం బాగా తెలుసును. కాస్సేపు మాట్లాడుకున్న తరువాత, వారి సామాన్లు లారీపై తీసుకొని వెళ్ళుటకు అంగీకారం కుదిరింది. పెండూ, బైదులు లను వుండి, లారీపై సామాన్లు సర్దించి దగ్గరుండి, యిమాం పూరుకు భద్రంగా తెమ్మని ఆజ్ఞాపించారు. యిమాంపూరు అక్కడకు 12 మైళ్ళదూరం. బాబా గుస్తాద్‌జీ యీరుచ్‌లతో కలసి నడక సాగించారు. వాళ్ళు అలా నడుస్తుండగా దారిలో సరోష్‌గారి లారీ పైన పెండూ బైదులులు కూర్చొని వస్తూ కని పించారు. అప్పటికి సాయంకాలమైంది.

వాళ్ళు లారీని ఆపి, చీకటి పడవచ్చింది కనుక, బాబాని మిత్రులతోపాటు లారీ ఎక్కమని అడిగారు. అందుకాయన సమ్మతించారు. రాత్రి 9-00 లకు బాబా మిత్రులతో యిమాం పూరు చేరుకున్నారు. ఊరిబయట వున్న రహదారి బంగళా వద్ద ఆగారు. యిప్పుడది యిమాంపూరు మశీదుగా అభివృద్ధి చెందింది. దానికప్పట్లో కావలాదారు లెవరూ లేనందున, నిర్మాను ష్యంగా వుండేది. ఏమైనప్పటికీ బాబా ఆ రాత్రికి అందులో విశ్రమించ దలచారు. శిధిలావస్థలో వున్న ఈ బంగళాలో, బాబా నవజీవన ఘట్టంలో ఆ రోజు జరిగిన అనుభవాన్ని బాబా ప్రేమికు లెన్నటికీ మరిచిపో[illegible]

ఆనాడు యిమాంపూరు మశీదులో బాబా బసచేసిన రాత్రి విచిత్ర సంఘటన ఒకటి జరిగింది. దానికెంతో ప్రాముఖ్యత వున్నందున, యీరుచ్ చెప్పిన యీ సంఘటనని ఆయన మాటల్లోనే మీముందుంచేందుకు ప్రయత్నిస్తాను.

అది 21-11-1951 రాత్రి 9-00 గంటల సమయం. బాబా నవజీవన మండలి ఆఖరి మజిలీ, యిమాంపూరు మశీదు. హైదరాబాదు నుండి ఔరంగాబాదు మీదుగా దాదాపు 300 మైళ్ల ప్రయాణం చేసి, మెహెరాబాదుకు కొద్ది మైళ్ళ దూరంలో ఆగారు. మార్గ మధ్యంలో బాబా యధావిధిగా ప్రజా ప్రదర్శనలు, మస్తులు, పిచ్చివారు, పేదవారు, కుష్టురోగులు మున్నగు వివిధ తరగతి ప్రజలను కలుసుకోవటంతో, ఆనాడు ఎంతో అలసి వున్నారు. చీకటి పడేసరికి ఎక్కడైనా ఆ రాత్రికి విశ్రాంతి తీసుకోవటం మంచిదని భావించారు. రాత్రి 9 గంటలయ్యేసరికి, దారిలో యీ యిమాంపూరు అనే వూరు తగిలింది.

బాబా యీరుచ్‌ని పిలిచి, "అదిగో! చూడు! దూరాన ఏదో ఇల్లు కనపడుతోంది. ఈ రాత్రికి అందులో విశ్రమిద్దాం" అన్నారు. తీరా దాని దగ్గరకెళ్ళేసరికి అది ఓ పాడుపడ్డ రహదారి బంగళా. అయితే ఇప్పుడది యిమాంపూరు మశీదు అని పిలువబడుతోంది. ఒకప్పుడది బ్రిటీషువారి పరిపాలన రోజుల్లో అధికారుల విశ్రాంతి మందిరంగా వుండేది. స్వాతంత్ర్యానంతరం, ఆ వూళ్ళో వుండే మహమ్మదీయులు, దానిని తమకు మశీదుగా వుపయోగించేందుకు వప్ప[illegible]గితే, వారి కోరికని

మన్నించి, ప్రభుత్వం ఈ బంగళాని వారికి వప్పగించింది. అయినప్పటికీ సదరు మహమ్మదీయులు దానిని పరిశుభ్రంగా వుంచేవారు కారు.

బాబా తన మిత్రబృందంతో ఆనాటి రాత్రి చీకట్లో ఆ మశీదులో ప్రవేశించారు. అప్పుడది దుమ్ము కొట్టుకొని గదులన్నీ బూజు పట్టి వున్నయి. ధూళి దూసరమైన అంతర్భాగాన్ని తమ వద్దనున్న గొంగళితో దులిపి బాగుచేసి, బాబాకి ఒక గది శుభ్రం చేశాడు యీరుచ్. వారు ఈ గొంగళినే పడుకోవటానికి పక్కగా, కప్పుకోవటానికి దుప్పటిగా, ఎండ వానలకు ఆచ్ఛాదనగా అన్ని అవసరాలకి, సర్వోపయోగ వస్తువుగా వాడేవారు. అలవాటు ప్రకారం, బాబాకు భోజనపు ఏర్పాట్లు చేశారు. ఆయన భోజనమైన తర్వాత శిష్యుల్ని పిలిచి, వంతులవారీ కార్యక్రమం వివరించి యీరుచ్‌ని మొదటి కావలివానిగా ఏర్పాటు చేసి, తక్కిన వారిని దూరంగా పోయి పడుకోమన్నారు.

బాబా విశ్రాంతి కోసరం, మశీదు అంతర్భాగంలోనే వుండిపోయారు. యీరుచ్ ఆయన పడుకునేందుకు ఆయనకు కేటాయించిన గొంగళిని పక్కగా వేశాడు. బాబా పడుకోగానే ఈరుచ్ బయటకు వచ్చి తలుపులు వేసి, గుమ్మంలో కావలి కాస్తున్నాడు. తక్కిన శిష్యులు, మశీదుకు వెలుపలి భాగంలో పడుకున్నారు. కొంత రాత్రి గడిచేసరికి, బృందంలోని మిత్రులెవరో గుర్రక పెట్టటం, బాబాకు నిద్రాభంగం కలిగించింది. న్యాయానికి మి[illegible]ద గజాల దూరంలో చెట్టు

క్రింద పడుకున్నవారి గురక, మశీదు గదిలో తలుపులు వేసుకుని పడుకొన్న బాబాకి నిద్రాభంగం కలిగించిందంటే ఆశ్చర్యమే ! మరో అర్ధగంట గడిచేసరికి, మళ్లీ గురకవంటి శబ్దం వినవచ్చేసరికి బాబా చప్పట్లు కొట్టారు. వెంటనే యీరుచ్ తలుపు తీసి, లోనికి వెళ్లి బాబా పిలుపుకు కారణమడిగాడు.

అది నిశిరాత్రి. లైట్లు లేవు. చీకటి గాఢాంధకారం. టార్చిలైటన్నా లేదు. అందుచేత బాబా సౌంజ్ఞల్ని గమనించేందుకు వీలుగా, యీరుచ్ తన వద్ద వుంచుకున్న అగ్గిపెట్టె తీసి పుల్ల వెలిగించి, ఆయన సౌంజ్ఞలకు ఎదురుచూడసాగాడు. బాబా సౌంజ్ఞలుచేస్తూ, "నా ఏకాంతానికి భంగం కలిగిస్తూ, ఎవరో ఏదో శబ్దం చేస్తున్నారు. మండలివారు కానీ, దగ్గర్లో పడుకున్నారేమో చూచి వారిని లేపి ఇంకా దూరంగా వెళ్లి పడుకోమని చెప్ప" మన్నారు. ఆజ్ఞా బద్ధుడైన ఈరుచ్ వెంటనే అలసి సొలసి, సొమ్మసిల్లి గాఢనిద్రలో మునిగివున్న మండలి సభ్యుల్ని లేపి, బాబా ఆజ్ఞ తెలిపి, దూరంగా వెళ్ళి పడుకో మన్నాడు.

వంతులు వారిగా వచ్చేందుకు తనకు చేరువలోనే పడుకున్న బైదులు, గుస్తాద్‌జీ, పెండూలను కూడ దూరంగా వెళ్లి పడుకోమన్నాడు. తను మాత్రం గది గుమ్మందగ్గరే కాపలా కాస్తున్నాడు. కాసేపటికి బాబా మళ్ళీ చప్పట్లు కొట్టారు. అగ్గిపుల్ల గీచి దాని వెలుతురులో లోనికి వెళ్ళేసరికి, బాబా ఇంకా ఏదో రణగొణధ్వని వినపడుతోంది చు[illegible]పంలో ఎవరూ

లేరు. కానీ ఆయన ఏదో శబ్దం వినపడుతోందంటున్నారు. ఈరుచ్ ఆశ్చర్యపోయాడు. అంతా అయోమయంగావుంది. అతడ్ని కాసేపు గదిలోనే కూర్చొని, ఆ వినపడే ధ్వనేమిటో గమనించ మన్నారు.

అనుకోకుండా ఏదో పక్షి తన రెక్కలు రెపరెపలాడించటం వినిపించింది. ఈ వివరాన్నే బాబాకి చెప్పాడు. ఈ గదిలో ఏమూలో గూడు వుండి వుంటుంది. అదెక్కడ వున్నదో చూస్తా నని చెప్పాడు. ఆ సమయంలో బాబా నేలపై ఒక గొంగళి పరుచుకొని దానిమీద పడుకున్నారు. మరో గొంగళి కప్పుకు న్నారు. నవజీవన కాలంలో అందరికీ తలాఒక గొంగళీ ఇవ్వ బడింది, గొంగళీ అంటేగొర్రె బొచ్చుతో నేయబడి, ముతకగా వుండే రగ్గు లాంటిది. బాబా తన గొంగళి కప్పుకుంటారు గనుక, ఈరుచ్ తన గొంగళిని పక్కగా వేశాడు.

ఆయన నేలపై పడుకున్నందున, మళ్లీ ఏమి ఆజ్ఞలు జారీ చేస్తారోనని అగ్గిపుల్ల గీచి ఎదురు చూశాడు. అనవసర శబ్దం చేస్తూ ఏకాంత భంగాన్ని కలిగించిన ఆ పక్షిని వెతికి పట్టుకొని బయట పారేయమని, బాబా ఆజ్ఞాపించారు. ఆ మరు క్షణంలోనే మారు ఆలోచన చేయక, కారు చీకట్లో వెతుక్కుంటూ గూటిని సమీపించాడు. గూట్లోని పక్షిని పట్టి బయట పారవేయ టానికి సిద్ధంగా వున్నాడు. అంతలో బాబా అకస్మాత్తుగా మళ్లీ చప్పట్లు కొట్టారు. ఆయన కొట్టే చప్పట్లు రకరకాలుగా వుంటయి. మా[illegible] రమ్మనమని పిలిచినప్పుడు

ఒక రకంగా వుంటయి. వెంటనే వున్నపళాన రమ్మన్నప్పుడు మరో రకంగా వుంటుంది. "క్షమించాల్లేబో !" అన్నప్పుడు, వేరే రకంగా వుంటుంది. యిలా అవసరాన్ని బట్టి రకరకాల చప్పట్లు కొట్టేవారు.

ఇప్పుడు చేసిన శబ్దం, వున్నది వున్నట్లు వదిలేసి, వెంటనే వచ్చేయమని ఇచ్చిన ఆదేశం. ఈరుచ్ ఈ శబ్దాన్ని చప్పట్ల రూపంలో విని పక్షిని గూట్లోనే వదిలి బాబా అజ్ఞకై ఆయన దగ్గరకు వచ్చాడు.

నవజీవనంలో అనుచర మిత్రులు బాబా ఇచ్చే ప్రతి ఆజ్ఞ తు. చ. తప్పక పాటించాలన్నది ఓ షరుతు. మొదట్లో గూట్లో రెక్కలు తపతప లాడిస్తున్న తల్లిపక్షిని పట్టి బయటకు గిరవా టేయమన్నారు. మళ్లీ ఇప్పుడు దాన్ని గూట్లోనే వదిలి వెంటనే తన చెంతకు రమ్మన్నారు. ఈరుచ్ ఆజ్ఞాబద్ధుడై రెండాజ్ఞల్ని నిర్వహించాడు. బాబా చెంతకు వచ్చేసరికి, "పక్షిని బయట పారే శావా ?" అని ప్రశ్నార్థకంగా సౌంజ్ఞ చేశారు. "లేదు బాబా !" అన్నాడు ఈరుచ్. మంచి పని చేశావు. అంటూ సౌంజ్ఞలు చేయటం మొదలెట్టారు. మొదట్లో నేనిచ్చిన ఆజ్ఞను నీవు మరచావా ? "నేనిప్పుడు ముందుగా చేయమన్నచర్య నాయొక్క క్రూరత్వాన్ని తెలుపుతుంది. మనం చాలా ఘోరమైన తప్పిదాన్ని చేశాము. అటువంటి ఆజ్ఞ ఈయటం ఎంతమాత్రం సమంజసం కాదు. ఆ పక్షిని గూట్లోనే వుండిపోనీ. మన నియమాన్ని నీవప్పుడు ఎందుకు గుర్తు చేయలేదు ? ... ారు.

"క్షమించు బాబా! నేనా నియమాన్ని పూర్తిగా మర్చిపోయాను." అన్నాడు. ఇక్కడ మనం ఒక ముఖ్య విషయం గుర్తుకు తెచ్చుకోవాలి. నవజీవనం ప్రారంభించటానికి ముందు యిచ్చిన నియమాల్లో అతి ముఖ్యమైన నియమం ఇతరులకు బాధలు కలిగించేవి కోపం, దుష్ట భావాలతో ఇచ్చే ఆజ్ఞలు జారీ చేసినప్పుడు, అది నియమోల్లంఘన అని మండలివారు బాబాకు జ్ఞాపకం చేయాలి. మరియిప్పుడు బాబా నిరపరాధియైన నోరులేని పక్షిని తన బిడ్డలకు దూరం చేస్తూ బయట పారవేయమని ఆజ్ఞాపించినప్పుడు, ఈరుచ్ "అది నియమోల్లంఘనకదా!" అని బాబాకు గుర్తుచేయలేదు. దాన్నే ఇప్పుడు ఈరుచ్‌కి గుర్తు చేశారు. అందులోనూ అలాంటి సందర్భాల్లో నియమోల్లంఘనలను బాబాకు గుర్తు చేయవలసిన బాధ్యత ఈరుచ్ పైనే వుంది. ఈరుచ్ తనకు వప్పగించిన బాధ్యతను మరిచిపోయి, బాధ్యతా రహితంగా ప్రవర్తించాడు. బాబాయే విరుద్ధంగా క్రూరమైన ఆజ్ఞ యిచ్చినప్పుడు, గురువు ఏం చెబితే శిష్యుడలా చేయాలన్నదే తన ఆరాటం తప్ప, ఆయన ఆజ్ఞ పొరపాటుదని, నియమోల్లంఘన క్రిందికి వస్తుందని ఆలోచించలేక పోయాడు. అది నియమ విరుద్ధమైన ఆజ్ఞ అని గుర్తుచేయుట మరిచి, ఘోరమైన తప్పిదం చేశాడు ఈరుచ్.

## ప్రక్షాళన ప్రాయశ్చిత్తం

ఈ సంఘటనంతా నిశిరాత్రి జరిగింది. అప్పుడు బాబా ఈరుచ్‌తో, "స[illegible] జరిగింది. నీవా పక్షిని పారేయ

లేదు. మంచి పని చేశావు. ఒకవేళ అలా పారవేసి వుంటే ఈ నవజీవన యాత్రంతా సర్వనాశనమై పోయేది. ఏమైనప్పటికీ మనం నవజీవన సమయంలో ఘోరమైన తప్పిదం చేశాము. ఇహ దీన్ని గురించి బాధపడవద్దు. జరుగరాని తప్పు జరిగి పోయింది. దీనికి ప్రాయశ్చిత్తం జరగాలి. పోయి బయట కూర్చో ! మళ్లీ రేప్పొద్దుట దీన్ని గురించి నాకు గుర్తు చేయ'' మని చెప్పారు.

ఉషోదయమైంది. మండలి అంతా లేచారు. ఆ రోజే వారంతా నవజీవన కాలం పూర్తిచేసుకొని మెహెరాజాదు చేరుకోవాలి. బాబా తన గది నుండి బయటకు వచ్చేసరికి, అంతా తయారై, ఆయనకు చేయవలసిన సేవలో పాలు పంచుకొనుటకు సిద్ధంగా వుండటం వారి ఆచారం. ఒక్కొక్కప్పుడు, రాత్రంతా ఆయన వద్దనే గడుపుటవలన, కొందరికి అర్ధగంట కూడ విశ్రాంతికి వ్యవధి వుండదు. అయినప్పటికీ వారు తక్కిన వారితోపాటు, సమయానికి తయారుగా వుండి తీరాల్సిందే. మామూలుగా రోజూ, తనను సేవించుకొనేందుకు వీలుగా శిష్యులందరికీ అవకాశం కలిపిస్తారు బాబా. ముఖ్యంగా వుదయాన్నే ముఖ ప్రక్షాళనకు సహాయ పడటంలో శిష్యులందరికీ అవకాశమిస్తారు.

ఆయన అటువంటి పనిని తానే స్వయంగా చేసుకోకలిగినప్పటికీ, కావాలని, సేవచేసుకొనే [illegible]న్ని ఈ విధంగా

యితరులకు అవకాశాన్ని కల్పిస్తూ వుంటారు. ముఖం కడిగింపు సేవా కార్యక్రమంలో ఒకరు, ఆయన చేతులలో నీరు పోస్తే తన ముఖం కడుక్కుంటారు. మరొకరు సబ్బును తన చేతులతో అరగదీసి, ఆ నురగతో ఆయన ముఖం రుద్దాలి. వేరొకరు ఆయన చేతులలో నీరుపోస్తే తానే స్వయంగా తన ముఖాన్ని శుభ్రం చేసుకుంటారు. ఆ తర్వాత వేరొకరు టవలుతో సిద్ధంగా వుండి, బాబా ముఖాన్ని టవలుతో తుడవాలి. నిజానికివన్నీ చూడటానికి స్వల్ప విషయాలే! కానీ ఆ విధంగా తనను సేవించుకొనే భాగ్యాన్ని అవకాశంగా తన శిష్యులకిచ్చేవారు. న్యాయానికి యిటువంటి స్వల్ప విషయాలు యితరులతో చేయించుకోవటం, ఆయనకు బాధాకరమే! అయినప్పటికి ఆయన అనంతుడగు ప్రియతముడైనందున, వీటన్నిటినీ భరించి, దివ్య ప్రియతముని సేవా కార్యక్రమంలో పాలు పంచుకొనే అదృష్టాన్ని యితరులకు కలిపించే వారు. తనకు సహాయపడే అవకాశమిచ్చి, ఆ పని చేసేటప్పుడు, " మనం అవతారునికి సేవ చేస్తున్నామన్న" భావం వారిలో కలిగేలా చేశేవారు.

ఆ వుదయం బాబా తన గది నుండి బయటకు రాగానే ఈరుచ్ బాబాకు ముఖం కడిగింపు సేవ చేశాడు. బాబా పడుకున్న గది ప్రక్కనే చిన్న స్నానాల గది వుంది. ఆ గదిలో బాబా ముఖ ప్రక్షాళన కార్యక్రమం నిర్వహించాడు. అది కాగానే యారుచ్‌తో గుస్తాద్‌జీ బైదులు పెండూలను పిలుచుకు రమ్మన్నారు. నవజీవ[illegible]స్తున్న పాదయాత్ర, భిక్షాటన

కార్యక్రమాలకి ఆఖరి రోజదే ! తక్కిన ముగ్గురి శిష్యుల్ని వెంట బెట్టుకొచ్చాడు. యీరుచ్ రాగానే రాత్రి జరిగిన కథంతా విన్నారు. అప్పుడు బాబా కలిపించుకొని " ఇదంతా యీరుచ్ మూలాన జరిగింది. ఇది అతడు చేసిన ఘోర తప్పిదం ! " అని సౌంజ్ఞ చేశారు.

యితరులకు హాని కలిగించే ఏ ఆజ్ఞ యిచ్చినా ఆ విషయాన్ని బాబాకు గుర్తు చేయవలసిన బాధ్యత యీరుచ్‌ది. కానీ ఇతనలా ప్రవర్తించ లేదు. అతి క్రూరమైన పాపానికి ఒడిగట్టాడు. పాపమా పక్షి తన పసిగుడ్డులతో రాత్రి పూట తన గూట్లో విశ్రమించింది. తన బిడ్డల సంరక్షణలో రెక్కలాడించి కొంత ధ్వని చేసింది. అంత మాత్రంచేత దాని తప్పేమిటి ? ఈ మాత్రం చిన్న తప్పుకి, నోరులేని ఆ పక్షి ఎడల బాబా ఎందుకంత క్రూరంగా ప్రవర్తించారు. ముఖ్యంగా ఈ వివరణను ఈరుచ్ గుర్తు చేసి యుండవలసింది. కానీ అతడు నియమాన్ని మరిచాడు. ఫలితంగా బాబా ఆ పక్షిని పట్టి బయట పారవేయ మన్నారు. ముఖ్యంగా నవజీవనంలో యిది జరుగరాని ఘోర సంఘటన.

ఇదంతా ఈరుచ్ చెబుతుంటే, బాబా కలిపించుకొని " అసలు నీవు నాకెందుకు గుర్తు చేయలేద"ని మళ్లీ అడిగే సరికి " బాబా ! అది నా పొరపాటు. ఆ సమయంలో నీతో వాదించ కూడదనిపించింది. అందుకని మారు మాట్లాడక, నీ ఆజ్ఞ జవదాటరాదన్న భావంతో నీవు చె[illegible]ను " అన్నాడు.

అది విన్న బాబా "సమాయానికి నేను కలిపించుకొని అతడా పని చేయకండా ఆపి పక్షిని గూట్లోనే వదిలి రమ్మనమని పిలిచాను. అందుకు కారణం అసలు విషయం ఈరుచ్ మరిచాడని నాకు తెలుసు. దానికంతకూ మూల కారణం నేనే ! యీ తప్పుకు తగిన శిక్ష జరిగితీరాలి. మీరంతా నవజీవన మిత్రులు. మీరు మెదలకండా వున్నప్పటికీ, దీనికంతకూ మూల కారకుడ్ని నేను. యిటువంటి తప్పును సరిదిద్దేందుకు నన్ను నేనే శిక్షించుకోవాలి. రాత్రి జరిగిన దానికి ప్రాయశ్చిత్తం జరిగి, పరిపూర్ణ సంతృప్తి కలగాలంటే మీరంతా మీమీ చెప్పులు చేత పుచ్చుకొని నిశిరాత్రి గూట్లో గ్రుడ్లను పొదుగుతున్న నిరపరాధియైన తల్లి పక్షిని అతి క్రూరంగా బయట పారవేయమని ఆజ్ఞాపించిన, నన్ను మీ ఇష్టం వచ్చినట్లు బాదండి. " అని ఆదేశించారు.

అది బాబా ఆజ్ఞ కావున శిష్యులు నలుగురూ కలిసి ఆ పని చేయవలసివచ్చింది. ఇది శిష్యులకొక అగ్ని పరీక్ష కూర్చొంది. ఆయన ఆజ్ఞ శిరసావహించాల్సిందే ! కానీ శిష్యులు తనను చెప్పులతో బాదమని ఆజ్ఞాపించినప్పటికీ, ఆయన శరీరాన్ని అనేట్లు చెప్పుల్ని తాకించి తీశారు. దాంతో బాబాకు కోపం వచ్చింది. ఆయనకు నటన పనికిరాదు. బిడియమసలే లేదు. తన ఆజ్ఞలను అతి సహజంగా పాటించాలి. తనను కొట్టమన్నప్పుడు ఎలా కొట్టాలట? " నీకు కోపం వచ్చినప్పుడు, ఎదటి ప్రత్యర్థిని నీ బూటు కాలితో ఎంత బలంగా, ఎంత విసురుగా తంతావో అంత బలంగా మీ చెప్పులతో న[illegible]ట్టాలి " అని మందలించారు. చేసేది

లేక గుర్వాజ్ఞ పాటిస్తూ దబదబా ఆయన వీపుపై నలుగురూ తమ చెప్పులతో బాదారు.

బాబా అంతటితో ఆగలేదు. తిరిగి ఆ నలుగుర్నీ కాండ్రించి తనపై వుమ్మివేయమన్నారు. ఆ తర్వాత తన చెవులను తానే పిండుకొన్న తర్వాత ప్రాయశ్చిత్త కార్యక్రమం పూర్తైంది. అప్పుడు బాబా సౌంజ్ఞలతో " మనం సకల ప్రాణుల యెడల భూతదయ కలిగి వుండాలి. " అని చెప్పారు. బాబా యిప్పుడు దేదీప్యమానంగా వెలుగొందుతూ కనిపించారు. తన కుడి చేతితో ఎదురు రొమ్ము రుద్దుకుంటూ, " నాకిప్పుడు ఎంతో తృప్తిగా వుంద" న్నట్లు సౌంజ్ఞ చేశారు. యీ విధంగా బాబా కలిపించే సంఘటనల్లో, దాగివున్న గూడార్థం, మనకర్థం కాదు. కనీసం వూహించలేము కూడ. దాని భావ మేమిటో ఆయనకే తెలియాలి. తప్పంతా తనమీదే వేసుకొని, అవమాన భారాన్ని తానే మోసి, తన సన్నిహిత మిత్రుల చేత చెప్పుదెబ్బలు తిన్నారు. ముఖాన వుమ్మేయించుకున్నారు. ఏమి గుణ పాఠం !

యీ సంఘటన వెనుక, దాగి వున్న సత్యాన్ని గూర్చి, యారుచ్ యీ విధంగా చెబుతాడు. "యిది పొరపాటు కాదు. ఒక అవకాశం మాత్రమే ! ఆయన తన శరీరంపై కలిపించుకొనే ప్రతి సంఘటనా, మానవాళి కిచ్చే మహోపకారం ! అది ఒక అవకాశం. యీ భూమిపై వుండే ప్రతి జీవి ప్రతి మానవుడు, ఎలా సంచరించాలో నిరూపించే సంఘటన యిది" అంటాడు. తన శిష్యులకు భోగమయ వాతావరణం [illegible]ర్వ సంగ

రాహిత్యం కలుగుటకై, కఠోరమగు తపస్వి జీవనం సమకూర్చుటకు, ఈశ్వరావస్థానం నుండి దిగివచ్చి మానవ రూపంలో మానవుల మధ్య మానవుడుగా వుంటూ, యిది మానవునిగా ఆయన చేసిన తప్పని ఇతని భావం. మానవునిగా తప్పు చేశారు. ఆయన ఎన్నడూ మానవునిగా మాత్రం సంచరించలేదు. కానీ మానవునిగా వున్నారు. అదే ఆయన చేసిన తప్పు. దైవీ మానవుని ప్రేమ తత్వమే అంత. ఇతరులు చేసిన తప్పులన్నీ తన తప్పులుగా భావించి, వాటి ఫలితాన్ని తన పైనే అనుభవించు కొనేటట్లు చేసుకుంటారు.

దైవం చేసే ముఖ్య కార్యక్రమం, మాటిమాటికీ మానవుల మధ్య మానవుడై అవతరించి, మానవుల్లో మానవుడుగా కలిసిపోతాడు. తాను మానవునిగా మారాడు కనుక, మానవ స్వభావాన్ని ఆపాదించుకుంటాడు. మానవాళి యొక్క బాధల్ని తాను పంచుకొని, తనపై పెంచుకొంటేనే తప్ప, వారి బాధల్ని పంచుకొనేందుకు ఆయనకు అవకాశం లేదు. అందుకే బాబా సాంగత్యంలో పై విధమైన సంఘటనలనేకం జరుగుతూ వుంటయి. మానవునిగా తాను చేసిన తప్పు, భగవంతునిగా చేసిన తప్పు కాబోదు. అది కేవలము ఒక మానవుడు చేసిన తప్పు మాత్రమే ! దైవీ మానవుడుగా ఆయన మానవాళికిచ్చిన సందేశమేమంటే, ఆ రకమైన తప్పులు యిహ మన మెన్నడూ చేయరాదని. ఒకవేళ పొరపాటునో, లేదా మన బలహీనత వలననో, అటువంటి తప్పు చేస్తే, వాటిని సరిదిద్దుకొనేందుకు అనేక సాధనాల

ప్రతివారు నియమ బద్ధులై వుండాలి. విధేయులై వుండాలి. కోపతాపాల్ని అదుపులో వుంచుకోవాలి. ఇటువంటి నడవడిక కలిగి వుండాలని బోధించుటకే, తానునుభవించి, మనకు చూపే కార్య విధానం. యింత చిన్న రహస్యాన్ని ప్రేమమయుడుగా, బాబా మనతో పంచుకుంటున్నాడు. పై నలుగురు శిష్యులు యీ తత్వాన్ని బాగా జీర్ణించు కున్నారు కనుకనే, అత్యంత విధేయులుగా వుండేందుకు తర్ఫీదు పొందారు. ఆయన ఆజ్ఞను పాటించి, చెప్పులుతో కొట్టమంటే కొట్టారు. వుమియమంటే ఉమ్మి వేశారు. ఏం చేయమంటే, అది చేశారు.

వారు యంత్రాలవంటి వారు. తు. చ. తప్పక గుర్వాజ్ఞ పాటించేవారు. అందుకే, యీ సంఘటన జరిగింతర్వాత వారూ హృదయమున్న మానవులే కావున, మరెన్నడూ అటువంటి సంఘటనలు జరుగకుండా జాగ్రత్తపడి, శాశ్వతంగా జ్ఞాపకం వుంచుకున్నామంటాడు యీరుచ్. ఇతని దృష్టిలో ఒక విధంగా బాబా ఆజ్ఞలకు బద్ధుడై అటువంటి పనులు చేశానంటాడు. మరో రకంగా ఆలోచిస్తే, తాను ముందుగానే నవజీవన నియమోల్లంఘన గురించి గుర్తు చేసివుంటే, దైవీ మానవుని కేవిధమైన అపచారం జరిగివుండేది కాదని బాధపడతాడు.

ఎంతో ఆవేదనతో యీ సంఘటన గుర్తుతెచ్చుకొని, యీరుచ్ అశ్రునయనాలతో చెపుతూ, "నేనాడు బాబా ఆజ్ఞని ముందుగానే గుర్తుచేసి వుంటే, యీ దుర్ఘటన జరిగి వుండేది కాదు. ఇది నా నిర్లక్ష్యానికి నిదర్శ[illegible] అయితే బాబాయే

కావాలని, నన్ను మరిచేటట్లు చేసి, యీ సంఘటనని కల్పించారేమో మరి ” అంటాడు. ప్రతి విషయంలోను, మనల్ని మరిచి పోయేటట్లో, గుర్తుంచు కొనేటట్లో, మంచిగానో, చెడుగానో, ఏవోపనులు చేసేటట్లు బాబాయే చేస్తూ వుంటారు. చేసేవాడూ ఆయనే. చేయించుకొనేవాడూ ఆయనే ! మనం కేవలం మానవులం. నిమిత్త మాత్రులం. అవతారుని లీలలు మనకు అర్థం కావు. బాబా నవజీవనంలో జరిగిన ఘట్టాలు కొన్ని మరువలేనివి. అందులో “ పావురపు గూడు ” అనే పేరుతో ప్రశిద్ధికెక్కిన పై ఇమాంపూరు సంఘటన జీవితంలో మరువలేనిది.

## తెంబికొండకు చేరిక

నవంబరు 23 వుదయం, నవజీవన ఘట్టంలో ఆఖరి కాలి నడక ప్రయాణం ఆరంభమైంది. ఇమాంపూరు నుండి మెహెరాజాద్ 12 కిలోమీటర్ల దూరం వుంటుంది. తన నలుగురు అనుచరులతో బాబా, మెహెరాజాద్ ఎస్టేటులో కాలు పెట్టకుండా అడ్డదారిని తెంబికొండ దగ్గరకు చేరారు. యిప్పుడీ తెంబికొండనే ఏకాంతవాస పర్వతం అంటున్నారు. అంతకు ముందు కొద్ది రోజుల క్రితమే, స్త్రీ పురుష మిత్రులు తిన్నగా హైదరాబాదు నుండి, మెహెరాజాద్ చేరుకున్నారు. వారు బాబాను చూచేందుకు అనుమతించలేదు. అయితే, మణీ, మెహెరా లిరువుర్ని మాత్రం తెంబికొండ పర్వతపాదం వద్దకు వచ్చి తనను చూచేందుకు అనుమతించా[illegible]

బాబా తెల్లటి దుస్తులు, ఆకుపచ్చ తలపాగా ధరించి, ప్రశాంతవదనంతో అతి గంభీరంగా, ఎంతో అందంగా కనిపించారు. శారీరక, ఆధ్యాత్మిక బాధ లెన్ని వున్నా ఆయన చిరునవ్వుతో, వెలిగిపోతూ వుంటారు. కొద్ది నిమిషాలు, మెహెరా మణిలతో గడిపి వారి కుశలములు విచారించారు. తరువాత శిష్యుల్ని వుండిపొమ్మని తాను వంటరిగా పర్వతాగ్రానికి బయలుదేరారు. వడి వడిగా నడుచుకుంటూ కొండ రెండవ వైపుకు చేరుతుండగా శిష్యులవైపు వెనుతిరిగి, కొద్దిసేపు తదేకంగా చూచారు. తర్వాత తిరిగి వెళ్ళిపొమ్మన్నట్లు చేతులూపి సౌంజ్ఞ చేశారు. తానొక్కరే ఒంటరిగా శిఖరాగ్రానికి చేరుకొన్నారు. సూదిమొనలా కొసతేలిన కొండ చివరి భాగంలో బాబా కోసరం క్యాబిన్ కట్టబడింది. ఆశ్రమం వున్న వైపున కొండ ఏటవాలుగా వుండక, నిట్ట నిటారుగా వుండి పైనుంచి చూస్తే అఖాతంలా కనపడుతుంది క్రింది నేల

ఆ కొండ శిఖరాగ్రంలో శిధిలావస్థలో వున్న గదులు రెండుండేవి. ఒకప్పుడు బాబా వాటిల్లో ఏకాంతవాసం గడిపారు. అవి పూర్తి శిధిలావస్థలో వుండుట వలన, పాడ్రి చేత వాటిని ముందుగానే బాగుచేయించారు. పాడ్రి ఆ రెండు క్యాబినులను బాగుచేయటమే కాక, వాటికి దిగువ కొంత దూరంలో కాన్వాసు గుడ్డతో తాత్కాలిక గుడారాన్నొక దానిని, నలుగురు మిత్రుల కోసరం నిర్మించాడు. అన్నపానీయాల కోసరం అన్ని ఏర్పాట్లు జరిగాయి. తన కోసరం ఏర్పాటైన గదు[illegible]లా ఇరుకుగా

వున్నందున, బాబా పగటి పూట క్రింది గదిలో వుండి, ఏకాంతవాసం గడుపుతూ తన కార్యక్రమం చేసేవారు. అందువలన, పగటి పూటంతా శిష్యులు నలుగుర్ని దూరంగా పొమ్మనేవారు. పాపం వారు గుడారం వదిలి దూరంగా పోయేవారు. మళ్ళీ రాత్రయిన తర్వాత, గుడారం లోనికి వచ్చేవారు. చీకటి పడగానే బాబా, శిఖరాగ్రంలో వున్న గదిలో విశ్రమించేవారు. శిష్యులున్న గుడారం, బాబా గదికి, క్రిందుగా వుంటుంది. గుడారం వద్ద వున్నవారికి బాబా గది, వారి నెత్తికి తిన్నగా వున్నట్లు కనపడుతుంది. ఒక వేళ రాత్రి సమయాల్లో బాబా చప్పట్లతో, కావలి వున్న శిష్యుడ్ని పిలుస్తే అడుగులో అడుగు వేసుకుంటూ జాగ్రత్తగా నడుచుకుంటూ వెళ్ళాలి. ఒక వేళ జారాడో, దొర్లుకుంటూ కొండ క్రిందికి పడిపోతాడు.

అందుకని మొదట్నించి, శిష్యుల కోసరం నిర్మించిన డేరా బాబాకి నచ్చలేదు. అందుచేత పాద్రిని పిలిపించి, కొన్ని మార్పులు, చేర్పులు సూచించారు. అది నవజీవనం కానీ, పూర్వజీవనం కానీ, ఏ జీవనమైనప్పటికీ, ఎప్పటి కప్పుడు సృజనాత్మకమైన ఆదేశాలివ్వడం ఆయన ప్రత్యేకత. డిశంబరు 8 నుండి నాలుగు రోజులుపాటు కేవలం మంచినీళ్ళు మాత్రం త్రాగి పూర్తి వుపవాసం వున్నారు. తరువాత మూడు రోజులు ద్రవాహారం మాత్రమే తీసుకున్నారు. అసలు హైదరాబాదులో వున్నప్పుడే ఆయన ఆరోగ్యం బాగా చెడిపోయింది. మనో నాశన కాలం పూర్తయ్యేంత వరకూ తన భౌతికపరమైన, శారీరక రుగ్మతల గురించి [illegible]ంచు కొనుటకు తిరస్కరించారు.

కాలి నడక ప్రయాణం, కార్యక్రమంలో అవకతవకలు, తరచు వుపవాసాలు మూలంగా ఆయన ఆరోగ్యం బాగా క్షీణించింది. డిశంబరు మొదటివారం నుండే తరచు శిష్యులతో డిశంబరు 16 నుండి ప్రారంభమయ్యే నవజీవన అంతిమఘట్టం, పర్వతాగ్ర భాగంలో వుంటే అనుకూలంగా వుండదని చెపుతూ వచ్చారు. "నాకు యింట్లో వున్నట్లుండాలి, కానీ మండలికి దూరంగా వుండాలి " అన్నారు. సాధ్యమైనంత వరకు, తన కార్యక్రమం స్వేచ్ఛతో చేసేందుకు వీలుగా ఏకాంత ప్రదేశమై వుండాలన్నారు. అందుకే కొండ అగ్రభాగం అనుకూలంగా లేనందున, కొండ క్రింద మెహెరాజాదు పరిసరాల్లో బాగుంటుందని సూచించారు.

## ఏకాంతవాస కొండ ఖాళీ చేశారు

మెహెరాజాదు ఆశ్రమంలో యిప్పుడున్న బ్లూ బస్సుకి చేరువలో వుండే మండలి హాలుకు దూరంగా దొడ్డిని వేరు చేస్తూ అనువైన వసతిని బాబా సూచనల మేరకు పాద్రీ చేత కట్టించే ఏర్పాటు చేశారు. డిశంబరు 14 లోపల దాని నిర్మాణం పూర్తి కావాలని ఆదేశించారు. కొండ మీద క్యాబిన్లు వెంటనే వూడ బెరికి క్రిందకు చేరిస్తే గడువు లోపల కట్టగలనని పాద్రి హామీ యిచ్చాడు. కొండమీది రెండు క్యాబిన్లు కలిపి, ఒకే గదిగా వచ్చేట్లు కడితే, తన కార్యక్రమం నెరిపేందుకు వీలుగా వుంటుందన్నారు. అందుకు పాద్రి, అలా చేసేందుకు కొంత వ్యవధి అవసరమని, అంతవరకూ బ్లూ బస్సు సమీపంలో అన్ని హంగులతో వున్న ఏదో ఒక గదిలో వు[illegible] బాగుంటుందని

సూచించాడు. అందుకు బాబా ఎట్టి అభ్యంతరం చెప్పక, అంగీకరించారు. యీరుచ్, గుస్తాద్‌జీ, బైదుల్, పెండూలకు, కొండమీది క్యాబిసులు వూడబెరికి క్రిందికి చేర్చే పని వప్ప చెప్పారు. బాబా క్రిందకు వచ్చేశారు.

అప్పటివరకూ తాను తెంబి కొండపై చేసిన పని మధ్యలో తెగిపోకుండా వుండాలంటే, ఒక మంచి మస్తును తీసుకు వస్తే రోజూ బ్లూ బస్సు వెనుక వున్న గదిలో అతనికి సేవ చేస్తూ ఆ బంధం కొనసాగిస్తానన్నారు. బైదులుతో, ఎవరైనా మంచి మస్తుని వెతికి తీసుకురమ్మన్నారు. కొండమీద కట్టడాలు వూడ దీసి, రేకులు, గడ్డలు, బోల్టులు నట్లుతోసహా అన్నీ క్రిందికి చేర్చి, బాబాకి తెలుపగా, మెహెరాబాదు నుండి పాద్రిని పిలిపించారు. కొండమీది నుంచి తెచ్చిన సామాన్లు వుపయోగించి ఒక గది అమర్చమని ఆదేశించారు. ఆనాడు అలా తయారుచేసిన క్యాబినే, యీనాడు యీరుచ్ వుంటున్న గది.

ఆ గది తయారయ్యేంత వరకూ, పై నలుగురు శిష్యుల్ని కొండపైనే గడపమన్నారు. తాను మాత్రం బైదులు తానానుంచి తెచ్చిన మస్తుకు సేవ చేస్తూ బ్లూ బస్సు వెనుక వున్న గదిలో వుండిపోయారు. అది డిశంబరు నెల. చలి విపరీతంగా వుంది. ఆ చలిలో గడ గడ వణుకుతూ శిష్యులు కొండపైనే గడిపారు. బైదులు తానా నుంచి తెచ్చిన మస్తు పేరు పఠాన్ బాబా. బైదులు మాత్రం బాబాతో వుంటూ మస్తుకు సేవ చేస్తున్నాడు. రోజూ కాసే[illegible] బాబా మస్తుతో గడుపుతున్నారు. బాబా

నవజీవనంలో ఇది మస్తు కార్యక్రమానికి, చివరిదశ కనుక, మస్తులు గురించి బాబా 1936 లో చెప్పిన వివరణ తెలుసుకుందాం. దైవోన్మత్తులతో ఆయన చేసే పనికి సంబంధించిన వివరణ అది. ఆయన ఏం చెప్పారంటే, "ఇది చైతన్యానికి సంబంధించిన ఆట. మస్తులకు నేను భౌతిక పరమైన సేవ చేస్తూ తద్వారా, వారిలో ఆధ్యాత్మిక చైతన్యాన్ని, భౌతిక చైతన్యం వైపు మరలుస్తాను. అలాగే యితరులలోని విషయ వాంఛలతో కూడిన భౌతిక చైతన్యాన్ని నా ఆధ్యాత్మిక మార్గదర్శకత్వంలో దైవ చైతన్యం వైపు మరలేటట్లు చేస్తాను. యీ విధంగా నా అనంత చైతన్యం సంబంధం పెట్టుకుంటుంది" అని వివరించారు.

తెంబికొండ మీద వున్న రెండు గదుల్లో బాబా 1947 డిశంబరులో 13 రోజులపాటు వున్నారు మళ్ళీ అవే క్యాబిన్లలో 1951 నవంబరు 23 నుండి, డిశంబరు రెండవవారం వరకూ గడిపారు. అప్పటినుండీ యీ తెంబి కొండ, బాబా గారి ఏకాంతవాస కొండ అని పిలువబడుతోంది. ప్రపంచ వ్యాప్తంగా వున్న బాబా ప్రేమికులందరికీ యిది ఎంతో ప్రియతమమైన ప్రదేశం. భౌతికంగా బాబా సమక్షం, అందునా ఆయన చేసిన ప్రత్యేక కార్యక్రమం వలన, యీ కొండలోని ప్రతిరాయి, ప్రతి అణువు, అసలు కొండ మొత్తం అత్యంత పవిత్రమైంది. నెత్తి మీద కప్పు లేకపోయినప్పటికీ, గుస్తాద్ జీ, పెండూ, యీరుచ్‌లను కొండమీదనే వుండిపొమ్మన్నారు. ఆ విధంగా వారు చేయటం వలన, తాను కొండ క్రింద చేస్తున్న కార్యక్రమానికి దోహదపడి సహాయకారి కాగలదన్నారు.

కొండమీద ఏ ఆచ్ఛాదన లేకుండా ఆకాశం క్రింద వుంటున్న శిష్యులకు, యాంత్రికంగా సూర్య చంద్రాదులతో సంబంధం ఏర్పడుతుందన్నారు. పగలేమో మల మల మాడే ఎండతో పాటు వేడిగాలులు, రాత్రేమో గడ గడ లాడించే చలి. గుస్తాద్‌జీ పగలు వేడిని, రాత్రిళ్ళు చలిని ఎదుర్కొనేందుకు ముతక దుప్పటిని ఏటవాలుగా ఒక మంచాన్ని నిలిపి, దానికి కట్టి దానిక్రింద గడుపుతున్నాడు. రాత్రిళ్ళు ఉష్ణోగ్రత పడిపోవటంతో చలి వణికిస్తోంది. పాపం శిష్యులు దుప్పట్లలో చుట్ట చుట్టుకొని పడుకుంటున్నారు. ఏం పనీ పాట లేకుండా వూరికినే కూర్చుని కొండమీద కాలక్షేపం చేస్తున్నారు.

బాబా తన మనోనాశ ఘట్టం ఆఖరి దశ దిగ్విజయంగా పూర్తయ్యేందుకు పరిశుద్ధమైన ఆత్మకల మస్తు కానీ, సాధు పుంగవుడు కానీ తన దగ్గర వుంటే, తాను చేసే కార్యక్రమంలో ఎంతో సహకారిగా వుంటుందని భావించారు. అదీ చేత కొంతమంది బాబా ప్రేమికులకు వుత్తరాలు వ్రాయించారు. వారి వారి ప్రాంతాల్లో వుండే మంచి మస్తు ఎవరైనా దొరికితే వెంటనే తీసుకురమ్మని బాబు వ్రాయించారు. వారిని తీసుకు వచ్చేందుకయ్యే ఖర్చంతా బాబాయే భరిస్తారని కూడా తెలిపారు. పరిశుద్ధుల క్రింద పేర్కొన్న మస్తుల పేర్లు, చాంద్ తారాలో వుండే బద్రి బాబా, మధురలోని ఇనయతుల్లా, కత్నీ లోని శోభామస్తు, కొల్హాపురంలోని మేర్వాన్ బాబా, బెనారస్ లోని బట్వాషా తదితరులు. పై వారిలో ఎవరినైనా సరే తీసుకురమ్మన్నారు. తుంహారులో

వున్న జీవన్ముక్తుడైన తిలుగురు స్వామిని తీసుకు రమ్మని బైదిలును పంపారు. అతను వస్తానంటే, డిశంబరు 15 నుండి, ఫిబ్రవరి 15 వరకూ బాబాతో వుండేందుకు ఆహ్వానించమని చెప్పారు.

అయితే ప్రతి ఒక్కరూ ఎంత కృషి చేసినప్పటికీ ఏ ఒక్కరూ, ఒక్క పరిశుద్ధుడైన వ్యక్తినైనా మెహెరాబాదు తీసుకు రాలేకపోయారు. అటువంటి ఆధ్యాత్మికంగా పురోగమించిన వ్యక్తి లేక పోవడం బహుశః, ఆఖరి దశకు చేరి, డిశంబరు 16 న పూర్తికానున్న నవజీవన ఘట్టంలోని బాబా నిస్సహాయ స్థితిని సూచిస్తున్నట్లున్నది. అన్నమాట ప్రకారం, పాద్రి తనకు వప్పగించిన పని పూర్తి చేశాడు. పై నుంచి తెచ్చిన వస్తువులన్నీ వుపయోగించి, దొడ్లో నేలమీద ఒక తలుపు రెండు కిటికీ లమర్చి పెద్ద గది నిర్మించాడు. ఎడమవైపున రెండు ఆలమార్లు ఏర్పాటు చేశాడు. గది కట్టడం పూర్తికాగానే బాబాకు తెలిపారు.

గదిని చూచి, బాబా ఒక టార్పాలిను తెప్పించి, గది మధ్యగా తెరలా మేకులతో బంధించి రెండు గదులు వచ్చేట్లు అమర్చారు. ఒక భాగం యీరుచ్ తదితరులు కూర్చొనేందుకు ఆఫీసు గదిలా నిర్ణయించారు. రెండో భాగం తన విశ్రాంతి గదిగా వుంచారు. ఆ గదిలో వున్న షెల్ఫులో అయిదు పాలరాతి నమూనాలు—అగ్ని దీపిక, చర్చి, హిందూ దేవాలయం, బుద్ధ దేవాలయం, మశీదులు భద్రపరిచేట్లు చేశారు. ఇక్కడ ఆ నమూనా లున్నన్నాళ్ళు వాటిని ఎవరూ తాకరాద[illegible] ఆదేశించారు.

బాబా వాటికెదురుగా కుర్చీలో కూర్చొనేవారు. ఆయన లోపల వున్నప్పుడు, యీరుచ్‌ని తలుపు మూసి బయటకు వెళ్ళమనేవారు. అందువలన, ఆయన క్యాబినులో వున్నప్పుడు వాటితో ఏమి చేశారో ఎవరికీ తెలియదు. తిరిగి లోనికి రమ్మనమని సౌంజ్ఞ చేసినప్పుడే యీరుచ్ లోనికి వెళ్ళేవాడు. రాత్రిళ్ళు క్యాబినుకు ముందున్న గదిలో విశ్రమించేవారు. ఆ గదిలో యిప్పుడు పెండూ వుంటున్నాడు.

ఈ కొత్త క్యాబిన్‌కి బయట ఒక వైపున నీలూ, విష్ణూ, కాకా తదితర మిత్రులుండేవారు. వేరొక వైపున, యీరుచ్, గుస్తాద్‌జీ, బైదుల్, పెండూలున్నారు. ఎటువంటి పరిస్థితులలోను వీరితో నీలూ మొదలగు అవతలి వైపున వున్న శిష్యులు మాట్లాడటం కానీ, అభినందించు కోవటం కానీ, కలుసు కోవటం కానీ చేయరాదని ఆంక్ష విధించారు. బాబాకు, నలుగురు మిత్ర సహచరులకు భోజనం, అహ్మద్ నగరులో కాపురముంటున్న యీరుచ్ సోదరి మెహెరూ డమానియా వండి పంపించేది. అవతలి వైపున్న మిత్రులకు భోజనం, వారున్న దొడ్డి గోడ ప్రక్కనే వున్న మెహెరాజాద్ ఆశ్రమంలోనే వండి పంపించే వారు. ఒక బృందానికి 9 గజాల దూరం నుండి భోజనం తయారవుతుంటే, మరో బృందానికి 9 మైళ్ళ దూరం నుండి తెప్పించబడింది. నవజీవనంలో యీ ఏర్పాటులో వుండే వీలు ఏమిటో, ఎందుకు ఇలా ఏర్పాటు చేశారో మన వూహాకందని పరమ రహశ్యం. బాబా ఏం చేయమంటే, అదే చేయడం శిష్యుల విధి.

నవజీవన కార్యక్రమం పరిసమాప్త మయ్యే దశలో బాబా బృందం మెహెరాజాదు చేరుకున్నారు గదా ! మెహెరాజాద్ చేరిన రోజు నుండి, పరివ్రాజక జీవనానికి, భిక్షాటనకు స్వస్తి చెప్పారు. అందుచేత యీరుచ్ ద్వారా ఆయన సోదరి మెహెరూ దమానియాకి, "యిప్పుడు నవజీవనం పరిసమాప్తమై మనో నాశన మనే తదుపరి అవస్థ ప్రారంభ మైనందున, నాతోపాటున్న నలుగురు శిష్యులకు వంట చేసి భోజనం పంపితే తానెంతో సంతోషిస్తానని'' కబురంపారు. అందు కామె, మహద్భాగ్యంగా భావించి, రోజూ మెహెరాజాద్ భోజనం పంపేది. వీరి కవుసర మయ్యే మంచి నీళ్ళు కూడ వేరేచోటునుంచే తెప్పించుట వలన, వారికి మెహెరాజాద్‌తో ప్రత్యక్ష సంబంధం లేకుండా పోయింది. బాబా తనకోసరం కొత్తగా నిర్మించిన క్యాబినులోనే వుండిపోయి విశ్వ కార్యక్రమము నిర్వహించారు.

రెండుగా ఒక తెరతో విభజించబడిన గదిలో ఒక భాగంలో తన కార్యక్రమం చేస్తూ రెండవ భాగంలో, భోజనం చేసి విశ్రాంతి తీసుకొనేవారు. డిశంబరు 15 న ఆఖరి కార్యక్రమం ఆరంభమైంది. కొజ్జా గూడ కొండమీద మనోనాశన కార్యక్రమం ప్రారంభమైంది. దేవాలయం, మశీదు, చర్చి, బుద్ధ దేవాలయం. అగ్ని దేవళపు నమూనాలతో ఆనాటి కార్యక్రమం ప్రారంభమైంది. అవి ఆయన వెంతనే వుంచుకొన్నారు. ఆఖరి దశకు చేరేంత వరకు యీ అయిదు నమూనాల్ని ఆయనచెంతనే వుంచుకున్నారు, వాటితో ఆయన ఏమి చేసేవారో తెలియనప్పటికీ, సద్గురువులు

చేసే కార్యక్రమంలో కొన్ని వస్తువుల్ని బాహ్యంగా వుపయోగించ టంలో దాని భావం ఆంతరంగిక ఆధ్యాత్మిక కార్యక్రమంలో అది ఒక భాగమన్నది కటిక సత్యం.

శాయిబాబా జీవితంలో కూడ యిటువంటి సంఘటనే ఒకటి జరిగింది. ఆయన జోలిలో వివిధరకాల చిల్లర నాణెములను మూట కట్టి వుంచుకొనేవారు. ప్రతిరోజూ యీ నాణాల్ని ఒక తెర చాటున నిలబడి ఒకదానిపై ఒకటి వేసి బాగా రుద్దేవారు. చివరికా నాణాలు రూపు పోయి సన్నని రేకులుగా మారాయి. అలా రుద్దగా పల్చనై పోయాయన్న మాట. ఆయన తెరచాటున నిలబడి ఏం చేస్తున్నాడోనని ఎవరైనా తొంగి చూచినా, తెరలాగి చూచినా గభాల్న వాటిని దాచేశేవారు.

అలాగే అక్కల్‌కోట స్వామి మహరాజు అనే సద్గురు వొకరు 19వ శతాబ్దంలో వుండేవారు. ఆయన, వివిధ పరిమాణములుండే కొలత పాత్రల నిండా ధాన్యం పోసి ప్రక్కన పెట్టుకొని వుండేవారు. రోజూ వాటిని గుమ్మరిస్తూ మళ్ళీ గింజలతో నింపటం ఆయనకు సరదా. తాను చేసే ఆధ్యాత్మిక కార్యక్రమలో పూర్తి ఫలితం సాధించేందుకు యీ విధమైన బాహ్య మార్గాలు వుపయోగిస్తారేమో ! మరి అవతారునిగా మెహెర్‌బాబా యీ అయిదు నమూనాల్ని అమనస్కయోగ కాలమంతా వుపయోగించారంటే, విభిన్న మతాల అలవాట్లు, ఆచారాల్లో అంతర్నిహితమైవున్న ఆధ్యాత్మిక తత్వాన్ని పునరుజ్జీవింపచేసేందుకు వాడారనిపిస్తుంది. నిజానికి బాబా చేసే రహస్య మార్గాల్లో యీ

నమూనాలు వుపయోగించటం ఒక విధానం. దీన్ని గురించి యింతకంటే ఎక్కువ చెప్పటమంటే అది హాశ్యాస్పదమే అవుతుంది.

## అనేకత్వంలో ఏకత్వం

ఆది డిసెంబరు 24. ఆనాడు వుదయం 9 గంటలకు, సన్నిహిత సహచరులతో ఒక సమావేశం జరిగింది. తనకు ప్రీతిపాత్రులై తనను ప్రేమించి, మరణించిన 124 మంది పేర్లతో కూడిన ఒక లిష్టు అంతకుముందే తయారుచేయించారు. వారి పేర్లు తలచుకుంటూ యీ క్రిందివిధంగా ఒక ప్రకటన లాంటిది చదివించారు.

ఈనాడు అనగా 1951 డిశంబరు 24న యీ నవజీవ నంలో మరణించిన వారియెడల ప్రేమ, భక్తి, సేవాభావాల్ని చూపుటకు ఎందుకూ పనికిరానివాడినని తెలిసికూడా, దయాళుడు, కరుణార్ద్రహృదయుడైన భగవంతుడు మరిణించిన యీ 124 మందిపైన వారి వారి గుణగణాల్నిబట్టి తన కృపను ప్రసరింప చేయమని వినయంతో విజ్ఞప్తి చేస్తున్నాను.

వారి జీవితకాలలో తమ ప్రేమ, సేవా తత్పరతలతో నా అనుగ్రహానికి ఎవరైతే పాత్రులయ్యారో వారందరి పేర్ల మీదుగా, వారి జ్ఞాపక చిహ్నంగా శ్రద్ధాంజలి ఘటిస్తున్న ఈ సమయంలో మంచి గుణవంతుడైన ఒక పే[illegible]నికి రు. 124/-

కానుకగా సమర్పించి, వాని ముందు ప్రణమిల్లెదను" అన్న ప్రకటన చదవబడింది.

124 మంది లిస్టులోని 87 పురుషులు, 37 స్త్రీలు పేర్లు చదవబడినవి. ఆ లిస్టు మొదట్లో బాబా తండ్రితో మొదలైంది. చిన్ననాటి స్నేహితుడు డా॥ ఘనీది రెండవపేరు కాగా ఆఖరిది కటిక పేదవాడైన "గానూఘంబర్" అనే చెప్పులు కుట్టేవానిపేరు. మెహెరాబాదులోని సేవక బాలకుడు కాష్యా పేరు చిట్టచివరిది. స్త్రీల లిస్టు ఆయన మాతృమూర్తి షిరీన్‌ఖానూతో ఆరంభమైంది. తర్వాత పేర్లు పాశ్చాత్య ప్రేమికురాళ్ళు, నానీగాలే, నడీన్ టాల్‌స్టాయి, తదితర స్త్రీ మండలి సభ్యురాండ్రున్నారు. వారితోపాటు నమ్మకస్తులైన శాంతా, డోండీలనే సేవకురాండ్ర పేర్లు కూడా వున్నాయి.

వారికున్న భోగభాగ్యాలకన్నా సాంఘికపరమైన స్థితిగతులకన్నా వారు ఆయన్ను ఎంతగా ప్రేమించారు? ఎంత విధేయతతో సేవచేశారు? అన్నది పరిగణనలోకి తీసుకున్నారు. కొన్నాళ్ళయిన తర్వాత సందర్భం వచ్చినప్పుడు బాబా ఈ లిస్టులోని మృతవీరుల గురించి ముచ్చటిస్తూ "ఆ మృతవీరులు నాలోనే వున్నారు" అన్నారు. మరో సందర్భంలో "నేనిచ్చేందుకు నా దగ్గర ప్రేమ మాత్రమే వుంది. నేను కోరేదా ప్రేమ ఒక్కటే" అని వివరించారు. పై విధంగా ప్రకటన లిస్టులోని 124 మంది పేర్లు చదవటం పూర్తి అయింది. అంతకు ముందే ఇరువురు నిష్టపరులైన పేదవారిని రమ్మనమని ఆహ్వానించారు.

ఇరువురు నిష్టపరులైన పేదవారు వచ్చారు. అందులో ఒకరికి రు. 124/- పారితోషికం ఇచ్చి ఆతని పాదముల పై బాబా ప్రణమిల్లుతుండగా, యూరుచ్ ఈవిధంగా భగవంతుడ్ని ప్రార్థించాడు. "హే, భగవాన్ ! నేనీ వ్యక్తికి ప్రణమిల్లుట ద్వారా మరణించినవారందరికీ ప్రణమిల్లుతున్నాను." ఆవిధమైన ప్రార్థన పూర్తి కాగానే మరో ఆదేశం చదవబడింది. దీనిలో, సజీవంగా వుండి, తనకు అత్యంత విధేయులై, సేవ చేస్తూ సర్వార్పణ గావించుకున్న శిష్యులు, భక్తుల నుద్దేశించి కీర్తించబడింది.

"ఈనాడు ఈ నవజీవనంలో బాబా పూర్తిగా నిరాశా మయ, నిస్సహాయ శక్తిని మానశికంగా, శారీరకంగా అనుభవి స్తున్నారు. ప్రాక్పశ్చిమ దేశాల్లోని ఎందరో ఆయన ఎడల ప్రేమపూరిత విశ్వాసాన్ని వుంచినప్పటికీ వారుంచిన ప్రేమ, సేవా తత్పరత, భక్తికి తాను అనర్హుడనన్న భావంతో వుండి, అనేక బలహీనతలు కలిగివున్నాడాయన. ఏమైనప్పటికీ వారి ప్రేమ, భక్తి, సేవలను పురస్కరించుకొని వారి గౌరవార్థం ఈనాడు ఒక నిష్టపరుడైన పేదవ్యక్తికి రు. 51/- పారితోషికము సమర్పించి ప్రణమిల్లదలచారు" అని చదివాడు యూరుచ్. చదవటం పూర్తి కాగానే బాబా రెండవ పేదవానికి పైకమిచ్చి ప్రణమిల్లారు. అలా చేయగానే మరో ప్రార్థన చదవబడింది.

"హే, భగవాన్ ! ఈ వ్యక్తికి ప్రణమిల్లుటద్వారా సజీవులై వున్న నా వాళ్ళందరికీ ప్రణమిల్లుతున్నాను" ప్రేమికులకు

ప్రేమాంజలి ఘటించడం కాగానే అతిధులుగా వచ్చిన పేదవారిరువర్ని పంపించివేశారు. తరువాత మూడవ ఆదేశం చదవబడింది. అందులో, తానాచరిస్తున్న మనోనాశ కార్యక్రమంలో సహాయపడమని దైవాన్ని ప్రార్థించారు. తన ప్రేమికులు, శిష్యులు అందరికీ ఒక సందేశమిస్తూ, తాను చేస్తున్న దైవ ప్రార్థనలో తమ వంతు భాగంగా ఎవరైనా పాల్గొనదలుచుకుంటే హృదయపూర్వకంగా ప్రేమతో తమ యిష్టదైవాన్ని స్మరిస్తూ రోజూ ఒక అర్ధగంట ప్రార్థన చేసేందుకు అనుమతించారు. 1951 డిశంబరు 29 నుండి, 1952 ఫిబ్రవరి 16 వరకు నిత్యం అరగంటసేపు పారశీకులు అహురమజదా పేరున, ఇరానీలు యజదాన్ పేర, ముస్లిములు అల్లాహో పేరున, హిందువులు పరబ్రహ్మ అని, క్రిష్టియనులు గాడ్ ది ఫాదర్ అని తదితరులు తమ మతాచార ప్రకారం ఆరాధించే దేముని పేర్లు స్మరించమన్నారు,

పై ఆదేశాన్ని పూర్తిచేస్తూ బాబా " అందరిలోనూ అన్నింటిలోనూ వున్న అవిభాజ్యుడు సనాతనుడు అనంతుదైన భగవంతుడ్ని బాబా యీ విధంగా వివిధ మతాల ఆరాధ్యదైవం పేర్ల ద్వారా ప్రార్థన చేస్తూ తన వుపకరణాలైన అనంతశక్తి ప్రేమ, దయలద్వారా సహాయ పడవలసినదిగా అర్థిస్తున్నారు " అని చదవడంతో తన ప్రేమికులకు శ్రద్ధాంజలి ఘటించటం ప్రేమాంజలి సమర్పించటం దైవ సహాయన్నర్థించటం వంటివి

పూర్తయ్యాయి. అనేకత్వంలోని ఏకత్వ జీవితం నమ్మశక్యం కాని రీతిలో యీవిధంగా ప్రస్ఫుటమైంది.

బాబా ఇంతకుముందుకూడా చాలాసార్లు మత పరమైన విధానంలో ఏ దేముని పేరునైనా స్మరించమనేవారు. అయితే తనయందు ప్రగాఢ విశ్వాసముంచి విధేయులైనవారు తనను హృదయపూర్వకంగా విశ్వసించి జీవితంలోని అన్ని కష్టదశల యందు తన నామాన్ని మరువక స్మరించమన్నారు. పవిత్ర మైన మెహెర్‌బాబా నామం పరంపరగావచ్చే యుగావతారుని నామం. అందరి యెడల తనకున్న అపారదయ కరుణలు పురస్క-రించుకొని అప్పుడప్పుడూ ఎటువంటి చాటుమాటులు లేకుండా యిలా చెప్పేవారు.

"నేను మానవ రూపంలో వున్న దైవాన్ని. మీరు నన్ను మీ యదార్ధ తండ్రిగా చేసుకొంటే మీ కష్టాలన్నీ నా ప్రేమ మహాసాగరంలో కరిగిపోతయి. నన్ను ధ్యానించడమంటే నాకు యిష్టం. ఎందుకంటే అప్పుడు ప్రత్యక్షంగా నా సహాయం అందిస్తాను. మీరు నన్ను ప్రేమించలేకపోయినా యేమీ ఫరవా లేదు. విచారించకండి. నేను మిమ్మల్ని ప్రేమిస్తాను. మీరు నన్ను విడువకుండా గుర్తుంచుకోలేకపోతే, కనీసం పరుండ బోయే ముందు, మేల్కొనగానే నా నామం స్మరించండి. నేను నా శరీర త్యాగం చేసింతర్వాత, నన్ను ప్రేమించువారందరిలో నేనుండిపోతాను, నే నా సనాతనుడ్ని" ఇది బాబా ఢంకా బజా యించి చెప్పి మనకిచ్చిన పిలుపు. ఆయన్ను [illegible]రించి తెలుసుకో

దలచిన వారి హృదయాల్ని మేల్కొలిపే బహిరంగ ఆహ్వానం. ఆయన ప్రేమ, వినయం, యిందులో వెల్లడౌతుంది. వినయ విధేయతలతో ఆయన నామోచ్చరణ పాటించటం మన కర్తవ్యం. నామ గానామృతం లోని మాధుర్యం పిచ్చితనం ఆయన మన కిచ్చిన బహుమానం.

## మనోనాశ్ అంతిమ ఘట్టం

1952 క్రొత్త సంవత్సరారంభంతోపాటు బాబా నవజీవనం పూర్తికావచ్చింది. మనోనాశ క్యాబినులో తనకు తా బంధించుకొని రోజూ అందులోనే వుండిపోయారు. అది పునాదులులేని మూడు గజాల చదరపు గది. దాని గోడలు పై కప్పు కూడ సిమెంటు రేకులే అయినందున, ఎండాకాలంలో వేడిగానూ, శీతా కాలంలో చలిగానూ వుండేది. యీ గదిని మానవ మనస్సుతో పోల్చినప్పుడు మనోభావాల్ని బట్టి మనస్సు ఎలా మారుతుందో అలా వాతావరణాన్ని బట్టి గదిలో మార్పులు కలుగుతయి. నిజా నికి బాబా తన ఏకాంతవాస కాలంలో పనిలేనివానివలె కనిపించినా తన ఆంతరికమైన ఆధ్యాత్మిక కార్యక్రమంలో మునిగి చైతన్యపు వివిధ స్థాయిలపై నిర్విరామంగా పనిచేస్తూ వుండేవారు.

ఆయన తన గదినుండి బయటకు వచ్చి తన మిత్రుల్ని కలిసినప్పుడల్లా ఆధ్యాత్మిక విషయాలు తప్ప తదితర అనేక విషయాలపై చక్కని హాస్యం తొణికిసలాడుతూ ముచ్చటించే వారు. తన అలవాటుగా జనవరి నెలలో ఒక రోజున అందరినీ " తమ వయస్సెంత ? " అని అడిగారు. పెండూ వంతు వచ్చే

సరికి, ఇహ తాను నాలుగు సంవత్సరాలు మాత్రమే జీవిస్తాను అని జవాబు చెప్పాడు. " ఎందుకని ? " అని బాబా అడుగగా 1926 డిశంబరులో జరిగిన ఒక సంఘటన గురించి చెప్పాడు.

1926 వ సంవత్సరంలో బాబా ఆదేశాల మేరకు మెహెరాబాదులో ఒక నూయి త్రవ్వుతున్నారు. అది రోడ్డుకి, రైలుకట్టకి మధ్యలో యిప్పటికీ వుంది. త్రవ్వుతున్న నూతినుండి రాయి రప్పలు పైకి లాగినప్పుడు మోదితిత్తినుండి బయట పార వేయటం పెండూకి వప్పగించిన పని. రాళ్ళముక్కల్ని పైకి లాగేప్పుడు అవి నింపిన తోలుతిత్తిని పైకి లాగటం నేర్చుకో వాల్సి వచ్చింది. ఒక్కొక్కప్పుడు తిత్తి నిండిందా లేదా అని తొంగి చూచేప్పుడు గురుత్వాకర్షణ శక్తి తనను చీకటిగా వున్న నూతిలోనికి లాగుతున్నట్లు భ్రమించేవాడు. ఆ అగాధంలో పడి మరణిస్తానేమోనని భయపడేవాడు.

ఒక రోజున బాబా ఆ చోటుకి పరిశీలనకై వచ్చినప్పుడు పెండూ తన భయం గూర్చి విన్నవించుకున్నాడు. అంత బాబా " మరేం భయంలేదు. విచారపడకు పెండూ ! ఇంకా 30 ఏళ్ళ దాకా నీవు మరణించవు " అని ఆ విషయాన్ని అంతటితో ఆపే శారు. పెండూ కాస్త వుపశమించాడు. అయితే బాబా అతని వయస్సు ఎప్పుడు అడిగినా, బాబా చెప్పిన మాటల్నే గుర్తు చేసే వాడు. నిర్ణయించిన గడువు 1956 డిశంబరుతో ముగుస్తుంది. ఆ కారణంచేత, బాబా ప్రశ్నకు పై విధంగానే పెండూ ఇహ నాలుగేళ్ళు మాత్రమే బ్రతుకుతానని జవాబిచ్చాడు.

పెండూ చెప్పిన పై కథనంతా ఓర్పుతో విన్న బాబా చిరునవ్వు నవ్వి "పెండూ ! నీవు 1956 డిశంబరులో మరణించవు." అని అతని జీవిత కాలాన్ని మళ్ళీ పెంచారు. అలా చెపుతూనే తన ఎడమ చేతితో ఆయన ఎడమ పార్శ్వాన్ని చూపుతూ ఏదో సౌంజ్ఞ చేశారు. పెండూ ఆ సౌంజ్ఞని బట్టి తన మరణం తప్పించబడినప్పటికీ తన ఎడమపార్శ్వానికి పక్షవాతం వస్తుందేమో ననుకున్నాడు. అంతకుమించి మరేమీ చెప్పకుండా విషయాన్ని దాటవేశారు.

ఇక్కడ సందర్భం గాకపోయినప్పటికీ, ఆనాటి సౌంజ్ఞకి ఫలితం ఎలా పరిణమించిందో తెలుసుకుందాం. 1956 డిశంబరులో సతారా సమీపంలో బాబాకు రెండవ కారు ప్రమాదం జరిగింది. ఆ కారులో బాబాతోపాటు నీలూ, పెండూ, విష్ణూ, ఈరుచ్ లు ప్రయాణం చేస్తున్నారు. ఆ ప్రమాదంలో డా॥ నీలూ, పెండూ లకు బలమైన గాయాలు తగిలాయి. స్పృహ కోల్పోయారు. మళ్ళీ స్పృహ రాకుండానే నీలూ మరణించాడు. పెండూకి స్పృహ వచ్చేసరికి సతారా ప్రభుత్వ ఆసుపత్రిలో వున్నాడు. అతని ఎడమవైపు అవయవాలన్నీ ఆపాదమస్తకం కట్లతో నిండి పోయింది. దానికితోడు కుడికాలుకి కూడ గాయమైనందున కట్టు వేశారు. కాస్త కదిలినా విపరీతమైన బాధ పడుతున్నాడు. ఒక్కొక్కప్పుడు ఆ బాధకు తట్టుకోలేక మూర్ఛ పోతున్నాడు. ఒక విధంగా చెప్పాలంటే, అతను బ్రతికివున్నా మృతప్రాయుడై వున్నాడు.

ఈ విధంగా పెండూకి వ్రాసిపెట్టిన మరణ శాసనం బాబా వలన తప్పించబడింది ! ఇదంతా మీకు ఎందుకు చెపుతున్నానంటే, బాబా ఏదైనా చేయాలని వాంఛిస్తే నిగూఢంగా నెరవేర్చేస్తారు. ఇక్కడ మనం గమనించాల్సిన విషయమేమంటే దైవీమానవుడు యాదృచ్ఛికంగా చేసే సౌంజ్ఞ కూడా అద్భుతమైన ప్రాముఖ్యత కలిగి వుంటుంది. ఇప్పుడు అసలు సంగతికి వద్దాం. క్రమప్రకారం నిర్దేశించిన సమావేశాలు పూర్తైనతర్వాత ఒక రోజున మిత్రులు నలుగుర్ని తన గదిలోకి పిలిపించారు.

## ధునీ ప్రాశస్త్యం

ఎంచుకున్న కొన్ని పుస్తకాల్లో కొద్ది అంశాలు ఈరుచ్ చేత చదివించారు. అప్పటివరకూ అయిదు నమూనాలు అలమారులోనే వున్నాయి. వాటినెవరినీ తాకనీయలేదు. - అది ఖచ్చితమైన ఆదేశం. ఒక్కొక్కప్పుడు బాబాయే స్వయంగా వివిధ మతాలకు చెందిన అనుచరులు ఆచరించే మతాచారాల్ని పాటించేవారు. ఆ నెలాఖరైన జనవరి 31 న బాబా ఈరుచ్ చేత ఒక కాగితంపై "ప్రపంచంలోని అన్ని మతాలవారు ఆచరించే కర్మకాండలు, పూజా పునస్కారాలు, సాంప్రదాయాలు యీనాడు ఈ అగ్నిగుండంలో అగ్నికి ఆహుతి చేయబడినవి." అని వ్రాయించి ఆ చీటీముక్కని తాను తీసుకొని ఒక్కసారి చూచి మడిచి జేబులో పెట్టుకున్నారు.

ఆ తరువాత ఈరుచ్‌తో తన మనోనాశ్ గది వెనుక నల్చదరం గల ఒక గొయ్యిని సాయంత్రంలో[illegible] త్రవ్వి సిద్ధ

చేయమని ఆదేశించారు. అందులో ధునీ వెలిగించేందుకు ఎండు సమిధలు శిష్యుల్ని ఏరి తెమ్మన్నారు. ఇదంతా బాబా గదికి రెండో వైపున వున్న వారికేమీ తెలియదు. సూర్యాస్తమానం అయింది. బాబా ముందు నడువగా తక్కిన నలుగురు శిష్యులు తాము పోగుచేసుకొచ్చిన ఎండు సమిధలతో ధునీ కోసరం వెలిగించిన గోతి దగ్గరకు నడిచారు. బాబాయే స్వయంగా సమిధలన్నీ గోతిలో వుంచి ధునీ వెలిగించారు. చెప్ప నలవికాని సంతోషం ఆయన ముఖంలో తాండవించింది. మెల్లగా పొగ ఆరంభమైంది. కాసేపట్లో మంట రాజుకుంది. ధునీ అంటే పొగతో కూడిన జ్వాల. ఇలాగే ప్రతి నెల 12 వ తేదీన మెహెరా బాదులో ధునీ వెలిగిస్తారు.

అలాగే ఇప్పుడు ధునీ వెలిగించింతర్వాత, బాబా తన నలుగురు శిష్యులతోపాటు ధునీ వెలుగుతున్న గోతి చుట్టూ కూర్చున్నారు. జ్వాల పుంజుకుని మంటలు పైకెగయగానే బాబా లేచి, ముకుళిత హస్తాలతో నిలబడి, తన శిష్యుల్ని కూడ అలా నిలబడమని ఆదేశించారు. వారు కూడ అలా నిలబడి నమస్కరించగానే, తన జేబులో భద్రపరచిన చీటీని తీసి, ఈరుచ్ కిచ్చి, తాను అరవగలిగినంత బిగ్గరగా ఆ చీటీలో వ్రాసిన మాటల్ని ధునీ వెలుగులో చదవమన్నారు. అతడలా చదవగానే ఆ చీటీ అందుకొని, ముక్కలుగా చించి, మండుతున్న ధునీలో పారవేశారు. ఆ గు[illegible]ంలో మంటలు తగ్గి, వేసిన సమిధలన్నీ

పూర్తిగా కాలి బూడిదయ్యేవరకూ ఆ గుండం దగ్గరే జాగ్రత్తగా చూస్తూ కూర్చున్నారు.

అవన్నీ పూర్తిగా బూడిదయింతర్వాత, ఆ భస్మాన్ని ఎవరూ తాకరాదని అందుచేత ఆ గుంటని వెంటనే పూడ్చి వేయమని ఈరుచ్‌ని ఆదేశించారు. ఆనాడు దహించివేయబడిన బూడిద చెక్కు చెదరకుండా యీనాటికీ భద్రపరచబడింది. సాధారణంగా మహాత్ములు వెలిగించిన ధునీలోని భస్మం చాలా పవిత్రమైందని భావిస్తారు. ప్రజలు దోసిళ్ళ కొలది తమ యిళ్ళకు తీసుకుపోయి, భద్రంగా దాచుకుంటారు. యిట్లో ఎవరైనా మరణిస్తే, మరణించినవారి సమీప బంధువులు తమ నుదుట యీ భస్మాన్ని ధరిస్తారు. గృహస్థుగా బాబా ఎడల త్యాగమయ జీవితం గడుపుతున్నట్లు నిదర్శనంగా యీ భస్మాన్ని నుదుట ధరిస్తారు.

అయితే యీనాటి ధునీకొక ప్రత్యేకత వుంది. కర్మకాండలు, ఆచారాలు, పూజా పునస్కారాలు అగ్నికి ఆహుతి గావించబడినయి. అందుచేత యీ భస్మాన్ని జాగ్రత్తగా రెండు రేకుడబ్బాలకెత్తి, స్వయంగా మూతలు బిగించి, ఎవరూ వాడకండా సీలు వేయించి భద్రపరచారు. ఆ రెండు రేకుడబ్బాలు యీనాటికీ యధాతథంగా వున్నయి. రాత్రి 7-00 గంటల సమయంలో ధునీలో మంటలు రేగుతున్న సమయంలో ఆ మంటల వెలుతురులో ఈరుచ్ చేత ఒక ప్రకటనను చదివించారు.

" అనంత జ్ఞానానికి మూలమైన ఓ సర్వాంతర్యామీ ! మానవునిగా చేయకలిగినంతా చేశానని నీకు తెలుసు. నాకు సంబంధించినంతవరకూ, యీ సాధారణ స్థితిలో దాని ఫలితాన్ని మాత్రం పూర్తిగా నీ యిచ్ఛకు వదిలేశాను. ఈ క్షణం నుంచి నీవు నన్ను నడిపించాలి. 1952 ఫిబ్రవరి 16 నాటికి నీవేమి చేయదలచుకున్నదీ నేను ప్రకటించకలగాలి. ఇప్పటినుండీ, నేను నవజీవనంలో, మనోనాశకాలంలో పాటించిన మత పరమైన కర్మకాండల్నుండి విముక్తుడనైనాను. " అని ముందుగా వ్రాసి పెట్టుకున్న ప్రకటనను చదివించారు.

అలా చదవటం పూర్తి కాగానే, మళ్ళీ రెండవసారి అంతా ధునీ చుట్టూ చేరి, మంటలారేవరకూ కూర్చున్నారు. బాబా స్వహస్తాలతో ఎంచి రెండు డబ్బాల నిండా నింపటం అయిన తర్వాత, ఎలాంటి పరిస్థితుల్లోనూ దానిని ఉపయోగించవద్దని ఆజ్ఞాపించారు. ఎవరైనాసరే బాబా ధునీ వెలిగించటం చూచినవారు ఎంతో అదృష్టవంతులు. ఎగిసే మంటలు, కాలే కట్టెలు, ప్రార్థనలు చేయటం మున్నగునవి చూచేందుకు; ఆఖర్లో ధునీ భస్మాన్ని తీసుకొని డబ్బాలలో నింపటం చూస్తే ఏదో ప్రత్యేక విశిష్టత కలిగివున్నట్లనిపిస్తుంది. అందునా ఇది బాబా నవజీవన కాలంలో అంతిమ చర్యగా ప్రమాణీకరించబడింది కనుక దీనికి తప్పక ప్రాధాన్యత వుంది.

బాబా శరీరత్యాగం చేసింతర్వాత ఆయన వాడిన వివిధ వస్తువుల్తో పాటు యీ భస్మం వున్న రెండు డబ్బాలు కూడా

మెహెరాబాదు కొండపై వున్న ప్రదర్శనశాలలో భద్రపరచ బడినవి. ఆ డబ్బాల్లో ఏం వుందో ఈరుచ్‌తోపాటు మిగిలిన ముగ్గురు శిష్యులకు మాత్రమే తెలుసు. వాటిగురించి ఎవరికీ వెల్లడి చేయలేదు. వాటిని మెహెరాబాదు కొండపైకి చేర్చటం గమనించిన మణీ అందులో ఏమున్నదని అడగ్గా ఈరుచ్ ముక్తసరిగా " భస్మం " అన్నాడట. కానీ అవి పట్టుకుంటే అందులో ఏవో రాళ్ళున్నంత బరువుగా వుండటం చేత నమ్మశక్యం కాక మణీ వాటి సీళ్ళు తీయించి పరీక్షిస్తే నిజంగా అందులో భస్మమే వుంది. అప్పుడు ఈరుచ్ ఆ భస్మాన్ని ఎవరూ తాకవద్దని బాబా ఆజ్ఞ కనుక ముట్టుకోవద్దని వాటి కథంతా చెప్పి, మూతలు బిగించి మళ్ళీ సీళ్ళను యథాతథంగా వేయించాడు. మణీ ఆ డబ్బాలలో భస్మమున్నట్లు చీటీ అంటించింది.

బాబా స్వహస్తాలతో మత పరమైన సాంప్రదాయాలను, పూజా పునస్కారాలను కర్మకాండల్ని అగ్నికి ఆహుతి గావించి నప్పుడు, దాని తాలూకు భస్మాన్ని తాకి, మళ్ళీ అటువంటి సాంప్రదాయాలకు స్వాగతం చెప్పరాదన్న తలంపుతోనే ఆ భస్మాన్ని ఎవరూ తాకవద్దన్నారు. అందుకే ఈరుచ్ అంటాడు - బాబా స్వయంగా మతాచారాల్ని, కర్మ కాండల్ని భస్మీపటలం చేసి అవి పూర్తిగా దగ్ధమయ్యేవరకు నిరీక్షించి, తానే స్వయంగా ఆ భస్మాన్ని డబ్బాల్లో బంధించి, సీలు వేశారు. దానినెవరూ మళ్ళీ తాకవద్దని శాశించారు. పూజలు, కర్మకాండలు వృథా అని బాబా భావన.

యీ సందర్భాన్ని పురస్కరించుకొని ఈరుచ్ ఓ చక్కటి సంఘటన వివరించాడు. ఆంధ్రప్రదేశ్ నుంచి వచ్చిన భక్తు డొకరు, బాబా సమాధి వద్ద దర్శనం పూర్తి చేసుకొని, మెహెరా జాద్ వచ్చారట. మండలి హాల్లో బాబా ఫోటోముందు ప్రణమిల్లి, తన మతాచారప్రకారం ఓ అగరుబత్తి వెలిగించి ఫోటోముందు పెట్టాడట. అగరుబత్తిని వెలిగించేందుకు వాడిన అగ్గిపుల్లను గిర వాటు వేయగా మండిన దాని తలవెళ్లి బాబా వాడిన తివాచీపై బడి కాలి, చిల్లు పడింది. అతని వూహలో, భక్తి శ్రద్ధలకు అగరు బత్తీతో పూజించుట ముఖ్యమని భావించి వుండవచ్చును. కానీ దాని ఫలితంగా బాబా తివాచీ కాలింది కదా !

ఇది వృధా కార్యమని గ్రహించలేక పోయాడు. మరి యిటువంటి పూజల వెనుక అర్థమేమిటో ఎవరికీ తెలియదు. పెద్ద పెద్ద మతాచార్యులు సైతం, తాము చేసే పూజల వెనుక వున్న భావం ఏమిటో సరిగా గ్రహించి యుండరు. మెహెరా జాద్‌లో గానీ, మెహేరాబాదులో కానీ, ఎవరూ కర్మకాండలకు, పూజలకు విలువ ఇవ్వరు, హారతిలో కర్పూరం కూడా వినియో గించరు. కర్మకాండలను దహించివేసే కార్యక్రమాన్ని బాబా స్వయంగా మెహెరాజాద్‌లోనే జరిపినప్పుడు మళ్ళీ కర్మకాండల్ని అక్కడే ఎలా ప్రోత్సహిస్తారు ?

## దైవ లీల

సామాన్య మానవునిగా మారి, గడిపిన యీ నవజీవనం ఘట్టాలన్నీ గమనిస్తే నా దృష్టిలో, కాబోయే తన ప్రేమికుల

హృదయాల్ని దైవీమానవుడు మేల్కొలిపి హత్తుకు పోయారని పిస్తుంది. అందుకే కబోలు, యీనాడెందరో ఆయన అవతార తత్వాన్ని విశ్వసించి, వేనోళ్ళ అవతారుంగా కొనియాడుతున్నారు. సత్యాన్ని కాలమే నిర్ణయిస్తుందంటే యిదేనేమో ? ఇదంతా దైవలీల. ఆయన జగన్నాటక సూత్రధారి. ఆయన చేతలు కేవలం మనకు శిరోధార్యాలేకానీ వాటి లోతులు అవగతం చేసు కొనుటకు ప్రయత్నిస్తే మనకు కనిపించేది అగాధమే కానీ, ఏమీ బోధ పడదు.

బాహ్యంగా చూచేందుకు, మెహెర్‌బాబా నవజీవనాన్ని 1945 అక్టోబరు 16 వ వర్షంతో ప్రారంభించారు. మళ్ళీ అది 1952 జనవరి 31 వ ధుని వెలిగించటం ద్వారా అగ్నితో అంత మైంది. "నీటినుండి నిప్పు పుడుతుంద"న్న సామెతకిది నిదర్శ నమా అన్నట్లు, బాబా యీ నవజీవనాన్ని అగ్నితో అంతం చేశారు. హైదరాబాదులోని ఖాజాగూడ కొండ గుహలో ఆరం భించిన అమనస్క యోగ కాలం మెహెరాబాదులో ధునీ వెలిగించుటతో పూర్తయింది. యీ విధంగా మనోనాశన కాలం దాదాపు ఎనిమిది వారాలు పట్టింది. యీ కాలంలో జరిగిన ప్రయాణ సమయంలో వుత్సుకత కలిగించే సంఘటనలెన్నో జరిగాయి. అవన్నీ క్లుప్తంగా యింతకు ముందే చెప్పుకోవటం జరిగింది.

మనోనాశమంటే, మనస్సును నాశన మొనరించటం అంటే మనస్సును ప్రక్షాళన మొనర్చి, ఆత్మకు పరిపూర్ణత కలిగించటం

కదా ! బాబా యీ కాలంలో ముఖ్యంగా అయిదు ముఖ్య మతాలకు సంబంధించిన నమూనాల్ని ప్రత్యేకంగా తయారు చేయించి, గొప్ప మతాలకు ప్రతీకలైన ఆ నమూనాలను యీ మనోనాశ కాలంలో వుపయోగించారంటే, వాటికేదో ప్రాధాన్యత వుండి తీరుతుంది. అయితే ఆయన యీ కాలంలో చేసిన చర్యలు మన వూహకందనివి. వాటి విలువలను మన తెలివితేటలతో కొలవ లేము. యింతకు ముందే చెప్పుకున్నట్లు, యీ కాలంలో ఎవరి మనస్సులు, నాశనం చేయబడినవి ? ఏమి జరిగింది ? ఎలా జరిగింది ? ఇదంతా దీర్ఘంగా ఆలోచిస్తే, నా కర్థమయిందొక్కటే !

అలా తమ మనస్సులను పరిశుభ్ర పరచుకోవలసిన అదృష్టవంతులు కోరికల్ని చంపుకొని, పరిశుద్ధ ఆత్మను పొంది, కైవల్యప్రాప్తి పొందవలసిన ఎవరికోసరమో, బాబా యీ మనోనాశ కాలాన్ని వినియోగించి వుండవచ్చును. బాబాను అంటిపెట్టుకొని అనుసరించిన మిత్ర సహచరులంతా ఆయన ఏమి ఆజ్ఞాపిస్తే, విధేయతతో అలా ఆచరించేవారు. వారి మనస్సుల్లో మరో ఆలోచనకు తావుండేది కాదు. అత్యున్నత ఆధ్యాత్మిక సత్యాలు కూడ వారి మనస్సులకు దూరంగా వుండేవంటాడు ఈరుచ్. కేవలం బాబా రూపాన్నే వారి అంతరాంతరాళాల్లో, నిలుపుకొని వుండేవారట. అన్యచింతనల కసలు తావే లేదు. బాహ్య ప్రపంచంలో వారు చేసే ప్రతి చర్యా కేవలం గుడ్డిగా ఆయనను అనుసరించటం మాత్రమే.

అదే ఈరుచ్ చెపుతాడు. "మేమీ బాహ్య ప్రపంచం మధ్యన వున్నప్పటికీ, ప్రాపంచిక సుఖాలకెన్నడూ విలువ యివ్వ లేదు. మా అందరి దృష్టి ఎల్లప్పుడూ, బాబా యందే లగ్నం చేసి, ఆయన ఆనందాన్నే కాంక్షించేవారం. మాపై ఆయనకు ఎన్నడూ కోపం రాకుండా జాగ్రత్త పడేవారం. నవజీవనం నుండి, మళ్లీ పూర్వ జీవనంలోకి పంపివేయబడకుండా వుండేందుకు జాగ్రత్త పడేవాళ్ళం. అయితే మేము ఆయనతో సన్నిహిత మిత్రులుగా మెలగ గలిగేందుకు విధేయతతో ఆచరించవలసిన ఆజ్ఞలెన్నో వుండేవి. అనేక రకాల విషయాలు పాటించాలి. అన్య చింతనలసలుండేవేకావు. ఆయన యీ నవజీవన కాలంలో, మస్తులను పేదవారిని కలిశేవారు. ప్రచ్ఛన్నంగా పరివ్రాజిక జీవనం గడిపే మాకు బాబా చేసే యిటువంటి కార్యక్రమముల వెనుక వున్న ఆధ్యాత్మిక విలువలేమిటో మాకు తెలియదు. కనుక ఆ చర్యల గురించి తెలుసుకొనుటకు మేమెన్నడూ ప్రయత్నించ లేదు. వాటి నన్నిటినీ ఆయన ఇచ్ఛకే వదిలేశాం."

"ఇక్కడ అన్నిటికంటే ముఖ్యంగా మనం గుర్తుంచుకో వలసిన విషయమొకటి వుంది. నవజీవన కాలంలో బాబా మాకు స్నేహితుడైనప్పటికీ, మేమాయన్ని అందరికంటే గొప్పవానిగా పురుషోత్తమునిగా. సర్వోన్నతునిగా అంగీకరించాము. ఆ భావం తోనే ఆయనకు విధేయులుగా మసిలాం," అంటూ ఈరుచ్ బాబా తన శిష్యులతో మనోనాశ కాలంలో హైదరాబాదునుండి

మెహెరాజాదుకు కాలినడకన ప్రయాణం చేస్తున్న రోజుల్లో ఎదు రైన ఒక సంఘటనను గుర్తు చేశాడు.

భారతదేశపు విభజన జరుగుతున్న రోజులవి. మస్తు కార్యక్రమంలో భాగంగా మారువేషంలో బాబా ఆ రోజుల్లో ఎక్కువగా దక్షిణా పథంలోనే ప్రయాణం సాగించారు. ఆ రోజుల్లో దారివెంట పయనించే సమయంలో పోలీసులు వీరిని నానా బాధలు పెట్టేవారు. రాచరిక సంస్థానాలున్న రాష్ట్రాల్లో యీ వేధింపు మరీ ఎక్కువగా వుండేది. అప్పట్లో ఇంకా భారత దేశ సార్వభౌమాధికారం క్రింద సంలీనంకాని రాష్ట్రాల్లో హైదరాబాదు రాష్ట్రమొకటి. సరిగ్గా యిదే రోజుల్లో, బాబా బృందం యీ రాష్ట్రంలో ప్రయాణం చేయటం తటస్థించింది.

ప్రజలను చిత్రహింసలు పెట్టటం, అగౌరవించటం, దొమ్మీలు, లూటీలు, జరుగుతున్న రోజులవి. నవజీవనం మొదలు పెట్టుటకు ముందుగానే దానిని గురించి అహ్మదునగర పోలీసులకు ముందుగానే తెలియచేయ బడింది. అయితే యిన్నాళ్ళా ఎన్నో రాష్ట్రాలు, జిల్లాలు తిరుగుతూ ఇప్పుడిక్కడ వున్నట్లు వారికి తెలియదు. అందునా బాబా ఇటువంటి విషయాలపై అసక్తి చూపేవారు కాదు. శిష్యులే ముందు జాగ్రత్తగా అన్ని చర్యలు తీసుకొనేవారు. హైదరాబాదు నగర పోలీసులు కమీషనరుతో గుర్తింపు పత్రం వ్రాయించి పుచ్చుకున్నాడు ఈరుచ్. అయినప్పటికీ ప్రయాణం ఆరంభమైన మొదట్లోనే ఓ సంఘటన జరిగింది.

కాలినడకన ప్రయాణం సాగిస్తున్నారు. దారిలో బాబా లఘుశంక తీర్చుకోవాల్సివచ్చింది. ఒక ఏకాంత ప్రదేశం వెతికి ఈరుచ్ బాబాను అటువైపు పంపుతున్నాడు. సరిగ్గా ఇది జరిగే ముందే వారి వెనుక నుంచి ఒక పోలీసు వ్యాను వచ్చి వారిని దాటి వెళ్ళింది. అది దాటి వెళ్ళిన కాసేపటికి బాబా ఈరుచ్ వెతికిన ఏకాంత ప్రదేశంలో లఘుశంఖ తీర్చుకొనేందుకు వెళ్ళాడు. ఈరుచ్ తదితర మిత్రులు బాబా రాకకు ఎదురుచూస్తూ రోడ్డుమీదే నిలబడ్డారు. అంతలో ఇంతకు ముందు వారిని దాటు కుంటూ వెళ్ళిన పోలీసు వ్యాను వెను తిరిగి వచ్చి వీరు నిలబడిన చోట ఆగింది. దానిలోనుండి యూనిఫారంలో వున్న యిద్దరు వ్యక్తులు దిగి ఈరుచ్‌ని ప్రశ్నించడం మొదలు పెట్టారు.

" యింతకుముందు నీతో వున్నాయన ఏరి ? " అని అడిగారు. " ఏం ? ఎందుకు ? అసలు మీ వుద్దేశ్యం ఏమిటి ? " అని ఎదురు ప్రశ్న వేసేసరికి, " ఇంతకుముందే మేము యిటుగుండా వెళ్ళే సమయంలో మీతో మరో ఆయన వున్నారు. ఇప్పుడు లేరు. అందుకని మాకు అనుమానం వచ్చి అడుగుతున్నాం " అన్నారు. " ఆయన ఏమైతే మీకేమి ? అలా అడగటానికి మీకేమి అవుసరం వచ్చింది ? " అని మళ్లీ తిరిగి ప్రశ్నించేసరికి " అది మా విధి. మేం పోలీసులం. అందుకే అడుగుతున్నాం. " అన్నారు.

" ఓహో ! అలాగా ! అయితే మీకు అన్నివిధాలా హక్కు వున్నది. సరే ! మంచిది. ఆయన ఇప్పుడు అల్పాచ

మానం పోసుకొనేందుకు చెట్ల ప్రక్కకు వెళ్ళారు. యింకా మీరేమైనా అడగదలచారా ? " అని అడిగాడు. " అవును మేమా యనను చూడదలచాము " అన్నారు. " అయితే సరే ! అలాగే ఆయన రాగానే చూడవచ్చును. అంతవరకు ఆగండి " అని చెప్పాడు. కొద్ది నిమిషాలు గడిచేసరికి బాబా రానే వచ్చారు. " యీయనే మా అగ్రజుడు. మీరు ఎదురు చూస్తున్నది ఈయన కొరకే " అని ఈరుచ్ బాబాని పరిచయం చేశాడు. " అయితే యీయన మాట్లాడరా ? " " మీరేమి అడిగినా ఆయన జవాబు లిస్తారు అడగండి. " అన్నాడు. అప్పుడు వాళ్ళాయన్ని అనేక ప్రశ్నలు వేశారు.

ముందుగా " మీపేరేమిటి ? " అని అడుగగా " నాపేరు ఎమ్. ఎస్. ఇరానీ " అని సౌంజ్ఞలు చేస్తే ఈరుచ్ మాటల్లో వ్యాఖ్యానిస్తున్నాడు. " మీరెక్కడకు వెళుతున్నారు ? " "మేము యాత్రకై వెళుతున్నము " యిలా మర్యాదపూర్వకంగా వాళ్ళ సంభాషణ కొనసాగింది. " మీరు మౌనం పాటిస్తున్నారా ? " అని ఆఖరు ప్రశ్న వేశారు. " అవును మేమిప్పుడు యాత్రార్థం బయలు దేరాం " అని చెప్పేసరికి, వీళ్ళ స్థితిని పోలీసు అధికార్లు అర్థం చేసుకున్నారు. మరే ప్రశ్నలు వేయకండా వారిని వదిలేసి వెళ్ళిపోయారు. ఇప్పుడు అసలు కథకు వద్దాం.

## ప్ర ప్రథమ జయంతి

అగ్ని గుండంలోని ధునీ పూర్తిగా చల్లారింతర్వాత, నిజా నికి బాబా నవజీవనం పూర్తి అయింది. అయినా మరికొద్దిరోజుల

వరకూ పరిపూర్తి అయినట్లు ప్రకటించలేదు. బాబా తన మొదటి జీవిత సర్క్యులరుగా ఫిబ్రవరి 6 వ తేదీన నిగూఢమైన అర్థం గల సందేశాన్ని యిచ్చారు. తన అవతార మంత్రాంగానికి సంబంధించిన లక్షణాలతో కూడిన మూడు ఘట్టాల గురించి అందులో వివరించబడింది. అవి 1. పూర్వ జీవనం 2. నవజీవనం 3. జీవితం -

ఈ సందేశసారం, క్లుప్తంగా చెప్పాలంటే సాహసమే అవుతుంది. అయినా ప్రయత్నిస్తాను. గత నాలుగు నెలలుగా సాధారణ మానవునిగా నాకు తెలిసిన విధానంలో మనోనాశనాన్ని సాధించేందుకు శాయశక్తులా ప్రయత్నించాను. నేను చేసిన పని నాకు తృప్తి కలిగించింది. నేనున్న నవజీవన స్థితిని అలాగే వుంచుకొని, నా పూర్వ జీవన మెహెర్‌బాబా స్థితిని మళ్ళీ పొందటం వలన యీ సంతృప్తి కలిగింది. పూర్వ జీవనంతో నాకున్న జ్ఞానాన్ని, శక్తిని, ఔన్నత్యాన్ని మళ్ళీ యిప్పుడు పొందగలిగాను. వీటితోపాటు నవజీవనపు అజ్ఞానం, బలహీనతలు, వినమ్రత అలాగే వుండిపోయాయి.

యీ పాత క్రొత్తల మేలి కలయిక వలన " జీవితం " వుద్భవించింది. ఈ " జీవితం " శాశ్వతంగా వుండే పాతది, క్రొత్తది. మనోనాశనం కోసరం నేను చేసిన కృషి అనుకూలంగా జరిగింది. దాని ఫలితం కూడా అనుకూలంగా వచ్చింది. అయితే అటువంటి ఫలితం స్పష్టమైన పునాదితో బలపడట మనేది దైవేచ్ఛకు వదిలి వేశాను. ఆ ఫలితం, ఎప్పుడు ? ఎక్కడ ? ఎలా ? వుండాలన్నది దైవాదేశానికి వదిలేశాను. "

1952 ఫిబ్రవరి 12, బాబా మండలి జీవితంలో సంభ్ర మాశ్చర్యాలు గొలిపే మహా పర్వదినమైంది. ఆనాడు మెహెరాజాద్‌లో బాబా తన నిజమైన ప్రప్రథమ జన్మదినం జరుపుకున్నారు. చాలా హుందాగా జరిగాయి జన్మదిన వేడుకలు. ఆనాటితో తనతోటి నలుగురు మిత్రులపై విధించిన ఆడ్డంకు తొలగి పోయింది. తన ప్రేమికులందరినీ అభినందించేందుకానలుగురికీ అనుమతించారు. ఆనాడు మెహెరాజాదులో స్త్రీమండలితో వున్న కిట్టీదేవీ బాబా జన్మదినం ఎలా జరిగిందీ, వివరించిది.

" ఫిబ్రవరి 12 ఉదయం 5 గంటలయ్యేసరికి బాబా స్త్రీమండలి క్వార్టరుల దగ్గరికి వచ్చారు. సరిగ్గా 5-00 గంటలు కాగానే గణగణమని గంటలు మ్రోగాయి. డ్రమ్ములు మ్రోగించబడ్డాయి. తుపాకులు పేల్చబడినయి. నౌబత్‌ఖానా ధ్వనుల మధ్య వివిధ మతాల పేర దైవనామాన్ని మండలివారు ఉచ్ఛైస్వరంతో అరుస్తూ స్మరించినప్పుడు ఆకాశమంతా మార్మోగిపోయింది ధునీ వెలిగించబడింది. ఆ పవిత్రాగ్ని 24 గంటలు మండేట్లు వుంచారు. తన ప్రేమికులందరికీ తన నిజమైన ప్రథమ జయంతి సందర్భంలో శుభాకాంక్షలందిస్తూ " జీవితం " అన్నది ఈనాటినుంచే ఆరంభమైంది. యీ శుభ సందర్భంలో మీఅందరికీ దైవాశీర్వచనములతోపాటు, నా ప్రేమను అందిస్తున్నాను " అంటూ చరిత్రాత్మకమైన ఈ రోజున దైవీమానవుడు దైవాన్నివిధంగా ప్రార్థించారు.

" హే ! భగవాన్ ! ఈనాడు నా నిజమైన జన్మదినం. నేనీనాడు ప్రకటించిన " జీవితం " పూర్తిగా నీది. అది నీ యిచ్ఛ వలననే వుద్భవించింది జీవితమన్నది శాశ్వతం. శాశ్వతమైన యీ జీవితం నీ యిచ్ఛాపూర్వకంగా నా వలన జీవింపబడుతుంది. " జీవితము " నకు సంబంధించిన ప్రకటనలోని ప్రతి మాట నా కృప వుంటేనే జరుగుతుంది. "

ఈ విధంగా బాబా పూర్వ జీవనం, నవజీవనం రెండూ అంతమై అద్భుత రీతిలో మలచ బడినవి. కొత్తగా వుద్భవించిన శాశ్వత ఘట్టానికి బాబా " శాశ్వత జీవితం " అని పేరు పెట్టారు. " జీవితం " అంటే పాత క్రొత్తల మేలి కలయిక అన్నమాట. బాబా గడిపిన నవజీవనానికి అవతారుని మంత్రాంగంలో విశిష్టమైన భావం వుంది. మానవాళి హృదయాల్ని మేల్కొలిపేందుకు బాహ్యంగా ఆయన చేసిన కార్యక్రమాలన్నీ పరందాల వంటివి. మనం కనుక ఆయన చేసిన బాహ్య కార్యక్రమాలకి ప్రాధాన్యత యిస్తే, ఆయన నవజీవనపు ప్రాశస్త్యం పోతుంది. ధ్రువ తారగా ఆచంద్రార్కం ఆయన నవజీవనం శాశ్వతంగా కొనసాగుతుంది. ఏ ఒక్కరూ ఆయన నవజీవనాన్ని అనుకరించలేరు.

సర్వోన్నతుడైన భగవంతుడు హీనమైన యాచకునిగా మారాడంటే, జగత్తులో బానిస బ్రతుకు బ్రతుకుతున్న వారిని, అతి త్వరగా వుద్ధరించుటకే. వైవీమానవునితో సహ జీవనమంటే అంత సులభంగాదు. పరిమితులతో కూడిన మానవుల్ని అగ్ని

పరీక్షలకు గురిచేసి వారి శక్తి సామర్థ్యాలను నిగ్గు తేల్చటమే నవజీవన ప్రధాన ఉద్దేశ్యం. తన సన్నిహిత సహచరులు ఎన్నో కఠినమైన పరీక్షల నెదుర్కొన్నారు. వారు గోను తలపాగా లెట్టుకున్నారు. గోచీ పెట్టుకున్నారు. భిక్షాటన చేశారు. నవజీవన కాలమంతా సూర్య చంద్రాదుల నడ్డు పెట్టుకొని బ్రతుకు సాగించారు. ఎంతటి కష్టాల్ని ఓర్చుకొని, సర్వం విధేయతతో దైవీమానవునికే సమర్పించుకున్నారు.

## నవజీవనం పరిసమాప్తం

బాబా నవజీవనం గురించి యీ విధంగా చెప్పారు. " ఈ నవజీవనం అంతము లేనిది. నా భౌతిక శరీర త్యాగానంతరం కూడ అది సజీవంగా వుంటుంది. ఎవరైతే అసత్యాన్ని పూర్తిగా త్యజించి జీవిస్తారో వారివలన అది సజీవంగా వుంటుంది. అరిషడ్వర్గాలను వదిలి జీవించు వారిచేత కామపూరిత చర్యలు చేయని వారు, పరోక్షంగా దుర్భాషలాడని వారు, అధికారము, భౌతిక సంపదలను కోరని వారు, వ్యక్తి ఆరాధన తిరస్కరించెడి వారు, గౌరవాగౌరవముల కతీతులైనవారు, దేని వలన భయపడని వారు, భగవంతుని యందు పూర్తి విశ్వాసముంచి జీవించువారు, ప్రేమకోసరమే భగవంతుడ్ని ప్రేమించువారు, దైవ ప్రేమికుల యెడల నమ్మకము కలవారు, భగవదవతారములందు విశ్వాసముంచువారు, సత్యము వీడని వారు, ప్రకృతి ప్రళయములను ధైర్యముతో ఎదుర్కొని నూరుపాళ్ళు ఆనందంతో గడుపువారు, కులాలకు, మతాలకు శిష్టాచారాలకు ప్రాధాన్యత యివ్వని వారి

చేత యీ నవజీవనం అంతం లేకుండా శాశ్వతంగావుంటుంది ”
అని బాబా ప్రకటించారు.

స్వార్థంతో జీవించేవారికే నవజీవనం వుద్దేశించబడలేదు. అత్యంత వినయంతో స్వార్థం వదులుకుంటేనే యీ దైవీ-మానవుని ఆటలో సంబంధం పెట్టుకోగలరు. నిజమైన నవజీవనమంటే, మనసా వాచా కర్మణా ప్రతి చేతలోను, మాటలోను, ఆలోచనలోను అవతారుని మిత్రత్వంపై ప్రగాఢ విశ్వాసం; మనకు వుండాలి. బాహ్యపరిత్యాగం ముఖ్యం కాదు. అంతరంగంలో హృదయపూర్వకమైన పరిత్యాగం, ప్రపంచ బంధాల్ని వదులుకోవటం కావాలి. నవజీవనమంటే జీవితంలో క్రొత్తపంథా తొక్కటం. మన పాత స్వార్థపూరిత బంధాల్ని వదిలి, వినయంతో గౌరవప్రదమైన నిజాయితీ గల జీవనం గడుపుతూ దైవీమానవుని కృపకు పాత్రులు కాగలగాలి.

నవజీవనంలో బాబా దైవ సహాయం అర్థిస్తూ ఎదురు చూడని సంఘటనలెన్నో ఎదుర్కొనటం జరిగింది. అయితే అవన్నీ ఏవో అద్భుతశక్తి ప్రదర్శించి చేసిన మహత్తులేమీ కావు. ఆయన సాధారణ మానవునివలె సంచరించారు. కనుక, అవన్నీ దైవ సహాయంతో మానవ స్థాయిలో దిగివచ్చిన కరుణామయుడైన అవతారుని అతి సహజ అద్భుతలీల అని చెప్పవచ్చును. యీ సత్యాన్ని ఫిబ్రవరి 6 వ తేదీన బాబా ఒక సందేశమిస్తూ, “ నా మట్టుకు, నేను చేసిన పనిలో పూర్తి సంతృప్తి పొందానని, అయితే యిప్పుడు నేను మరల నా పూర్వ వ్యవస్థితిని కూడా

పొందాను " అని సందేశమిచ్చారు. అంటే, మెహెర్‌బాబా పాత జీవితపు స్థితిలో అనంతశక్తి, అనంతజ్ఞానం, అనంత ఆనందము లనే భగవంతుని త్రిగుణాలను మళ్ళీ ఇప్పుడు పుణికిపుచ్చుకున్నా రన్నమాట.

అంతలోనే బాబా పాశ్చాత్య పర్యటనలకు అన్ని ఏర్పాట్లు పూర్తికావచ్చాయి. మనోనాశన కాలం పూర్తి కాగానే, పాత, కొత్త జీవితముల మేలికలయికతో " జీవితం " అనేది ఆవిర్భవించిం దని యింతకు ముందే చెప్పుకున్నాం కదా ! యీ జీవితాన్ని మూడు భాగాలుగా విభజించి, వాటిని అనుభవించేందుకు తేదీలను కూడ నిర్ణయించారు. మొదటిది " జటిలమైన స్వేచ్ఛా జీవితం" రెండవది " సంపూర్ణ స్వేచ్ఛా జీవితం " మూడవది "జాజ్వల్య మాన స్వేచ్ఛా జీవితం." 1952 మార్చి 21 న జటిలమైనటువంటి సంక్లిష్ట స్వేచ్ఛా జీవితం ప్రారంభమై జూలై 9 వరకూ కొనసాగుతుంది. యిందులో స్వేచ్ఛపై బంధాలు అజమాయిషీ చెలాయిస్తయి. జూలై 10 నుండి నవంబరు 14 వరకూ నిండు స్వేచ్ఛా జీవితం సాగిస్తామన్నారు. యీ కాలంలో బంధాలపై స్వేచ్ఛ ఆధిపత్యం వహిస్తుంది. నవంబరు 15 నుండి ప్రారంభ మయిన ప్రచండమైన జ్యోతిర్మయ స్వేచ్ఛా జీవనంలో, స్వేచ్ఛ బంధనములు రెండు దైవ కృపవలన దైవజీవితంలో కలిసి పోతాయని ప్రకటించారు.

1952 ఫిబ్రవరి 12 వ తేదీతో నవజీవనం ముగియటంతో బాబా మనోనాశ్ ఏకాంతవాసంనుండి బయటకు వచ్చేశారు. కాని మనోనాశ ఏకాంతవాసం మాత్రం, 1952 ఫిబ్రవరి 16 వ తేదీతో

అంతమయింది. నవజీవన కాలంలో బాబా సాధారణ మానవుడిలా, మానసిక, దైహిక శ్రమకు భౌతికంగా శ్రమకు గురై, అకాల భోజనం, నిద్రాహారాలు లేమి చేత, అందునా మనోనాశ కాలంలో మరింత బాధకు లోనైనారు. శారీరక శ్రమతో అనారోగ్యానికి గురియైన బాబా నవజీవనం నుండి బయటకు వచ్చే సరికి, శారీరకంగా అలసిపోవటమేకాక, మూలశంఖ వ్యాధిసంక్రమించింది. 26-2-1952 న మూలశంఖ వ్యాధికి శస్త్ర చికిత్స చేశారు. బాగా కోలుకోవడానికి దాదాపు నెల రోజులు పట్టింది. 9-4-52 న అమెరికా వెళ్ళేందుకు నిర్ణయించి, రెండవ జీవిత సర్క్యులరు పంపుతూ, ప్రేమికులను ఒక్కొక్కరిని రు 25/ లకు తగ్గకుండాను, రు 5000/- లకు మించకుండాను, తమ తాహతునిబట్టి ఆదీ. కె. ఇరానీ, కింగ్స్ రోడ్డు, అహ్మదునగరు పేర పంపమని ఆదేశాలు జారీ చేశారు.

జీ వి త ం

యీ చిరు కానుక మార్చి 21 లోపల పంపాలి. తమ తాహతుకు మించి పంపకూడదు. ప్రేమతో ఇవ్వాలి. దానికి బదులు ప్రతిఫలం కోరకూడదు. అలా పంపించేవారు, వారు నివసిస్తున్న దేశాల చట్టాలకు వ్యతిరేకంగా నడుచుకోరాదని ఆదేశించారు. మార్చి 21 " జటిలమైన స్వేచ్ఛా జీవితా " నికి మొదటి రోజు కనుక " జీవితము " యొక్క విశదీకరణలోని మొదటి భాగమైన యీ దశలో స్వేచ్ఛ కంటే బంధనమే ఎక్కువ ప్రాబల్యం కలిగి వుంటుంది. తపను ప్రేమిస్తూ తనపై

విశ్వాసముంచిన వారికి బాబా ఒక సందేశమిస్తూ, ఎవరిలో ప్రథమంగా భగవంతుడు తన అనంత శక్తి, జ్ఞానానందములతో శాశ్వత అస్థిత్వంతో ప్రకాశిస్తున్నాడో, ఆ దైవీమానవునికి మనం పూర్తిగా సమర్పణ కావాలి. ప్రపంచంలో విద్యుక్త ధర్మాల్ని ఆచరిస్తూ, దేనియందు రక్తి కలగకుండా జీవిస్తూ యీ జగత్తంతా మాయ అని, భగవంతుడొక్కడే సత్యమని నిర్మల హృదయంతో విశ్వసించి, సన్యాసివలె గృహస్తుగా జీవించాలి. ఇదే జటిలమయిన స్వేచ్ఛా జీవితం.

యిహ పోతే పూర్ణ స్వేచ్ఛా జీవితంలో స్వేచ్ఛయే, బంధనం కంటే, అధికమై ప్రబలంగా వుంటుంది. తన గురించి కాక, ఇతరుల సుఖం కోసమే ఆలోచిస్తూ, ఎటువంటి ప్రతిఫలాన్ని ఆపేక్షించకుండా, ఎన్ని కష్టాలు వచ్చినా, ఒడిదుడుకులెదురైనా, మనోస్థైర్యంతో ఎదుర్కొని, ఇతరుల మంచికోసరం తమ సౌఖ్యాన్ని త్యాగం చేయటం పూర్ణ స్వేచ్ఛా జీవితం.

జ్యోతిర్మయ స్వేచ్ఛా జీవితంలో స్వేచ్ఛ, బంధనము, దేవుని కృపవలన దివ్యజీవితంలో కలిసి పోతయి. నవంబరు 15 నుండి ప్రారంభమయ్యే జ్యోతిర్మయ స్వేచ్ఛా జీవితం దిగ్విజయ మయ్యేందుకు ఈరుచ్ని ఏడు నెలలపాటు, భారతదేశం, పాకిస్తాను అంతా పర్యటించి తన పనికోసరం తగిన వాతావరణం సృష్టించేందుకు కొందరు ప్రేమికుల్ని సిద్ధం చేయమని నియమించారు. అలా చేసినందువలన, తన ప్రేమికులు దివ్య

ప్రేమలో ఆహుతై నిస్వార్థ కార్యకర్తలు కాగలరని బాబా చెప్పారు.

నవజీవన కాలంలో తాను చేసిన పనియొక్క ఫలితం కనపడాలంటే, అది విజయం కానీ అపజయంకానీ, రెండు వారాల పాటు అమెరికాలో ఏకాంతవాసం గడపాలని బాబా నిశ్చయించారు. 1952 ఏప్రియల్ 18 న రాత్రి 10-30 గంటలకు బొంబాయి శాంతాక్రజ్ విమానాశ్రయంనుంచి అమెరికాకు 15 మంది స్త్రీ పురుష మండలితో బయలు దేరి వెళ్ళారు. చిక్కులతో కూడిన " జటిలమగు స్వేచ్ఛా జీవితం " 'పూర్తి స్వేచ్ఛాజీవితం' దాదాపు అమెరికాలోనే పూర్తి చేసుకొని ఆగష్టు 21 నాటికి అమెరికానుండి బొంబాయికి తిరిగి వచ్చారు. మొదటి రెండు ఘట్టాలు సమైక్యమై నవంబరు 15 నుండి జ్యోతిర్మయ స్వేచ్ఛా జీవితం ప్రారంభమైంది. జటిలమయిన స్వేచ్ఛా జీవిత సమయంలో బాబాకు అమెరికాలో కారు ప్రమాదం జరిగింది. కుడి పార్శ్వమంతా విరిగిపోయింది.

నవజీవనం అయిపోయింతర్వాత, ఆయన ప్రారంభించిన స్వేచ్ఛా జీవితం ఆఖరిఘట్టం. ఈ జ్యోతిర్మయ జీవితంలో స్వేచ్ఛా, బంధము కూడా ఆయన దివ్య ప్రేమలో లీనమైపోయి మాయ సమూలంగా నాశనమైపోతుంది. దేశమంతా మూడు నెలలు తిరిగితే కానీ యీ జ్యోతిర్మయ జీవితం పూర్తికాదని బాబా చెప్పారు. ఈ జ్యోతిర్మయ జీవితం ప్రారంభించబోయే ముందు 10 రోజుల పాటు అహోరాత్రులు 12 మంది శిష్యుల

చేత, వంతుల వారిగా కొన్ని వేల సార్లు పైకి వినిపించేలా భగవంతుని నామాన్ని వివిధ మతముల పేర్లతో జపించేటట్లు చేశారు. జెందావెస్తా బైబిల్, ఖురాన్, గ్రంథ సాహెబ్, జ్ఞానేశ్వరి గ్రంథములనుండి కొన్ని భాగాలు చదివించారు.

తానే స్వయంగా అయిదు ప్రధాన మతాల పేరిట ప్రార్థనలు చేస్తున్నట్లు గుర్తుగా, అయిదుగురు శిష్యుల్ని ఒకరు శాస్త్రిగా, ఒకరు దస్తూర్‌గా, ఒకరు ముల్లాగా, ఒకరు గ్రంధిగా, మరియొకరు పురోహితుడుగా వ్యవహరించేట్లు నియమించారు. ఈ బాహ్య ఆచారాల గురించి బాబా యిలా చెప్పారు. "పవిత్ర గ్రంథాలను పైకి చదవడం, భగవన్నామోచ్చారణ, ప్రార్థనలు పైకి వినిపించేలా చేయడం భక్తి శ్రద్ధలతో చేయాలి. అలా చేయనప్పుడు అవి ఎందుకూ పనికిరాక, గాలిలో ధూళిలో కలిసిపోతయి. అందుకే వీటిని నమ్రతతో సక్రమంగా చేయాలి. మతపరమైన ఆచారాలు దివ్య జీవనానికి ఓనమాలవంటివి. నా కోసరం వాటిని ఆచరించేటప్పుడు ఎంతో శ్రద్ధతో మీరు చేయాలి." అని బాబా శిష్యులతో చెప్పారు.

ఇన్ని సంవత్సరాలూ ఒక సద్గురువుగా కీర్తింపబడిన బాబా నవజీవనంలో ఒక సాధకుని వలె మనోనాశం పొందేందుకు పని చేశారు. స్వేచ్ఛా జీవితంలో బలము, బలహీనత రెండూ కలిగిన ప్రభువుగా, భక్తుడుగానూ రెండు పాత్రలు వహించారు. ఇప్పుడు జ్యోతిర్మయ జీవితం ప్రారంభించుటకు ముందు శాయిబాబా, ఉపాశినీ మహరాజు, బాబాజాన్ సమాధులు దర్శించి, జోహారు

లర్పించారు. తరువాత బొంబాయి వెళ్ళి కొందరు మస్తులను కలిసి ప్రణమిల్లి 15 వ తేదీన జ్యోతిర్మయ జీవితం ప్రారంభించారు.

ఈ జ్యోతిర్మయ జీవితం పర్యటనకు నిర్దేశించబడింది. ముందుగా కాన్పూరు చేరుకున్నారు. తరువాత హమీర్‌పూర్ వెళ్ళారు. హమీర్‌పూరు జిల్లా ముఖ్యపట్టణం. యమునా, బెత్వా నదుల మధ్య యీ జిల్లా వుంది. యీ ప్రయాణంలోనే పుకార్‌తో మెహెర్‌పురి నిర్మాణం గురించి సూచించారు. ప్రజాదర్శన మిచ్చారు. అలా ప్రారంభమైన పర్యటన, అనేక పట్టణాలు సందర్శిస్తూ, ఆంధ్రదేశం ప్రప్రథమంగా పర్యటించారు. ఎన్నో సంవత్సరాలుగా బాబాని ఆంధ్రప్రేమికులు తమ రాష్ట్రానికి రమ్మనమని ఆహ్వానించిన కోరిక యిప్పుడు నెరవేరింది. చాలా వూళ్ళల్లో ప్రజా దర్శనమిచ్చారు. యితర నగరాల్లో ఇచ్చిన ప్రజా దర్శన ఫిలుములను కూడ ప్రదర్శించారు. జ్యోతిర్మయ స్వేచ్ఛా జీవిత వివరణమును ఆంధ్ర పర్యటనలోనే వివరించి చెప్పారు. యీ పర్యటన జనవరి 31 తో ముగించుకొని అహ్మదు నగరం చేరుకున్నారు.

ఫిబ్రవరి 16 నుండి మళ్ళీ పర్యటన చేస్తూ, దరిద్ర నారాయణ సేవలో పాల్గొన్నారు. ఎక్కువ భాగం ఉత్తర భారతంలో గడిపారు. పశ్చాత్తాప ప్రార్థన, పర్వర్దిగార్ ప్రార్థన, " సర్వోన్నతుడు " మున్నగు అనేక సందేశాలు, యీ జ్యోతిర్మయ జీవిత ఘట్టంలోనే అందించబడినయి. 1969 లో గురు ప్రసాదులో

దర్శన కార్యక్రమం జరిగింది. పెక్కు మంది భారతీయులతో పాటు పాశ్చాత్యులు కూడా కొందరు పాల్గొన్నారు. ఈరుచ్ తో బాబా నవజీవనం గురించి పాశ్చాత్యులు అనేక సంభాషిస్తూ, నవ జీవనం గురించి ప్రశ్నించుట జరిగింది. అందుకు ఈరుచ్ చెప్పిన జవాబు తెలుసుకోదగ్గదే !

" నవజీవనం రోజుల్లో ప్రియతముని సాంగత్యంలో, అనునిత్యం మేము పాడుకొనే ప్రేమ గీతికకన్నా వివరించి చెప్ప తగిందేదీ లేదు. బాబా సహాయంతో డా॥ అబ్దుల్ ఘనీమున్షిఫ్, ఆ గీతాన్ని తయారు చేశాడు. అది వుర్దూలో వ్రాయబడిన గీతం " అని చెప్పి, ఆ వుర్దూ గీతాన్ని ఇంగ్లీషులో తర్జుమా చేసి వినిపించాడు. దాని తెలుగు అనుసరణ మీకు యీ క్రింది విధంగా అందిస్తున్నాను. యీ పాట బాబా సహాయంతో డా॥ ఘనీ తయారు చేయగా, నవజీవనం రోజుల్లో మిత్రులంతా నిత్యం పాడేవారు. యీ పాటను బట్టి నవజీవనం గురించి కొంతవరకు తెలియగలదు. స్నేహితుడుగా బాబా తన శిష్యులతో ఎలా గడిపారంటే, చివరకాయన తన దుస్తుల్ని తానే వుతుక్కునేవారు. తన పాత్రలను తానే కడుక్కునేవారు. శిష్యులెంతో క్రమ శిక్షణతో ఆయన ఆజ్ఞలు పాటించేవారు.



# నవజీవన గీతం

1. వినుడు వినుడీ – మెహెర్ ప్రేమ సుధా గీతిక ॥వినుడు॥
బాబా మౌనపు పలుకులు – భక్తుల కథలకు మూలం
మౌనంతోటీ పలికిన పలుకులు – ఆచరించుటకు ఆధారం
బ్రతుకుట భారం అయితే – భగవంతుడు దూరం అయితే
ఈ నిస్సారపు జీవితం వదిలేద్దాం – బ్రతుకంతా
దేముని దిశగా మళ్ళిద్దాం

2. విజయమైనా వీర స్వర్గమైనా – బాబాతోటే జీవనం
భగవంతునిపై విశ్వాసంతో, – జీవితమంతా గడిపేద్దాం
నవజీవన సాంగత్యంలో – ఇచ్ఛతో చర్యలు చేసేద్దాం
ఆనందంగా గడిపేద్దాం – నిరాశా గీతం ఆలపిద్దాం
సంక్షోభంలో కష్టాలొస్తే - సంతోషంగా ఆహ్వానిస్తాం
సమస్యలొస్తే – సాదరంగా రా రమ్మందాం.

3. ఆశ నిరాశైతే – హాయిగా నవ్వేద్దాం
చేసిన బాసలు భగ్నం అయితే – ఆనందంగా గడిపేద్దాం
కీర్తిని కాంక్షించం – ఆర్తిని కొని తెచ్చుకోం
పరోక్ష నిందలు చేయం – భయమంటే ఎరుగం.

4. తికమకలంటూ రావు – అరిషడ్వర్గములెరుగం
క్షణికావేశము రాదు – ఇదీ మా "నవజీవన" దృశ్యం
మతం లేదు, కులం లేదు – తనువూ మనసులపై
మరులే లేవు
భవ బంధాలను విడిచేశాం - మత మౌఢ్యాలను వదిలేశాం.

5. చిన్నా పెద్దా లేడా లేదు - గురువూ శిష్యుడు ప్రశ్నే రాదు
హిందూ ముస్లిం తేడా లేదు - అందరం ఒకే నావన
పయనిస్తాం
సోదరభావం స్నేహతత్వం - ఇవే మా "నవజీవన"
బంధం
ఆనందాని కదే కందెన - దేముని చేర్చే వంతెన.

6. ప్రపంచ మంటే చింతే లేదు - స్వర్గం నరకం లెక్కే
లేదు
తాంత్రిక శక్తుల చింతన లేదు - విషయ వాంఛలు
జ్ఞప్తికి రావు
మంత్ర సిద్ధులు మహిమలు - అన్నీ వట్టి అసత్యాలు
మనస్సు నుండీ తోలేశాం - వాటి చింత నిక రానే రాదు.

7. వర్తమాన జీవనం - అది ఎంతో అమూల్యం
ప్రియతములారా వినండి - బాబా పలుకుల సారం
బాబాతో నవజీవనం - ఎన్ని కష్టాలున్నా పరమానందం
ఇతర చింతన లేమీ రావు - కోరికలంటూ లేనే లేవు
మ నస్థాయినే బాబా వున్నా - ఫలితం కోసం ఆశించం
మంచీ చెడ్డా లేడా చూడం - బాబా ఆజ్ఞలు పాటించేస్తాం,

8. స్వర్గాలన్నీ కూలనీ - సత్యం మాత్రం వీడం
నిరాశైనా, నిస్పృహలైనా - సర్వ నాశనం చేసేస్తాం
నిత్య సంతుష్టులం - ఆత్మ సంతృప్తులం
జీవిత వనాన్ని పెకలిస్తాం - నందన వనాన్ని సృష్టిస్తాం

సంతోషం సగం బలం - ఆత్మ తృప్తి సంపూర్తి బలం
యివే నవ సృష్టికి మూలం - ఆనంద వనానికి బీజం.

9. మా హృదయం ముక్కలు కానీ - ప్రళయమే ముంచుకురానీ
నిరంతరం చిరు నవ్వులు చిందిస్తాం - పెదవులపై
దరహాసం వెలిగిస్తాం
విశేష మొకటి చెబుతున్నాం — విశదంగా వినండి !
పైసా లేని మన హస్తంలో - తెలియని సంపద
ఎంతో వుంది
నిత్యం గడిపే భిక్షుక వృత్తికి -
రాజులు సైతం యీర్ష్య చెందును
అందుకే ముక్తిని యిచ్చే జీవనం -
ముదమును గూర్చే "నవజీవనం"

10. ఆనందం క్షణికం అయితే - జీవితమంతా ఘర్షణ
నిస్వార్థం, నిర్లిప్తత - యివే శాంతికి ప్రేరణ
ఈ సృష్టికి మూలం దైవం - ప్రవక్త లుండుట సత్యం
యుగానికో అవతారుడు — క్షణానికో వలీ —
ఇదే బాబా భాష్యం
బాబాతోటి జీవనం నిరాశామయ జీవనం
నిస్పృహామయ జీవనం — బాబా నేర్పిన శిక్షణం
ఇదేనండి ! ఇదేనండి !! నవజీవనం - బాబాతోటి
జీవనం ॥వినుకు॥





‘నవజీవనం’ గ్రంథావలోకన సందర్భంలో తీసిన ఛాయాచిత్రం

